శ్రీరస్తు.

# భోజసుతాపరిణయము

అను మహాప్రబంధము.

ఇది

శ్రీమన్మదనగోపాలకారుణ్యకటాక్షవీక్షణావాప్తచతురతరసాహితీవైభవ

చక్రపాణ్యాత్మసంభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల

మార్గణపిత్రోణేతి మహాశ్లాల కోవిదనుతబాగధేయ

## కోటేశ్వరనామధేయ

ప్రణీతము.


చెన్నపురి.

శ్రీ "వైజయంతీ" ముద్రాక్షరశాలయందు

ముద్రితమును, ప్రకటితంబు.

1909




[Price [illegible] annas.

# PREFATORY NOTE.

In passing this book through the Press I have taken the liberty of removing some verses and altering others in order to satisfy the demands of modern taste as regards descriptions of feminine charms &c. This I did under the direction of my father the late Rai Bahadur P. Ananda Charlu who always held that in publishing an old book written by an author of a by-gone age it is the duty of the publisher to see that it suits the taste of the reader before whom it is placed.

I am sorry I have not been able to procure any information about the author beyond what our veteran scholar Rai Bahadur K. Veerasalingam Pantulu has given in his "Lives of Poets."

In this book the reader will find a number of stanzas written on the lines of the eminent poets of Krishna Deva Rayalu's days. I shall just cite one of them.

ఉ. నెలఁతా సర్వదుర్గతిఁ జెందఁ గోరి కొరా ◆ జీవంబు లెంతే వన
  స్థలి నిప్పుల్ తప మాచరింప నిజము ◆ త్రిక్షేత్ర వాసంపన్నతన్
  జలజం బందెఁ బదాత్తతి న్విధుఁ డజ ◆ స్రంబుం గళంకాప్తిఁ జ
  ప్పల చొందం గనఁ డయ్యెఁ గాన నదినో ◆ తద్వైరమూలం బిలన్.

This is clearly on the lines of the following stanza in [illegible].

మ. నతి యనూనాంబుదచ్ఛాయ జెందుగ జూచి నదిని ◆ ప్రద్యోతనోదక్రియా
  ... గాంచోత్పలపద్మారితో వరము ◆ రంభోద్భవా స్తంభములు
  న్నత లక్ష్మి విడె మరుద్వ్యభూతిఁ గదలన్ ◆ ద్యోస్థానమా చందచేలో
  న్నతి శుంఠత్వేఁ బాయ దయ్యె నదియున్ ◆ తన్వైరమూలంబిలన్.

P. SREENIVASA CHARLU.

Lakeside, Kilpauk,
Madras,
*23rd September 1909.*

శ్రీరస్తు.

# భోజసుతాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీవాణీకరచామరద్వయరుచుల్ ♦ చెన్నొందువక్త్రస్ఫుర
ల్లావణ్యాఖ్యపయోధిఫేనికలలీ ♦ లన్ జాలరాణింపఁగా
నైవాంకస్థలభద్రపీఠవసతిన్ ♦ శోభిల్లుతిన్ గాంచునా
ర్యావామాక్షియొసంగుమాకపులవి ♦ దైశ్వర్యసత్కీర్తులన్. ౧.

ఉ. ఐలిమలరాదకన్నియవి ♦ వాహమహోత్సవవేళఁజాలన
త్రిలిఁదలఁబ్రాలుపోసెడుత ♦ తిన్నిజమస్తమ్ముగాంకలగ్నమై
విలసిలుశేడితన్ముఖన ♦ శివవిధుంగనిచెంగలింపన
క్కలికికలంగనవ్వుకైజ ♦ కంసుఁడుమాకుఁబ్రీష్టమిచ్చుశాన్. ౨.

మ. వరపుంభావకళానిమూఢీధరణీ ♦ వామాక్షిక్రీడించియం
తరతిశ్రాంతినిశ్వాలవక్షమునఁద ♦ ద్గాత్రచ్ఛవిస్ఫూర్తిమే
దురమైనెమ్మియియందునిండవిలస ♦ ద్దూర్వాంకురగ్రాహియౌ
హరినీలంబనఁబొల్చుకృష్ణుఁడుమదీ ♦ యాభీష్టమిచ్చుంగృపన్. ౩.

మ. తతబాహాపురుహూతరత్నరుచిర ♦ స్తంభస్ఫురత్కౌస్తుభ
ద్యుతిసంతానవితానహారలతికా ♦ ప్రోద్యత్సుమస్నిగ్ధమా
పతివక్షంబునఁబొందిరంజిలురమా ♦ పంకేజపత్రాక్షిమా
కతులైశ్వర్యములిచ్చుఁగావుతదయా ♦ వ్యాపారపారీణతన్. ౪.

ఉ. అలిగినభారతీసతిని ♦ జాంఘ్రములపైనిటలంబుఁజేర్చియుం
దలవశుయావకాంకములు ♦ హల్లకసాయకసాయకక్షతా
కలనముగాఁదలంచిదయఁ ♦ గౌఁగిటఁజేర్చుచునంతసిల్లున
జ్జలజభవుండుమాకొసఁగు ♦ సమ్మతభూతిచిరాయురున్నతుల్. ౫.

చ. పలువగవీణెమీటుతఱిఁ ♦ బాణిపయోరుహరత్నవిస్ఫుర
ద్వలయమయూఖముల్ కలయఁ ♦ బర్వఁబ్రవాళముపైఁబ్రవాళముల్

నలువఁగఁ బోఁచె మేలనుచు ♦ నాథుఁడె సర్వగఁ బల్కు నవ్వన
ప్పలుకుల కుల్కులాడెడి నను ♦ భవ్యకవిత్వధురీణుఁ జేయుతన్. ౬.

మ. రదఘాతోత్థితరాజతాచలరజో ♦ వ్రాతంబు నిండారఁగా
మదిరాయె దిక్కులఁ జిక్కఁటిల్లఁ దనకొ ♦ మ్మున్ జిమ్ముల న్నీడు పె
ల్లదివిజ్ఞాజందుఁడ్రై వెలుంగు నదరీ ♦ లావప్రఖేలారతిన్
ముదముం గాంచు మకరేంద్రవక్త్రుఁడు శుభం ♦ బుల్లాసఁ గావించుతన్. ౭.

మ. హరినాభిన్ జన్మించు మజ్జుఁడుఁ బా ♦ ల్యక్రీడనాసక్తిబిం
దురభోగాగ్రవిరత్నరత్నరుచిసం ♦ దోహైకవాంఛాస్థిత
ద్విరదాద్యుక్తతఁ జేరఁ జించి నఫణా ♦ వ్యాసక్తపద్మప్రభా
భరణశ్రీరహిఁ జెందు శేషుఁడు వదః ♦ ప్రాగల్భ్యమిచ్చుం గృపన్. ౮.

క. ఏమునివదనసుధాబ్ధి, రామాయణసుధ జనించి ♦ నానాకథక
ప్రేమాస్పదమై వనరెడు, నామునిహృత్యజనతమస్త్రి ♦ రామునిఁ గొలుతున్. ౯.

ఉ. సారపయోధరప్రకర ♦ సాంద్రతనుద్యుతి బాలుఁ బల్లవ
స్ఫారజటావిశాలు మృగ ♦ స్తన్యసుస్థితచేలుఁ బ్రాగ్వచో
వారిధియానపాత్రు సుర ♦ వందితదివ్యచరిత్రు నాత్మవి
ద్యారమణీవిశేయునన ♦ పాయని సాత్యవతేయుఁ గొల్చెదన్. ౧౦.

సీ. ఉపమానకల్పనా ♦ నుపమానచాతురీ, ఘనమనీషోల్లాసుఁ ♦ గాళిదాసు
లలితపదన్యాస ♦ కలితప్రబంధైక, తానతాకుకవితా ♦ దండిదండి
సారవాగమితార్థ ♦ గౌరవాధారతా, రవిరుచిసాంద్రుభా ♦ రవికవీంద్రు
సకలార్థకల్పనా ♦ వికలాంతసాహితీ, శ్లాఘనీయురసైక ♦ మేఘమాఘు
నంధ్రకవితామహాచార్యు ♦ నన్నపార్యు, సుకవిజనసంస్తుతికిరాజి ♦ సోమయాజి
నఖిలభువనజనశ్లేషి నె ♦ ఱ్ఱనమనీషి, నెంతుఁ బ్రార్థింతు సేవింతు ♦ హితము గాంతు.

క. మేధావిలాసనంభృతి, మాధవపర్యంకభోగి ♦ మండనసమరూ
పాధునికకవివరేణ్యుల, సాధువచోనియతిఁ దలఁచి ♦ సన్నుతి సేతున్. ౧౨.

తే. సత్కవిశ్వాసు నెదురంగఁ ♦ జాలకవలఁ, జెందుకూతలె కూయుచు ♦ జెనఁటి మొఱకు
మత్తకరికుంభవిదళనో ♦ ద్వృత్తహరిని, మొనయు లెక్కనుకుక్కలు ♦ మొఱుఁగునటుల.

వ. అని యిష్టవిధంబున నిష్టదేవతావందనరూపమంగళాచరణంబును, బురాతనకవిజనాను
సరణంబును, నిదానీంతనకవిపురస్కృతియును, గుకవితిరస్కృతియునుం గావించి

యనేకకృతుల నిర్మింపం గోరి మురారిహృదయప్రసాదంబు నభిలషించి యున్నతటి
నొక్క పూర్వరాత్రంబునం బ్రభాతసమయంబున. ౧౪

మహాస్రగ్ధర. చరణాంభోజాతసంసేవితవిమలమనో ♦ జ్ఞప్రఫుల్లాభకాంతిన్
పరితోషంబొప్పుచుండం ♦ బ్రమదమదగజ ♦ సార్వభౌమగామింభోగా
పరిపూతానేకలోక ♦ ప్రకటితసుభగం ♦ భావుకాఖ్యానమౌళీ
భరణశ్రీకృష్ణుండై ♦ ప్రభువు వెడలంగ ♦ న్వప్ప శ్రీకృష్ణుఁడంతన్.

క. కనుపట్టినయాతనిపద, వనజంబులకు శిరముసోఁక ♦ వసుధాస్థలిపై.
వినయమున మ్రొక్కిమిక్కిలి, వినియతమతి నగుచుఁ దన్ను ♦ వించితి నిటులన్. ౧౬.

భుజంగప్రయాతము. అరిస్ఫారశంఖాగ్య ♦ హస్తారవిందా
సరోజాలయావాస్య ♦ వక్షస్థలిందా
శిరోన్యాసనిర్భిన్న ♦ వందారుబృందా
చరాజంగమాజస్ర ♦ సంపూర్ణతుందా. ౧౭.

సీ. సనకాదిమునిమనో ♦ జలజనిత్యనివాస, కమనీయతరదివ్య ♦ కనకవాస
దానవాధీశదం ♦ తావళిహర్యక్ష, శ్రీపదలాంఛన ♦ చిత్రవక్ష
వ్రజయోషాపదానంద ♦ బుజలోలమదభృంగ, కారుణ్యరసపూర్ణ ♦ కనదపాంగ
నానాత్వమతీత ♦ నైజసంపద్రూప, రమతిలాసజ్జిత ♦ శార్ఙ్గచాప
వినతజనబృందమందార ♦ వేదసార, వివిధభువనాననాధార ♦ భవవిదూర
నీలరుచిపాత్రకలితము ♦ స్మేరజైత్ర, కోకరిపుమిత్రనేత్రర ♦ మాకళత్ర. ౧౮.

క. అనియిట్లు సన్నుతించిన, ననుఁగనుఁగొని యాతఁడు ఘనాఘ ♦ నాఘనగర్జా
జనితగభీరస్వరమునఁ, గనుఁగొనలదయార్ద్రంబు ♦ గదలఁ గొనంగన్. ౧౯.

పంచచామరము. తిరంబుగా భవన్ముఖాబ్జ ♦ దివ్యసద్మవ్యవా
హ్యరీమరందసారధార ♦ సమ్మదంబొనర్పఁగాఁ
గరంబు నీవొనర్చు నవ్య ♦ కావ్యభవ్యమంజరిన్
ధరింపఁగోరినారమంచి ♦ తంబొనర్పుమా పయిన్. ౨౦.

క. దీనన్ మేలగు నీకని, యానళినదళాయతాక్షుఁ ♦ డంతర్హితుఁగాన్
నేను నుగ్రకున్న మేల్కని, మానసమాశ్చర్యజలధి ♦ మగ్నము గాఁగన్. ౨౧.

తే. బ్రహ్మరుద్రాదులకు నేని ♦ బడయరాని, విభునియలదివ్యమంగళ ♦ విగ్రహంబు
భళిరనాదృష్టిపథమున ♦ నిలిచెననిన, నెందు నా భాగ్యమహిమకు ♦ నీడుగలదె. ౨౨.

తే. సారతరతత్త్వపారస ♦ ధారవార, ఘనతనాశేముషీలత ♦ కందళించి
బుధనుతవచోవిలాసమున్ ♦ బ్రోలుపురాయ, దానినాతనిఁ బూజింపఁ ♦ దగవకాదె.

వ. అని నిశ్చయించి యేనును హర్షతరంగితం బగునంతరంగంబున నహస్యథోచితకృత్యమ్ములు నిర్వర్తించి వివిధసద్గుణసమన్వితుండును విద్వజ్జనపరివృతుండును మహితవిజ్ఞానజనకుండును మదీయజనకుండును నగు చక్రపాణామాత్యునిసమీపంబునకుం జని సముచితప్రకారంబున నతనిచరణారవిందంబులకు వందనం బాచరించి యరవిందలోచనుండు సన్నిధి యొనర్చి, యానతిచ్చిన తెఱం గెఱింగించిన నమ్మహానుభావుండును నద్భుతరసమ్ము గ్రమ్ముకొనుహృదయమ్మున తనసమీపమ్మున నున్నవిద్వజ్జనమ్ముల నుపలక్షించిన వారును గుతూహలంబున నన్నుం గనుంగొని యిట్లనిరి. ౨౫.

సీ. వెన్నపాక్కటిదమ్మి ♦ గన్నవేలుపు ఱేఁడు, తెలిపుల్గువయ్యాళి ♦ సలరువాఁడు
బయకారిజడదారి ♦ పాపనిగనువాఁడు, పల్కుచిల్కలకొల్కి ♦ పాలివాఁడు
చౌపంచతూపుల ♦ సైదోడుగలవాఁడు, ప్రామిన్కుతేప్రొద్దు ♦ సోమువాఁడు
నుదుటఁ గన్నులవాని ♦ నుదుటఁ గాచినవాఁడు, జగములఁ గలిగించు ♦ చతురులాఁడు
తూర్పుదొర వేఁడివేలుపు ♦ దుంతకొతు, రేయినడకరిసంద్రంపు ♦ ఱేఁడుగాడ్పు
లిబ్బిదొరగిబ్బనెక్కుఁడు ♦ గబ్బిమగఁడు, కొలువఁదనరుచునుండును ♦ నలువయొప్పుడు.

ఉ. ఆతనిమానసంబునను ♦ హోమహుతౌమునివర్యులుత్తను
ఖ్యాతసుణాఢ్యులాగమస ♦ దాఢ్యయనప్రతిభావిశేషసం
జాతమహత్త్వతత్త్వవిదు ♦ లష్టనబోధులశేషశాస్త్రని
ష్ణాతులు గొందఱీజగతి ♦ సన్నుతికెక్కినవారిలోపలన్. ౨౬.

క. శ్రీవత్సనామధేయుఁడు, ధీవిశ్రుతసుజనతావి ♦ ధేయుఁడు జగతిన్
బావనుఁ డైబుధకృతసం, భావనుఁ డైతనరుసతని ♦ వంశమునందున్. ౨౭.

చ. కలిగిరికొండతేందుకర ♦ కందళచంద్రసితారవిందని
ర్మలతరహారహీరశర ♦ రాజితభూధరశారదాభ్రమం
జులతరకీర్తిపాత్రులువి ♦ శుద్ధచరిత్రులులోకమిత్రుల
త్యలఘుకళాసమార్జితద ♦ యారసనిత్యులమాత్యులిమ్మహిన్. ౨౮.

క. వారలలోఁ గణపార్యుఁడు, వారితమేధావిహార ♦ వాచస్పతియై
చారుతరకీర్తిసంపద, చేరూఢికినెక్కె జగమ ♦ శేషము మెచ్చన్. ౨౯.

క. ప్రణుతద్విజరాజశిఖా, మణియైసార్వజ్ఞసాధి ♦ మనహీనలస
ద్గుణగరిమఁదనరి వెలయున్, గణపతిసచివుండుప్రమథ ♦ గణపతియనఁగన్. ౩౦.

క. శ్రీవత్సగోత్రజలనిధిఁ, జైవాతృకుఁ డైనగణప ♦ శౌరికి తనికిన్
దేవేరియైనలచ్చమ, కావెంకటమంత్రిచంద్రుఁ ♦ డంతజనించెన్. ౩౧.

క. ఆతనికిని బోలమాంబకు, సుతులుద్భవ మొందిరధిక ♦ సువ్రతమతులై
క్షితిఁ గణపార్యుఁడనంగను, మతిమంతుఁడు వెంకటాద్రి ♦ మంత్రియనంగన్. ౩౨.

క. ఆయిరువురిలో నగ్రజుఁ, డాయతగుణశాలి గణప ♦ యార్యుఁడు దనరున్
ధ్యాయాదిమయిదమూర్తి, తోయజసతితానుగతమ ♦ సువ్రతమనఁగన్. ౩౩.

క. ఆమంత్రివరుఁడు నిజభా, ర్యామణి గాసిద్ధిలింగ ♦ రాజతనూజన్
బ్రేమవరియించెఁ జెన్నమ, నామహితాసనుఁడు భీష్మ ♦ కాత్మజ మాడ్కిన్. ౩౪.

తే. ఘనుఁడు చెన్నమాంబికయందుఁ ♦ గనియె మువుర, గణపయార్యుండు సజ్జన ♦ ప్రణుతవిమల
చర్యులగు కేశవామాత్య ♦ ధుర్యు లింగ, నార్యమతి చక్రపామాత్య ♦ వర్యు నెలమి.

వ. అట్టి పుత్త్రపౌత్త్రవంశంబు నందు. ౩౬.

సీ. అనఘతరస్వాంత ♦ మను బాదు గావించి, తనకరుణారసా ♦ దకము నించి
పద్మాక్షపదయుగ ♦ పద్మములఁ జత గూర్చి, సంశయదుష్కీట ♦ సమితి నణఁచి
కీర్తనాముల పేరఁ ♦ గిసలముల్ గలిగించి, స్మరణసుమశ్రేణి ♦ సంఘటించి
స్నేహాఖ్యమకరంద ♦ బాహుళ్య మొనరించి, సత్కర్మనివహావ ♦ సనగడించి
యనుదినంబును వృద్ధి ♦ నలరునట్లు, కమలలోచనద్భక్తి ♦ కల్పవల్లి
నెనసి పోషించి ప్రాపించె ♦ నమితఫలము, సత్యలఘులీలఁ జక్రపా ♦ మాత్యవరుఁడు.

తే. ఆతనికి నమూల భార్యయై ♦ యఖిలబంధు, జనము దినమును బోషించు ♦ ఘనతఁ గాంచు
కసవరాజుక్క రాజు వెం ♦ కటమగన్న, మహితసద్గుణనికురంబ ♦ మంగమాంబ. ౩౭.

సీ. అన్నదానస్ఫూర్తి ♦ నన్నపూర్ణయనంగ, ధృతిశాంతిపటిమ భూ ♦ దేవియనఁగ
బతిహృదయానుకూ ♦ లతఁ బార్వతియనంగ, ఖ్యాతసద్గుణముల ♦ సీతయనఁగ
ననఘశీలమ్ముల ♦ ననసూయయే యన, నలఘుచర్యలదమ ♦ యంతియనఁగ
నమితవైభవముల ♦ నబ్ధిజాతయనంగ, విస్తృతకీర్తిసా ♦ విత్రియనఁగ
సకలబాంధవరక్షణ ♦ ప్రకటమహిమ, సన్నుతికి నెక్కు సుగుణప్ర ♦ సన్నలీలఁ
దనరు మధురోక్తికలసిల్లు ♦ ధర్మపరత, మానితవయోవలంబశ్రీ ♦ మంగమాంబ. ౩౯.

క. నారియ వురుఁ గావించిన, సారతపఃఫలమనంగ ♦ జనవరవదనాం
భోరుహమును రాయితముఖ, సారసతన్ గోటయభువి ♦ జనియించెనొగిన్. ౪౦.

శా. ప్రాయుణ్ గమ్మలవక్కణల్ వసనసే ♦ పద్దంబులౌనట్లుగాఁ
జేయున్ సత్కులబాంధవాప్తసుజన ♦ శ్రేణుల్ ప్రహర్షింపఁగా

గాయక్ బెద్దలఁగన్నయంతమదికి ♦ డక్కుల్ మీఱఁగా మేలుది
ర్ఘాయుశ్శ్రీనిధికోటయార్యుఁడనుచి ♦ ఖ్యాతింబ్రకాశింపఁడే. ౪౧.

సీ. తల్లిదండ్రులకన్న ♦ దైవంబుమఱివేఱె, కలదెయంచుఁదలంచు ♦ ఘనమనీష
విద్వజ్జనామోద ♦ విస్మయావహముగాఁ, గృతులొనర్పఁగఁజాలు ♦ నతిశయంబు
స్వామికార్యైకని ♦ ర్వాహసామర్థ్యంబు, వెలయింపఁజాలుని ♦ వేకపటిమ
సజ్జనుల్ తనుమెచ్చ ♦ సంతతాచారప్ర, వర్తనవర్తించు ♦ విమలబుద్ధి
కలిగివిలసితసత్కీర్తి ♦ కల్పవల్లి, ఘనసమఘలాయమానన ♦ క్షత్రనివహ
కుముదజాహితమండలి ♦ నమరితేజరిసు, శాశ్వతగుణైకధుర్యకో ♦ టీశ్వరార్య. ౪౨.

మ. తనకున్ గోటయమంత్రినీవగుపమ ♦ న్వల్లక్షినిక్షాఘునీ
యనినాదంబునుతూహలాతిశయమ్ము ♦ త్వద్ధాతృసీమంతినీ
కనదంఘ్రిద్వయరత్ననూపురనిస్వనా ♦ త్కారానుకారానురం
జనవత్సారసునిస్వనంబయిన్ను పా ♦ స్థానంబులందెంతయున్. ౪౩.

క. ఈవిధమునబాంధవసం, భావితగతిఁదనరుపుత్త్రి ♦ పౌత్త్రసమగ్ర
శ్రీవిలసిల్లెనుభువిరా, జీవాక్షునికరుణఁజెంది ♦ స్థిరతరకీర్తిన్. ౪౪.

తే. కానహరియానతిచ్చిన ♦ కరణినీవు, హరువుమెఱయంగసత్కీర్తి ♦ పరిణయంబు
కృతివినిర్మించియతనికం ♦ కితముసేయు, మఖిలశుభములుగలుగునీ ♦ కతనికృపను.

వ. అని సబహుమానంబుగా విద్వజ్జనం బానతిచ్చిన నేనును మహాప్రసాదం బని వారల వచనంబు లంగీకరించి పరమహర్షతరంగితాంతరంగుండ నగుచు నవ్వీరించి జనకుననకు ముఖోల్లాసకరంబుగా భోజకన్యాపరిణయం బనుమహాప్రబంధంబు రచియించి యీ కృతికి నపరిమితకృపాపారంపరీణాలుండును, నాశ్రితభరణశీలుండును నగుగోపాలుండే నాయకుండు గావలయు ననుదృఢాధ్యవసాయంబున నమ్మహాత్మునకును. ౪౫.

## షష్ఠ్యంతములు.

క. శ్రీరుచిరదివ్యదేహున, కారూఢపురాణవాక్ష ♦ యుద్వాహునకున్
గారుణ్యాపరీవాహున, కారుణ్యాలసద్భృగజ్జ ♦ హతమోహునకున్. ౪౬.

క. కరుణాశరధికివికలిత, తరుణాశరధికిసమగ్ర ♦ తరశరధికిస
త్వరితభుజంగాశరధికి, నిరవధిగుణనిధికిశుభద ♦ నిజసన్నిధికిన్. ౪౭.

క. చాణూరక్షోణీభృ, త్పాణిగరుత్ప్రదళనైక ♦ పరసురపతికిన్
వాణీశగ్వాణీగీ, ర్వాణీవరవర్ణనీయ ♦ వైభవధృతికిన్. ౪౮.

క. మగరాసంతతి మేడల, నిగనిగలందనరుచుచటి ♦ నీరేజాస్యల్
తగు పాలకపలిఁ బొడమిన, మగువలగతిఁ బోలుతురనుచ ♦ మాన్యశ్రీలన్. ౬౧.

సీ. సారహీరప్రభా ♦ సౌరాపగాలోక, నాగయాతసురతాప ♦ సాన్వ్రతములు
భుజగభుక్మణివిభా ♦ పూరఘనాసాంధకార, మందమానసుకేళి ♦ మైత్రకారులు
శతమఖరత్నచం ♦ చద్దీప్తనీలాబ్జ, హారసోత్సుకషట్పద ♦ యానవతములు
పద్మరాగద్యోత ♦ పాటలీకృతనభ, కుధ్ధమోహాద్యద్వ్య ♦ కుంజరములు
పంచరత్నంచితోద్యగానన్ ♦ సత్ప్రకాశ, చైకిరశశాంకదర్పక ♦ జాతహార్ద
నికటనరదుమఖయనత ♦ నిఖిలభీను, పస్మితదృగ్జగితతులత ♦ తౌగతతులు. ౬౨.

చ. పురబహిరంగణస్ఫురిత ♦ పుష్పవనీలసమానసూనబం
ధురమకరందబిందుచయ ♦ తుందిలమందపనటన్నిళింద మే
దురరవభృత్ప్రసారరవ ♦ దుష్కరనిర్ఝరమాతపోతసం
కరగతిఘూర్ణహంబుమృదు ♦ గంధవహంబులరుల్ బురంబునన్. ౬౩.

క. తేజము నున్నతి యుంగని, చేఁ జేరెడు ఘనుల తగులు ♦ వీడని వేడ్కన్
రాజులకున్ దత్పురిగృహ, రాజులకున్ జనముగుచు ♦ రాజిలు నెపుడున్. ౬౪.

సీ. సత్త్వసంపదరాజ ♦ సముతేని చతురాస్య, లాసురాలయ మొంద ♦ నట్టిబుధులు
తమిఁ బూని తేజముల్ ♦ దఱుఁగని సూరులు, నరసంస్తుతికిఁ బోని ♦ పురుషవరులు
నుగ్రభావముఁ జెంద ♦ కుండు సర్వజ్ఞులు, సద్ధర్మ మెడలని ♦ జాతవేదు
లురుగురుభక్తి నే ♦ మఱచికళానిధుల్, పక్షపాతములు లేని ♦ ప్వడనిద్విజులు
సకలశాస్త్రార్థనిశ్చయా ♦ వికలహృదయ, యోగ్యవైరాగ్యసంతతా ♦ భ్యుదయధిక్కృ
తాపనీశ్వరదానధా ♦ రాప్రవృద్ధి, దీపకరుశౌరయవ్వరి ♦ విప్రవరులు. ౬౫.

ఆ. కొడుకుతండవాల ♦ గోడవలనూరూర, దినముఁ దిరుగుచుండుఁ ♦ దనకులంబు
నడుమ నప్రయోజ ♦ నంబయ్యెనని బ్రహ్మ, నగుదురఁ చటిబ్రాహ్మ ♦ ణప్రవరులు. ౬౬.

ఉ. ఆనగరిన్ మహీసురు ♦ లహర్నిశముఁ దరచియించమించు హో
మానలధూమమభ్రమున ♦ నభ్రతఁ గన్పడుఁ ధర్మహార్మ్యసం
తానములన్ మెలంగు నెలఁ ♦ తల్ నెఱమించులు గాఁగ వారివం
బూనినముత్తి చుంపు దర ♦ ముల్ వడగండులు నైతనర్చఁగన్. ౬౭.

సీ. అరిలోననాకిపట్ల ♦ వెను తియ్యరని కాక, శతమఖాత్మజులంచుఁ ♦ జాటరాదె
పుణ్యజనాళినా ♦ ప్పటకోపరని కాక, దశరథాత్మజులంచుఁ ♦ దలఁచరాదె

సీ. వలరాచజగడాలఁ ♦ గళలంటికరఁగించు, జాణయీ సంపూర్ణ ♦ చంద్రవదన
తరితీపుఁజెయ్యెలఁ ♦ దమినిగిడింపఁగాఁ, జాలునోయ్యారియీ ♦ నీలవేణి
ప్రౌఢాలోకకాంతనే ♦ ర్పులకూటమిఘటించు, కొమ్మయీజక్కువ ♦ గుబ్బలాడి
కనుఁగొనినంతనే ♦ మనసుపుట్టఁగఁజేయు, ప్రోడయీజాళువా ♦ పైఁడిబొమ్మ
యనుచుఁదమలోననిజవిభ్ర ♦ మాతిశయముఁ, గనివిటులుచిత్రవాక్యసం ♦ గతులనాడ
హావభావవిలాసవి ♦ హారపరత, వెలవెలందులుబొలుతురు ♦ వీటియందు. ౭౬.

సీ. కమలంబుమూర్కొన ♦ గావచ్చునేయన్నఁ, దెలినెమ్మిగమ్ములు ♦ ద్రిప్పికొనుచుఁ
జినురంటిచూపంగ ♦ నగునచేయనఁగఁగెం, గేలిసైఁగలనంటఁ ♦ బోలదనుచు
నలరుబంతులుమాడ ♦ నగునచేయనజాలు, జిలుఁగుపయ్యెదఁజక్కఁ ♦ జేర్చికొనుచు
మంచెనవిరియెల ♦ మాటెదేయనటు, పైఁటకొంగుఁమోవి ♦ మాటికొనుచు
విలులనన్యోక్తులెఱిఁగియ ♦ న్వితమునకును, దాపొడంబడవటులనే ♦ తమవిలాస
చేష్టలనువారికోర్కులు ♦ చిగురుద్రొక్క, నలరులమ్ముమూక్తిట ♦ వలరుఁబోండ్లు.

ఉ. పల్లవరాగి ముక్తసులు ♦ బంతులు రెండిపపైఁటవాటుగా
నల్లనమాటిడియొంటిపని ♦ మమ్మునకొందురెకొమ్మప్రౌఢపూఁ
గొల్లగఁబోఁమనొక్కరున ♦ కున్గయిఱానుకసేతుగానవా
మొల్లమినిబ్బడిత్తునవి ♦ ముట్టఁగనిమ్మనసైఁగనవ్వుచున్. ౭౮.

క. పూవులవిలుతురుకమతము, పూవులయువపోటికిన్గ ♦ డిందితమకమున్
గావింపఁగఁబురవనితలు, భావింపఁగమరునిదండి ♦ బాదంబోలెన్. ౭౯.

క. అప్పురము నేలుఁగృష్ణుఁడు, గిప్పరపున్ రజమువ్రాలెఁ ♦ గడెఁగెనిజయశం
బుప్పతిల వెలఁగిప్పిక, కప్పతిసతులకుదుకూల ♦ కోటిఘటింపన్. ౮౦.

సీ. ఘనమైనధృతిచేత ♦ జనులనందఱఁబ్రోచి, తామేటివిఖ్యాతిఁ ♦ దనరఁగాంచి
భూదారమహిమచేఁ ♦ బొగడొందిజనముల, నరసింహవిస్ఫూర్తి ♦ నుమువణించి
బలినిరాకరణత ♦ త్పరతవన్నియకెక్క, శరణాగతత్రాణ ♦ బిరుదమూని
భూవరదానైక ♦ బుద్ధిచేవిలసిల్లి, కలిమినననంతభో ♦ గములనలరి
వెలయులోకజిదాటోప ♦ విభవమునఁ, ధర్మసంస్థాపనార్థమై ♦ వాడివెడలి
తనరుబహురూపధారణో ♦ దారవీర, ధర్మమయహారకంకణ ♦ ధారిశౌరి. ౮౧.

శా. నీలాంభోధరఘోసురాంగుఁడుసళీ ♦ స్నిఁజపత్రోల్లస
ద్రోలంబాభకనీనికావిలసితా ♦ ఘూతైకశృంగారభా

గ్యాత్రీభానసమసాయకప్రణిహితా ♦ ద్యంతాస్త్రిజాభిదయో
ద్వేలాంభోధిలసద్దయాకరుఁడనన్ ♦ దీపించుఁగృష్ణుండటన్. ౭౨.

సీ. అర్ణాంతరంగత ♦ నలరునీతఁడటంచు, ద్విజరాజుసాక్షిగాఁ ♦ దెలుపవచ్చుఁ
గరుణారసాపూర్ణ ♦ కలితనేత్రుఁడటంచు, భానుఁడుసాక్షిగాఁ ♦ బలుకవచ్చు
నవతమోవిపినైక ♦ ప్రౌఢవక్త్రుఁడటంచు, ననలుండుసాక్షిగా ♦ నాడవచ్చు
సకలజీవావన ♦ ప్రకటధుర్యుఁడటంచు, శ్వసనుండుసాక్షిగాఁ ♦ జాటవచ్చు
నారసిల్లనిహృదయము ♦ స్ఫూర్తికరుణ, మేలువిమలతభూరవి ♦ వాలమహిమ
యుఁగనుతికెక్కనిజభక్త ♦ వనముసూజ్ఞ, మాధవుండెవఁడనరుర ♦ మాధవుండు. ౭౩.

క. ఈకీర్తిసకలదిగుమతి, భూరితరఖ్యాతి నెగడెఁ ♦ బోలుపునీతిన్
ధీరుని మెఱఁగననారిత్ర, సారతరైశ్వర్యసుర్య ♦ చర్యలనుండున్. ౭౪.

తే. ఉండుతటినొక్కనాఁడతం ♦ డుదయవేళ, నతులగాయకరచితగీ ♦ తామృతంబు
నలమిపోషితకైరవా ♦ గమ్యతరసము, చెవులపండువుసేయను ♦ త్సవముమీఱ. ౭౫.

క. కేళీగృహమున్ వెలువడి, బాలామణిమోర్తుపసిఁడి ♦ పావలు దొడుగన్
లీలాగతి నరిగిమణీ, జ్వాలావృతమైనయుబ్బు ♦ చప్పరమందున్. ౭౬.

క. అంగనలుంచినచొక్కపు, బంగరుపీటన్ వసించి ♦ బహుమతియలరన్
ముంగలఁబోఁచుమహీసుర, పుంగవయోగమునకువినయ ♦ మునఁగేల్మోడ్చెన్. ౭౭.

తే. కేలుమోడ్పుఘటించిబా ♦ గాలొసంగి, పనిచితెనచెక్కుటద్దంబు ♦ ప్రభలుమేలొ
దినప్రభమేలొపరికించి ♦ తెలుపుమనిన, దారినొకనారిపట్టిన ♦ దర్పణమున. ౭౮.

సీ. చిగురాకుమోవిపైఁ ♦ దగుపచ్చిపలునొక్క, నిడువాలుఁగన్నుల ♦ నిదురసొక్క
కొనగుబ్బపోటునఁ ♦ గుమ్మైపోయినయక్క, నెలవంకఁబచరించు ♦ తళుకుఁజెక్క
చిటిలుగంధముతోడి ♦ జీనిసర్పెనచిక్క, మిసిమిదుప్పటిఁదోఁను ♦ పసపుటెక్క
పూవింటిదొరకయ్య ♦ మునఁగోఁచుబలుటెక్క, లెతెఁగించుశృంగార ♦ భరమునిక్క
నెరయఁగనుపట్టుతనజాడ ♦ నీడఁజూచి, మొలకనవ్వులుగనుదోయి ♦ మొలకలెత్త
మేటిసొగసునమీసాలు ♦ దీటికొనుచు, శౌరిపలుదోమికొనియెనో ♦ య్యారముగను.

మ. ఒకనారీమణియిచ్చుకేలఁదనకే ♦ లొంటించిలీలాగతి
న్వికచాంభోయహాలోచనుండపుడుసా ♦ న్ద్రీభూతనీలాళ్కత
న్నికటానద్ధసమృద్ధహీరమణిరు ♦ క్శ్రేజమిత్రాత్మజా
ప్రకటాకాశధునీనిదానసదనో ♦ పాంతంబుస్నానార్థమై. ౮౦.

శా. భామల్ రెండవ లక్ష్ములన్ మణులఁ ◆ దాఁ బాత్రమ్ములం బూనుచున్
నామోదాతిహిమాంబువుల్ గురియఁగ ◆ బ్రాత్ఘుండె సంగంగడున్
సోముండక్కడు సాంగ్యరక్తిమలచే ◆ సాంపొంద ప్రాక్పశ్చిమ
స్థేమశ్రీలను జెందఁజుక్కగమితో ◆ దీపించు నీ ప్రీదినాన్. ౯౧.

ఉ. మజ్జనశాలనిల్చుటయు ◆ మారిమలప్పుడు పైఁడికుండలం
బొజ్జఁగి నీరు నించియతి ◆ కోమలవాణి రసాలపల్లవా
సజ్జితమై చెలంగఁగను ◆ వైలధరానత మన్యభాగలై
సజ్జనఁ జేరి మజ్జనము ◆ సాటిలఁ జేసిరి కంచనైతికిన్. ౯౨.

చ. మదనునితండ్రి తత్సమయు ◆ మంత్రపురస్కృతి సుకరీతి మై
పదములవారిపూరమున ◆ సంప్లుతుఁడై తదనంతరంబునన్
మదవతి యోగ్య పావనను ◆ మైకడియొక్తఁగ హాతినత్రపున్
సుదతియొకర్తు వేయుసఁగఁ ◆ జొప్పడఁగన్ ధరియించియంతటన్. ౯౩.

ఆ. శాతకుంభపీఠ ◆ సజ్జకృతాసన. లసితచిత్రకంబ ◆ ంబుమీఁద
పూర్వమొదవనప్పు ◆ డాసీనుఁడై నిత్య, కర్మవిధులొనర్చెఁ ◆ గంసవైరి. ౯౪.

సీ. స్వస్తికాసనయుక్తి ◆ సమకూర్చియామీఁద, భుజములురమ్మును ◆ బొడవు చేసి
కరములూరువులందు ◆ ఘటియించి పొందుగా, నాసాగ్రమున దృష్టి ◆ నాటఁజేసి
పవనకుంభకవృత్తి ◆ బంధించి భుజగక, న్యకనిద్ర మేల్కొల్పను ◆ నట్లు గ్రంథి
గ్రంథులు సడలించి ◆ కమలముల్ భేదించి. వేయురేకులతమ్మి ◆ విప్పుకొనిపి
యందుఁ బ్రకృతిపురుషులకుఁ ◆ బొందుగాఁగ. జేసి తదమృతసంప్రాప్తిఁ ◆ జెంగియందు
మీఁదఁదాత్మసంపత్తి ◆ మెలసియప్పుడు, జపవిధానంబు లొనరించెను ◆ చక్రధరుఁడు.

చ. ధనకధివాసమైతనరు ◆ తామరసాప్తుని బ్రహ్మభావనా
వినుతిఁ బ్రహ్మార్పణఁ జేసితను ◆ విప్రజనావళికెల్ల శక్తితో
ధనమణిగోహిరణ్యములు ◆ ధాన్యఖదానములాదరించి చ
క్కని కనక ప్రపీఠమునఁ ◆ గంజదరోధ్భాసించియున్నెడన్. ౯౬.

తే. చేరియలశౌరియపాదల ◆ నారయొకతె, హీరమకుటంబు నిలుపను ◆ దారహుమల
మిాఱునదిభూరిలావణ్య ◆ నారజలధి, పూర్ణమునఁ బోఁడు శశిబింబ ◆ మోయనంగ.

తే. కలికిమృగమదతిలకంబు ◆ కలికియొకతె, కృష్ణుమొగమున దిద్దిన ◆ నెసఁగెమిగులఁ
గమ్మవిరిదమ్మితావికిఁ ◆ గ్రమ్ముకొనిన, గండుతుమ్మెదపోంకంబు ◆ గడలుకొనఁగ. ౯౭.

సీ. కలుములనీనుకలికి జనునఁ ♦ గబ్బిచనుంగవరాపు పోటులన్
విలసిల్లియింద్రనీలమయ ♦ విస్తృతనవ్యకవాటపాటవో
జ్జ్వలమగునమ్మురాంతకుని ♦ శాలపు లోఁగమున ముత్తియంపుఁ జే
రులుదగునక్షత్రనీరజవి ♦ రోధిసుధాకణమాలికాకృతిన్. ౯౯

క. కౌస్తుభధరింపకతమున, కాఁచానుధరించుశీల ♦ రాజిలఁదాల్చెన్.
బ్రసిమాలగాస్తుభమణిరూ, దవనఁశాంభోధిశీత ♦ ధామునిఁదగన్. ౧౦౦

సీ. కోమలిమోహస్తనంపదముఁ ♦ గుంకుమతోడనుగూర్చియంతన
త్తామరసాక్షుమైనలఁదఁ ♦ దద్దయునొప్పమనోహరాకృతిన్
సోముఁడునీరజాప్తుఁడును ♦ జాహ్నవిలయందువసించియుండుటన్
గామిడిగాఁడియాతపము ♦ గ్రమ్మివెలింగెడునందమొందుచున్. ౧౦౧

చ. చలనపరత్వమస్థిరత ♦ సత్వసరోధముఁగాంచిచంచలల్
జలదమునాశ్రయించుటకిఁ ♦ జాలునటంచుఁదలంచిశాంతిచే
నలరిసదాశ్రయించయిన ♦ యచ్యుతునెమ్మెయినాశ్రయించెనాఁ
జెలఁగెఁదనీయభర్మమయ ♦ చేలవిశాలమయూఖమాలికల్ చ. ౧౦౨

వ. ఇవ్విధంబున ననేకమణిమయభూషణజాలంబుల మనోహరమాల్యాంగరాగంబులఁ నలంకృతుండై, ఇరుగడల నుత్తరాసిమ్ములకిరకమలదేదీప్యమానధవళచామర ప్రభాకలాపంబులానవకుముదవనీబంధుబంధురకళావిలాసంబులచందంబునఁ బరిభవింప భూసురవర్య లాసంగదూర్వాంకురయుతాక్షతంబు లుత్తమాంగంబున ధరించి యెక్కి వేదండయాన కైదండఁ బూని మందమందగమనంబున మందరధరుండు కక్ష్యాంత రంబులు గడచి హీరప్రభామృణాళసముదయత్వద్మరాగరుచిఁ బాండురాకారారవిందంబుల నధివసించుచు, మిళిందసందోహంబులం బ్రేణి సేయుచుఁ బరిఖవితతదంత రాళప్రతిఫలితబలభిన్మణివితానంబులును, బలభిన్మణివితానంబు లిందీవరసందోహంబు లుగాఁ దలంచి కర్ణావతంసములకై చిదుమ గమకించి యచటి కేతెంచుసుధాంగ స్సీమంతినీనివహంబులహాసువుఁ దేజరిల్లురత్నపాంచాలికలం గనుంగొని సరోవరప్రస్త్రి వారలపయిం గవయఁ బురడించుసేనవెల్లువలయుల్లాసంబు నెరపుచు నెగయుముత్య ఫలసముల్లసితరంగవల్లీసముదయంబును రంగవల్లీసముదయనిచితవికసితచారుకోరకనివ హావిరాజమానంబు లగునలరులకాంతులు విరియంబొందు నిగనిగ లనుపండువెన్నెలల మెండునకు బెండువడి ముకుళితంబు లగుపుండరీకషండంబు లనం దగినప్రభాతదీప కళికలఁ దివియుటకుఁ దత్తఱంబున మెలంగునుడిగంపుమిత్తైపులముంజేరనినదంబుల ననుక

రించుజలవిహంగమనిరాసంబులకుం జొక్కి వియచ్చరపథంబుననుండి యచ్చటికిం దిగు నంచపిండు వాఁ దగునుల్లోచసముల్లసితసితవసనవిసరప్రతిఫలనసాంద్రతరచంద్రకాంత మణిమయస్తంభంబులను, చంద్రకాంతమణిగణప్రభాంకూరంబులను, వికస్వరకైరవవా రంబులను, పరిపూర్ణంబు లగుమనోహరకణమ్ములం దగినతదంతరాళబింబితగోమేధిక ప్రభాంకురంబుల నలంకృతం బగుకమలాకరం బనం దగి కమలాకరంబయినయాస్థాన మండపంబులు ప్రాప్తించి సమంచితచిరత్నరత్నఖచితసింహాసనంబునం బేరోలగం బుండి బలభద్రసాత్యకిప్రభృతిభ్రాతృనివహంబును గృతవర్మప్రముఖబంధుసందోహం బును, దండనాథపురోహితామాత్యవిద్వత్కవిగాయకప్రముఖులును, బలసి కొలువఁ బ్రహృష్టాంతరంగంబున. ౧౦౩.

సీ. ఒకచక్రిరాయసాల్ ♦ ప్రకటవాగ్వైఖరిఁ, జదువుటైదినసరుల్ ♦ చదువుచుండ

నొకచాయఁగరణికుల్ ♦ సకలదేశంబుల, కనుబడికవిలెలు ♦ వినికిసేయ

నొకవంక నుబ్రధాను ♦ లకలంకగతిఁజేరి, వివిధంపుజ్యస్థితుల్ ♦ విన్నవింప

నొకదిక్కునవియోగు ♦ లుచితవర్గోరీతి, రాజకార్యప్రవ ♦ ర్తనలు దెలుపఁ

గలితకంకణఝంఝణ ♦ త్కారగతుల, రమణులిరుగడవింజామ ♦ రములువీవఁ

బత్తమచిత్తైకభూషణా ♦ దరము మెఱయ, నిందుగొలువుండెయాదవా ♦ ఖండలుండు.

వ. అయ్యవసరంబున. ౧౦౪.

సీ. చిఱునాగుపడగల ♦ వఱలుకర్ణములతోఁ, గట్టిననిడుపీలి ♦ కాసెతోడ

వఱమూపుపయిమించు ♦ చలిదిచిక్కముతో, మెట్టినబిసువారు ♦ మెట్లతోడ

నాసికాగ్రముమీఁది ♦ నాభినామముతోడఁ, దనరారుపొన్నెడ ♦ త్రాడుతోడఁ

జోప్పడపిగిగొన్న ♦ కప్పుకుళ్లాయితోఁ, బట్టినయొకకమ్మ ♦ చుట్టతోడఁ

ద్వరితగతి నేగుటకుఁబొంక ♦ పఱచినట్టి, చెట్టుపలకీతినాదలం ♦ జుట్టినట్టి

పిల్లయుల్లియచెఱఁగులు ♦ వెంటనంట, డాయఁజను దెంచెనొంటరి ♦ బోయఁడొకఁడు.

క. చను దెంచికనకసింహా, సనమునవెలకొన్నకంస ♦ శాసను నెదుటన్

వినయమునమ్రొక్కిపత్రికఁ, జనవరియుడిగములచేత ♦ సభయతనొసఁగెన్. ౧౦౫.

తే. ఒసఁగినను వారుకృష్ణుని ♦ యొద్దనునిచి, యతనికనుసన్నవానిఁడా ♦ యంగవచ్చి

యెవ్వఁడవునీవుపత్రిక ♦ యెవ్వరనది, రిదియొతింగింపుమనినవాఁ ♦ డిట్టులనియె.

క. కుండినపురినిమ్మిభామిగ, నుండునమాత్యుండుప్రకటి ♦ తోత్సవవార్తా

మండితరేఖయొసంగన, ఖండితమతిరయముమెఱయఁ ♦ గాఁబనివింటిన్. ౧౦౬.

తే. అనినవానికిబహుమాన ♦ మగ్గలముగ, ఘోలికముఖంబు గానీగ ♦ ననిచియపుడు
తనదుబిరుదులఁగనుఁగొనఁ ♦ దక్షిణంబ, వారుపనిపించిరిటుకమ్మ ♦ వక్కణలను.

సీ. శ్రీమదఖండల ♦ క్ష్మాసుసంపన్నుఁడౌ, వెన్నునకేనంపు ♦ విన్నపంబు
లిచటికార్యస్థితి ♦ కెల్లఁబొల్తు నెస్వామి, వారికి నేవిన్న ♦ పంబునంపి
వాఁడెఁగాభీష్మక ♦ నరపతితనపుత్త్రి, కాయూథయౌవన ♦ కలితపుదమున్
నుద్వాహమొనరింప ♦ నుత్సుకుఁడైస్వయం, వరమునకైరాజ ♦ వరులనెల్లఁ
బిల్వనంపించె నెంతయుఁ ♦ బ్రేమమీఱ, మీరలిటురాఁగఁగోరితా ♦ మేరమీఱు
నుత్సుకతమిమ్ముఁబిల్వంగ ♦ నుత్తరవునా, సంగెవిచ్చేయవలయును ♦ జక్రపాణి.

క. అనిపమువువిన్నపంబును, వినివనజేక్షణుఁడుహృదయ ♦ వీధిన్నిండం
గనుపట్టుకుతుకమింతయుఁ, గనుపడనీఁడయ్యె నెమ్మొ ♦ గమ్మున నానన్.        ౧౧౨.

ఉ. క్రొన్ననవిల్తుతండ్రియిటు ♦ కోరికలీరికలెత్తనత్తఱిన్
బున్నమచందమామయనఁ ♦ బొల్పుసహించినయాస్యసీమను
త్పన్నసుధారసంబనఁగ ♦ భాసిలుతేనగవంకురింపఁగాఁ
బన్నినిమాటనిట్లనియె ♦ ధీరతమీఱసభాజనుల్వినన్.        ౧౧౩.

తే. ఇపుడువచ్చినకమ్మలో ♦ విపులకీర్తి, భీష్మకనరేశ్వరుఁడుకూఁతు ♦ పెండ్లిసేయఁ
దలఁచిరాజులనందఱఁ ♦ బిలువఁబనిచి, యందుమీఁదటమనము ♦ నచటికిపుడు.

ఉ. రమ్మనినాఁడటంచుఁగద ♦ వ్రాసినవాఁడునియోగియుత్తరం
బమ్మెయినున్నదిక్రియకు ♦ నందఱుమీరిటునిశ్చయించికా
ర్యమ్మిదియంచుఁదెల్పనగు ♦ నాప్తులుచూచివచించినట్టివా
క్యమ్మునసేకదావిభున ♦ కబ్బుసమస్తశుభంబులెప్పుడున్.        ౧౧౪.

తే. అనుచుసర్వజ్ఞుఁడయ్యును ♦ వ్వనజనాభుఁ, డాడువినయోక్తులకుఁజాల ♦ నలరిసభ్యు
లందఱాతనిసౌలభ్య ♦ మతినివినయ, మాతనిప్రియంబుఁబరికించి ♦ యనిరిముగుడ.

ఉ. నీరజనాభకార్యముల ♦ నిశ్చయమిట్టిదటంచుఁదెల్పఁగా
నేరుమవారలుంగలరె ♦ నీయొనుటన్ సకలాంతరాత్మవై
నేరెదినట్టివారలను ♦ నేరనివారనిపించిదిద్దఁగా
నేరిచినట్టిదేవుఁడవు ♦ నీకొకరాయెటిఁగింమనేర్పరుల్.        ౧౧౫.

తే. అయినమానేర్పువితముల ♦ నరసిపలుకు, విన్నసముఖాలకింపుము ♦ విశదభంగి
పెంపుమసుకంబుపల్కులు ♦ ప్రీతితోడ, ముద్దుసేయుచువినుదాని ♦ మురిపిదారి.

క. త్వరితగతిని పుత్రకుం జేసిన, పురికిం జనియ చటభీష్మ ◆ భూపతి యొసఁగన్
దరుణీమణి యగు రుక్మిణి, నరుమగఁగొని తేరనొకరి ◆ నడుగన్వలెనే. ౧౧౯.

క. కాదని స్వయంవరమ్మా, పాదించి నభీష్మకుండె ◆ పరికింపఁగని
ర్భేదించి సకలనృపతుల, నాదటఁగొని తెమ్ము నీవు ◆ నందఱు మెచ్చన్. ౧౨౦.

తే. అనుచు సామాజికులు దోఁచి ◆ నట్లు పలుక, బుద్ధిమజ్జ్యేష్ఠుఁ డనఁ నొప్పు ◆ నుద్ధవుండు
శౌరికను విన్నఁ జేరియా ◆ సన్నసీమ, వారి వారించి చాతురి ◆ మీఱఁ బలికె. ౧౨౧

ఉ. సేవపు టెందుఁ గార్యగతిఁ ◆ జిత్తమునం దలపోసి నీతి గా
భూవరు తోడఁ బల్కుటకుఁ ◆ బోలు దురట్లును గాక నెమ్మితో
దేవర వారు నెన్ బహుమ ◆ తిన్ పరివారలు మెచ్చఁ జాలసం
భావితుఁ జేయుటన్ హితము ◆ వాటిల యుక్తమె పల్కుఁ గున్ హరీ. ౧౨౨.

చ. మనుజుఁడు కార్యసిద్ధికయి ◆ మానుప యత్నమొనర్చు వేళనె
న్మశయునని శ్చయించిమతి ◆ మంతుల కెల్లను సమ్మతంబు గా
నొనరచె నేని దానజయ ◆ మొందును దైవవశంబు గాక తె
క్కినంతఁడేమి సేయుఁనని ◆ క్రిందుగ నెంచరు పెద్దలాతనిన్. ౧౨౩.

శా. కృత్యాకృత్యవివేకశూన్యమతియై ◆ కించిజ్జ్ఞుఁడౌ మానవుం
డత్యంతంబును లోభబుద్ధి ఘనకా ◆ ర్యారంభముల్ సేయుటల్
ప్రత్యంతాద్రిదరీమిళన్మధురసా ◆ స్వాదార్థమై యాశచే
నత్యుచ్చైర్గిరిశృంగవాసి యొటుకన్ ◆ హస్తించు నట్లౌఁగదా. ౧౨౪.

తే. త్వరితగతి లోకకార్యంబు ◆ దలఁచి సేయ, దానఫలమంద నేరఁడు ◆ ధరణి నరుఁడు
శ్రౌతకర్మంబు సాంగతఁ ◆ జలుపకున్న, సఫలత ఫలింపఁ జేనిద ◆ ర్శనము గాదె. ౧౨౫.

ఉ. సూరిజనాభిరంజకుఁడు ◆ సూనృతవాదియు సజ్జనావళీ
దారుఁడు లోభమోహమద ◆ దారుణవర్తనదూరుఁ డార్తమం
దారుఁడు విక్రమాస్పదుఁడు ◆ ధైర్యసమగ్రుఁడు నీతియుక్తుఁడున్
భూరివివేకసక్తుఁ డగు ◆ భూపతి యేలఁ డె దివ్యులన్నియున్. ౧౨౬.

మత్తకోకిల. భూజనంబులు మేలు మేలన ◆ బుద్ధిమంతుల సంగతిన్
నైజకృత్యములాచరింపుచు ◆ నవ్యకీర్తి దిగంతముల్
రాజిలన్ సమదారివీరుల ◆ రాపు సేయఁగ నోపు బల్
తేజమున్ గన రాజుకల్మియ ◆ తిస్థిరత్వము నందదే. ౧౨౭.

సీ. కావున నీగతిఁ ♦ గల్యాణవర్తన, నీతియుక్తత నొప్ప ♦ భూతలేశుఁ
డలరు మహీస్థలి ♦ నవనీతలాధీశ, మాత్రుండ వే నీవు ♦ మధువిరోధి
సకలబృందారక ♦ సంఘకిరీటాళి, మణిగణరంజిత ♦ మహితచరణ
నిఖిలలోకంబుల ♦ నీ వెఱుంగ సమస్తి, యర్థంబు గలదె ♦ శాంతమైన
నైన నేఁ జేయు విన్నపం ♦ బవధరింపు, కుండినపురాధిపతిచేత ♦ నుండి వచ్చు
వారు పలికిన యర్థంబు ♦ సారఫణితి, విశదభంగిని వివరింతు ♦ విమలచరిత. ౧౨౮.

సీ. బంధుసమ్మతి మీఱఁ ♦ బద్మాక్షి రుక్మిణి, పెండ్లి సేయుటకునై ♦ భీష్మకుండు
దలపోయునప్పుడు ♦ తరుణికిఁ దగునట్టి, వరుఁ డెవ్వఁడన సభ ♦ వారలెల్ల
భవదీయగుణములు ♦ ప్రకటించి శౌరికిఁ, గన్నియ నిచ్చి జ ♦ గద్ధితంబుఁ
గావింపుమన రాజు ♦ కరము సంతసమొందె, విని రుక్మి యనెడు న ♦ వ్విభునిసుతుఁడు
చాలు వెసమాటలిఁక శిశు ♦ పాలుఁ డుండ, బాలనన్యుల కీయంగ ♦ నేల యనియె
నిరుతెఱంగుల మాటల ♦ కేమి యనక, మహిపతి స్వయంవరము సేయ ♦ మదిఁ దలంచె.

మ. మనుజాధీశుతలంపుఁ గైకొనక దు ♦ ర్మానంబుతో రుక్మి దు
ర్జను లైనట్టి సుయోధనార్కజజరా ♦ సంధాదులం గూడి చై
ద్యున కే నిచ్చెద నా సహోదరిని శౌ ♦ ర్యోత్సాహబాహాబలం
బునఁ గాదంచుఁ గడంగు మన్నెదొరలం ♦ బోకార్చెదన్ బేర్చెదన్. ౧౩౦.

క. అని యలవిగాని క్రొవ్వునఁ, గనుఁగానక యున్నవాఁడు ♦ ఘనమూఢమతిన్
జననాథసుతుఁ డటంచున్, వినఁబడియెను మతియుఁ బెక్కు ♦ వితముల నిచటన్.

ఉ. కావున మీరలందరుగఁ ♦ గ్రందుగ భీష్మకరాజనందనున్
భూవరులెల్లఁ గూడికొని ♦ పోరికి నుద్యతులౌట సిద్ధమం
దేవగ నిర్వహింపనగు ♦ నెవ్వగఁ గన్య గ్రహింపఁ గాఁదగున్
దేవర యీ హితంబు లెదఁ ♦ దిన్నఁగ నెన్ని కడంగ మేలగున్. ౧౩౨.

క. అని యిట్లుద్ధవుఁ డాడన్, విని బలదేవుండు క్రోధ ♦ విహ్వలమతియై
యనిమిష మధుమదవిఘూర్ణిత, కనదాయతలోచనముల ♦ కడుఁ గెంపడరన్. ౧౩౩.

శా. ఏ మేమీ హరికిత్తుఁ గన్నె నని ధా ♦ త్రీశుండు చింతింపఁగా
నామీఁదన్ మతి రుక్మి చైద్యునకుఁ దా ♦ నర్పింతునంచెంచె నా
భామారత్నము నింత క్రొవ్వు గలదా ♦ బాగాయెఁ గా యిచ్చుటన్
రాముండుండు నెఱుంగఁడో యెఱిఁగియున్ ♦ ప్రాణంబులే యొల్లఁడో. ౧౩౪.

క. కుండినపతికన్నియుక్కీ, కుండిన నేమాయెమాయ ♦ యోయువియనిన
ట్లుండఁబటుచండబలనో, ద్దండహలుండనయియేమైన ♦ తరుణిఁ దెత్తున్. ౧౩౫.

తే. అప్పుడుచొప్పటఁగలిగిన ♦ యవనిపతులు, మనుజమాత్రుని గానన్ను ♦ మదిఁదలంచి
కదఁగిరేని యెందుఁ గాంతురు ♦ నాకనాదు, ముసలదండసముద్దండ ♦ విసరణంబు.

మ. ముసలాఘాతవిశీర్ణశాత్రవకుభృ ♦ న్ముఖ్యోత్తమాంగచ్ఛటా
ప్రసరద్రక్తములాని భూతతతులా ♦ ర్వన్ బర్వ గంధర్వహ
స్తిసమూహంబు సనాతిసంచయము ధా ♦ త్రిన్ జాపకట్టై పడన్
వెసఁ గ్రీడింతు మహాహవంబున భుజా ♦ విస్ఫారశౌర్యోన్నతిన్. ౧౩౭.

క్రౌంచపదవృత్తము. క్ష్మాతలనాథ, వ్రాతము నాపైఁ ♦ గదనమహోన్నతిఁ, గదఁగిరయేనిన్
శాతహలాగ్ర, స్ఫ్యూతశిరోధి ♦ ప్రవహదురుధిరా, చ్ఛాదితవృత్తిన్
గాతరలీలన్, ఘాతలవ్రాలన్ ♦ గనుఁగొనిమనమునఁ, గలఁగుచుఁ జైద్యుం
డాతురుఁడౌనటు, లాతతశౌర్యం ♦ బమరులువొగడఁగ, నతివను దెత్తున్.

క. అతివఁ గొని తెచ్చియీఁ గతి, నతిశయితప్రీతినిత్తు ♦ హరికిన్ దైత్య
ప్రతతిం జయించి భూనతి, పింతమతి నింద్రునకొసఁగును ♦ పేంద్రునిలీలన్. ౧౩౯.

తే. ఇట్లు బలభద్రుఁ డాడెడు ♦ హితతమోక్తి, కెంతయును నెమ్మనమ్మున ♦ సంతసించి
యతిపచేసినయట్లన ♦ మతిఁదలంచి, భేరి మ్రోయించె హరియాత్ర ♦ బోరుకలఁగ.

సీ. అంబుజేక్షణుఁ డంత ♦ నధికారులను జూచి, యెల్లి కుండినపురి ♦ కేగవలయుఁ
గావున రథరథ్య ♦ కరిపదాతివ్రాత, మాయతమ్మైయుండు ♦ నట్లు సేయుఁ
డనుగతులయి వచ్చు ♦ నఖిలసామంతులఁ, బిలిపింపుఁడిపుడ చా ♦ రులను బంచి
పటకుటీరకటాహ ♦ పటుకటాదుల నెల్లఁ, దోడ నెకొని తెచ్చు ♦ జాడ నెరపుఁ
డతులమణిమయబహుభూష ♦ ణాంబరములు, కుంకుమపటీరకాశ్మీర ♦ సాంకవాబ్జ
మృగమదకరండతండముల్ ♦ తగువితానఁ, బూని తెండని శ్రీకృష్ణుఁ ♦ డానతిచ్చె.

తే. ఇట్లు నియమించి యమ్మర్యాద ♦ వేశ్వరుండు, హితపురోహితసామంత ♦ నృపుల నెలమి
వీడుకొలుపఁబంచి తానును ♦ విభవమెసఁగ, రహిఁ జెలంగెడునంతఃపు ♦ రమున కరిగె.

శా. ఈరీతిన్నగరంబుఁ జేరి కమలా ♦ ధీశుండు మాధ్యాహ్నిక
ప్రారంభంబులు నిర్వహించి విబుధా ♦ ర్చల్ దీర్చి సద్భక్తిమై
భూరిబ్రాహ్మణపూజ యున్నెరపి యం ♦ భోజేక్షణానీతశృం
గారానర్ఘ్యమణిప్రపీఠమున వే ♦ డ్కల్ మీఱఁ గానున్నెడన్. ౧౪౩.

సీ. అంగనామణి యోర్తు ♦ బంగారుపళ్లెంబుఁ, దెచ్చియుంచఁగ నొక్క ♦ మచ్చెకంటి
తెలివిచ్చు నోగిర ♦ మొలకపప్పును గూర, లూరుబిండ్లును జారు ♦ లూరుగాయ
లంబళ్లు శిఖరలు ♦ నావపచ్చళ్లును, బరమాన్నమును గల ♦ వంటకంబు
వరుగులప్పడములు ♦ వడియముల్ ఫలములు, ఖండచక్కెర తేనె ♦ పిండివంట
లొనరు సురభిళగవ్యప ♦ ద్యోఘృతంబు, నిర్మలనవీనదధియును ♦ నీరుమ్మోరు
నాదిగా షడ్రసోపేత ♦ మైన యన్న, మపుడు వడ్డింప వేడ్కఁ జే ♦ నారగించె. ౧౪౪.

క. తదనంతరంబ చేతుల్, పదపద్మములల మిగడ్డ ♦ పత్రాక్షుఁడు స
మ్మదమొదవను చితగతిశత, పదములిడి పఠించె రామ ♦ భద్రుని చరితన్. ౧౪౫.

శా. కాంతారత్నము చెంగటన్నిలిచి బా ♦ గాలీయనక్షత్రరా
టాకాంతానఖపత్త్రికాతలమునన్ ♦ గంజాక్షుఁ డాసీనుఁడై
యొంతే వేడ్కఁ జెలంగె హాటకమయ ♦ ప్రేంఖన్మణీపుత్త్రికా
సంతానార్పితదివ్యచామరమరు ♦ చ్చంచత్కచోపాంతతన్. ౧౪౬.

క. ఈరీతి నున్న యెడదా, వారికుఁడొకఁ డరుగుదెంచి ♦ వారిజనయనుం
జేరి వసనాంచలమ్మున, నోరున్ మాటుకొని యిట్లు ♦ నుడివె నయోక్తిన్. ౧౪౭.

తే. దేవ యవధారు ధారుణీ ♦ దేవముఖ్యుఁ, డొక్కరుండిప్పు డెందుండి ♦ యోయియుంగ
మన నగరివాకిటికి వచ్చి ♦ తనవితంబు, విన్నపము సేయుమనఁ బని ♦ వింటి నని న. ౧౪౮.

చ. ఉలికినయట్టులత్తఱి యు ♦ దూద్వహుఁ డాతనిఁ గెంపు నింపు చూ
డ్కులఁ దిలకించి యోరిజడ ♦ కోరినవత్తురె యట్టి పెద్దల
య్యలఘుగుణాఢ్యులాఁగుటకు ♦ నక్కట వాకిట నాదుచిత్తమున్
దెలియ నిపేగ మేగికొని ♦ తెమ్మిఁక నైనను దాళిలేనినున్. ౧౪౯.

తే. తెచ్చినను మారమున నెభూ ♦ దేవుఁ జూచి, వచ్చువిలుకాని తండ్రి సం ♦ భ్రమము దేచి
యచ్చెరువుదోఁపఁ నర్ఘ్యపా ♦ ద్యములనిచ్చి, ముచ్చటలరంగఁ దత్పద ♦ మ్ములను నెఱిఁగి.

క. ఎచ్చటనుండియొ నీవిపు, డెచ్చటికేగెదవు కామ ♦ హీసురవరనీ
వచ్చుటను జేసి మద్గృహ, మెచ్చెనఁట సమస్తశుభస ♦ మోహితమయ్యెన్. ౧౫౧.

ఉ. ఎవ్వరు మీరు మీయునికి ♦ యెచ్చట నేమినిమిత్తమిత్తఱి
న్దవ్వుగ నిట్టులొంటిగజ ♦ నమ్ముల కేరికిఁ జేరరానిదా
నివ్వనరాశిఁ జొచ్చితిర ♦ భీష్టములిట్టివి నావచింపుఁడే
నివ్వల సేయఁగావలయుఁ ♦ గృత్యములుండిన నానతీఁదగున్. ౧౫౨.

క. వినియుండుదుఁబెద్దలచే, ననఘాయభ్యాగతస్స్వ ♦ యంవిష్ణువనన్
దనరువచనంబుఁగావున, నినువాపాలింటిదేవు ♦ నిగభావింతున్. ౧౫౩.

క. మణులుధనధాన్యములుగో, గణములుమాకెపుడుమిగులఁ ♦ గలుగుచునుండున్
గణుతింపనమోఘబ్రా, హ్మణాశిషయనఁదగుతావ ♦ కాశీర్మహిమన్. ౧౫౪.

క. దైవాధీనములోకము, దేవతమంత్రావళికిన ♦ ధీనముతన్మం
త్రావళివిప్రాధీనము, కావునవిప్రులకుసములు ♦ గలరేజగతిన్. ౧౫౫.

క. లీలామానుషతనుచిత్ర, కేళీపరతంత్రుఁడనుచుఁ ♦ గృష్ణుండిటులన్
బాళినదుగంగమృదువా, క్పాళింబ్రాహ్మణుఁడువల్కఁ ♦ బద్మాక్షునితోన్. ౧౫౬.

తే. సకలజగదీశ్వరుండవై ♦ యకలుషప్ర, భావమునఁదేజరిల్లుభూ ♦ దేవదేవ
భూమిభారంబుఁదీర్పంగఁ ♦ బూనియిట్టు, లవతరించిననిన్నెంచ ♦ నలవియగునె.

శా. జలరాశిశ్రితువేదికాంతరలస ♦ చ్ఛైత్యనాలబర్హిస్స్ఫుర
జ్జ్వలదంభోరవమంత్రఘోషఘనగో ♦ పప్రజ్వలద్వహ్నికీ
లలనాసోమకుఁడన్మహాపశువునా ♦ లంభించివేదాప్తిగన్
ఫలమున్ జెందినసోమయాజినినునేఁ ♦ బ్రార్థింతుమత్స్వీకృతీ. ౧౫౮.

చ. మహితపయోజరాగఫల ♦ మౌక్తికసంచయసూనసంతతా
విహితభవర్తమందరకు ♦ భృద్ధరణీరుహమూలవల్లులా
యహికులలోకవాసిబలి ♦ హర్మ్యమునంటినఁదన్మణీతతుల్
నిహితములౌనటంచుబలె ♦ నిల్చితివద్దముడంభకచ్ఛపా. ౧౫౯.

ఉ. మత్తిలియున్నదేవరిపు ♦ మస్తకమున్ బలుతుంగముస్తనాఁ
దుత్తుమునైచనన్ మసవి ♦ త్తోడనెయాశతపత్రపున్ననుం
బొత్తులపట్టికింగొడుగు ♦ బొంగరమీవెసనానకొల్పిన
ట్లొత్తివెయిమ్మహీవలయ ♦ మింతయుఁగోలవరాహమోహనా. ౧౬౦.

శా. రక్షస్సంచయరాడురస్థలముశౌ ♦ ర్యప్రౌఢతన్ గోళ్లచే
నక్షీణాహతిప్రక్కలించిఖసము ♦ ద్యద్రక్తధారాచ్ఛటా
ప్రక్షుభ్యద్దివిషద్విషచ్ఛలభవా ♦ ర్థప్రాణసంహారకృ
ద్దీక్షాదక్షమహోగ్నిచేసెనఁగవే ♦ దివ్యన్నృసింహాకృతీ. ౧౬౧.

చ. బలిసుమహాత్వ్రితాపశిఖి ♦ బంధురలీలధరాభ్రవీథులన్
దళిముకొనన్ భవచ్చరణ ♦ తామరసోదమరందధారచే

మలఁచితదీయమాభయము ♦ మానుతునంచుఁదలంచి కాకయా ♦
యిలయుదివంబుఁబాదమున ♦ నెక్కవనాను దెవామ నాకృతీ. ౧౬౨.

మ. ధరణీనాయకకంఠలుంఠనము ♦ ద్యద్రక్తధారాప్లుత
స్వరతుల్యాచ్ఛసముజ్జ్వలత్పరశువం ♦ సంబంధభాసిల్లఁగా
నరవిందాప్తసమగ్రబింబగతపూ ♦ ర్వాదిక్ విడంబించుభూ
సురవంశాంబుధిసోము రాము వరితే ♦ జోధాముని న్గొల్చెదన్. ౧౬౩.

సీ. అంభోధిశోషణ ♦ ప్రారంభణోగ్రమ, హాభీలకుంభోద్భ ♦ వాయితములు
రక్షోధిభూకంఠ ♦ రాజీవలుంఠన, బంధురమత్తద్వి ♦ పాయితములు
ఘటకర్ణదేహాద్రి ♦ ఖండనోద్యత్క్రియా, సత్తారహారికులి ♦ శాయితములు
దూషణఖరముఖ ♦ దోషాచరానీక, శలభగణాశ్రయా ♦ శాయితములు
తాపకీనాంబకమహోక ♦ దంబకములు, భక్తజనదుఃఖసంఘముల్ ♦ పాపుఁగాత
సకలసద్గుణగణలోల ♦ సత్యశీల, జనకతనయామనోహారి ♦ శరణుశౌరి. ౧౬౪.

చ. ఉరుతరరేవతీకుచస ♦ మున్నతభూధరశృంగవిస్ఫుర
ద్వరహారిచందనప్రకట ♦ వాసనఁజొక్కియహీనవృత్తిచే
ధరణిజనంబుదాంతకుల ♦ ధర్మము నెప్పుడు నాచరించుచొ
ప్పరయుచు నీవు సంతతము ♦ నట్లొనరించితి గాబలాత్మకా. ౧౬౫.

ఉ. ఆసురకామినీస్థిరత ♦ మామలశీలముతత్తనుత్రయు
గ్వాసవవైరిసంయమన ♦ కౌశలమేర్పడనంబకంబులన్
జేసమవృత్తిఁగీడ్పఱచి ♦ విశ్వమనావిలవృత్తిఁజొప్పడన్
జేసితి కాదె నీనహంహ ♦ చెచ్చెఱమారజిదాకృతీహరీ. ౧౬౬.

మ. ప్రకటక్రీడహయంబు నెక్కితతధా ♦ రాపంచకాంచద్గతిన్
సకలక్ష్మాతలమెల్లఁగ్రుమ్మరికలి ♦ స్ఫాయన్మహోదగ్రపా
తకసంక్షాళనమాచరించుసుకృతి ♦ త్రాణైకదీక్షాయతా
త్మకునిన్నున్ మదిలోభజింతువిసమ ♦ న్మందారకల్యాకృతీ. ౧౬౭.

మ. రమణత్వత్పదకంజసంగతిభవ ♦ ద్రాగాత్తరోమాంచసం
క్రమితాంగంబునఁబొల్చెభూసతి యనన్ ♦ ఘాసాంకురశ్రేణిన
ర్యమపుత్త్రీతటభూమిఁజెన్నొదవఁగో ♦ త్రాణైకదీక్షామతిం
బ్రమదంబందినయాతనిన్గొలుతుగో ♦ పాలావతంసాకృతీ. ౧౬౮.

క. నాకతవినుమిఁకన్నిచ్చటి, కేకతమునవచ్చినాఁడ ♦ నేనదినీతో
వాకొనియెదననిభూసురుఁ, డాకృష్ణునితోడవినయ ♦ మడరంబలికెన్. ౧౬౯.

వ. అనిన నప్పరీక్షిన్నరపాలుఁడు శుకమహాయోగిఁ గనుంగొని యవల నడచినవృత్తాంతంబు సవిస్తరంబుగా నానతీయవలయునని యడిగిన. ౧౭౦.

శా. ఆవాసీన్నదరాజరాజరవినే ♦ త్రాంభోజభోజాత్మజా
హావానారతనర్మసన్మహితని ♦ త్యానందనందవ్రజ
స్త్రీవారాసమబాణబాణకరజో ♦ త్సేకాంతకాంతాంగకో
ద్భావిధ్వస్తఘనాఘనాగభృతిబి ♦ భ్యద్గోపగోపాలకా. ౧౭౧.

మాలిని. పరమపదనివాసా ♦ బంధురశ్రీనివాసా
సరసమృదులహాసా ♦ శత్రుహృచ్చంద్రహాసా
భరితకనకచేలా ♦ భవ్యశృంగారలీలా
విరచితనుతిలోలా ♦ వేదవిద్యాలవాలా. ౧౭౨.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపాణ్యమాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుం బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

క. శ్రీశుచిరయోగయోగ్య, ప్రారబ్ధదివ్యబోధ ♦ పరిపాలితమో
దారూఢగుణవిశారద, నారదనుతగుణవిహార ♦ సనకకుమారా. ౧.

వ. అవధరింపుము పరీక్షిన్నృపాలునకు శుకయోగి యిట్లనియె. అట్లు భూదేవుం డా
గోపాలదేవునితోడ నిట్లని విన్నవింపం దొడంగె. ౨.

సీ. వినవయ్య కృష్ణప్ప ♦ శ్రీసాధ్వి కోకదివ్య, మండనంబన నొప్పఁ ♦ గుండినంబు
తత్పురంబును ధర్మ ♦ తత్పరస్థితి నేలు, మదవదరాతిస ♦ మాజహృదయ
భీష్ముఁ డైతనరారు ♦ భీష్ముఁడాతని సూను, లసమానులేవుర ♦ త్యధికబలులు
వారికం దలఁకును ♦ గారాబుఁ జెల్లెలై, యలరారు రుక్మిణి ♦ యనెడు కన్నె
రుక్మి మొదలగు నన్నలా ♦ రూఢమమత, నాటలను నేర్ప నెంతయు ♦ నందమొలుకు
నంచకొదమయనంగన ♦ చ్చంచలాక్షి, యలరు జనకమానసముల్ల ♦ సిలెడునటుల.

మ. అలభోజేంద్రుఁడు దాహజారమునఁ గొ ♦ ల్వైయుండినా నానరేం
ద్రులుఁ జేజేయని మ్రొక్కి హెచ్చియును నెం ♦ తో కూర్చునక్కూఁతుఁ బైఁ
గల ప్రేమంబున సౌధవల్లులను సై ♦ గం బంచి తెప్పించిము
ద్దుఁగఁ గన్గొంటయె కానిచూడఁ డలనా ♦ థుల్మ్రొక్కుటొక్కింతయున్. ౪.

తే. సకలరాజన్యమూర్ధన్య ♦ సమితిదన్ను, సంకములఁ జేర్చిము ♦ ద్దాడుచుండ
నలువుదళుకొత్తబాలవీ ♦ ణారవంబు, లోలయనల్లారు ముద్దుగఁ ♦ బలుకుచుండు. ౫.

క. మెఱుఁగున్ వెన్నెలచిన్నెల, చిఱునగవుల సకలరాజ ♦ శేఖరులు దనున్
శిరమున వహింపఁగన్నియ, కరమలరున్ జందమామ ♦ కళయును బోలెన్. ౬.

తే. ఆటప్రాయంబు రానంత ♦ నలకుమారి, కనుఁగనుఁ జెలులుఁగఁ దలిదండ్రు ♦ లలవరించి
రబ్జరేఖ చకోరాక్షి ♦ యంబుజాస్య, లలితరసమంజరి యనంగ ♦ వెలయు చెలుల. ౭.

క. ఆచిన్ని ప్రాయమప్పుడు, చూచినవారలను మఱలి ♦ చూడఁగఁ జేయన్
మైచక్కఁదనము చేమ్రుగ, లోచనధవళారవింద ♦ లోచన వింతే. ౮.

వ. ఇవ్విధంబున నయ్యండజగమన కొండిక ప్రాయంబు నంద పుండరీకకోదండుని మండలా
గ్రంబు తెఱంగున మెఱుంగులు గల యంగవల్లీసముల్లసనంబునఁ బొసఁగియును, ధాత్రీ
జన సతతసంవర్ధమాన యై యబ్జరేఖాప్రముఖసఖీజనంబులతో డిలీలావినోదంబులం

దవిలి మచ్చికలు హెచ్చ నచ్చనగండ్లు వెన్నెలకుప్పలు గుజ్జనగూళ్లు తుంపెసలుం డాఁగిలిమూఁత లిట్టికలు సింగనావత్తి గుజగుజరేకులు చింతపూవులు చిట్లపొట్లలును గుఝుగుఝుగుంచంబులు వామనగుంటలు నట్టింట మొదలుగాఁగల యాటలం దవిలి కూటిపట్టునఁ గూడును నిదురపట్టున నిదురయు నెఱుంగక తరంగితహర్షాతిశయంబున మెలంగుచుండునవసరంబున. ౯.

తే. కలికిలతకూనకువసంత ♦ విలసనంబు, తళుకుఁగ్రొత్తమ్మివిరికినె ♦ త్తావి
కలిగిరహిమీఱఁగాఁ జేయు ♦ కరణిఁ దరుణి, చిన్నినెమ్మేను పాయంబు ♦ చికిలిచేసె.

క. అళికచకచనిచయశ్రీ, విలసనమంబుధరమనుచు ♦ వివరింపనగున్
దళుకుగలమొగిలిఱేకుల, తొలుకారుమెఱుఁగులచటఁ ♦ దోఁచుటకతనన్. ౧౧.

స్రగ్ధర. వదనాంచద్భృంగభార ♦ స్వహృదయవిలస ♦ త్స్వర్వతీత్వంబులుండన్
మదిఁ దాఁ బాటింపకర్థిన్ ♦ మధురిపుగృహిణీ ♦ మానితాంశూద్భవశ్రీన్
దదభిఖ్యం జెందు చక్షు ♦ స్తరణకమలరు ♦ క్సఖ్యమాత్వంబునొందెన్
దదభీష్టప్రాప్తిన్ బ్రధానో ♦ న్నయనమనుగతి ♦ న్మధ్యమాసుప్రసిద్ధిన్. ౧౨.

మ. అలరుంబోఁడిముఖారవిందమహనీ ♦ యామోదవాంఛాప్తిచే
నలిసంఘంబులు వ్రాలిగంధఫలిచా ♦ యన్ మించునాసారుచిం
గలఁగంబాఱియదూరమేగకయెత ♦ ద్గంధాతిలుబ్ధంబులై
నిలిచెన్ బైననొప్పఫాలవిచల ♦ న్నీలాలకల్ చానకున్. ౧౩.

శా. నారీప్రేక్షణకాంతికోటతియుళుల్ ♦ నాళీకముల్ త్రోడుగాఁ
గోరన్ గెల్వఁగనీనికాద్యుతికినై ♦ కొంకేలమీకారుచిన్
మీఱన్నేమనికోరఁ జేరివలగా ♦ మిన్ విచ్చిపోఁదమ్మిక
స్తూరీచిత్రకరేఖవక్త్రమునని ♦ ల్చున్ బొల్చుఁదత్ప్రీతికిన్. ౧౪.

శా. ఆవాగ్భర్త చెలిన్ సృజించుతతిస ♦ ర్వాంగీణసౌందర్యభా
శ్రీవిస్ఫూర్తియుసర్వభూపలలనా ♦ సేవ్యత్వసౌభాగ్యకృ
చ్ఛ్రీవిస్తారముగల్గవర్ణములునీ ♦ రేజాక్షిఫాలస్థలిన్
శ్రీవర్ణద్వయసంపుటంబుగనుప్రా ♦ సెన్నాఁదగున్ గర్ణముల్. ౧౫.

చ. అలికులవేణిభ్రూయుగళి ♦ మన్ ధనువుల్వరకజ్జలప్రభా
విలసితపక్ష్మమార్వికలు ♦ వేగనమర్చిమరుండుచూడ్కులన్
గలువలకోరులన్ దొడిగి ♦ గాఢవికర్షమొనర్చిలక్ష్యమం
దలవడుదాఁకనాచెనన ♦ నందుఁద్రపానతదృష్టులొప్పెడిన్. ౧౬.

తే. చెలి యకందమ్ములందమ్ముఁ ♦ జెందఁగోరి, మీనసంతతులెంతేని ♦ మెలపుతోడ
నీటఁదపమాచరింపఁగ ♦ నాఁటఁగోలె, నవనిరాజీవసంజ్ఞల ♦ నవిభజించు. ౧౭.

తే. మగువకనుదోయియౌవన ♦ మదముపేర్మి, శ్రవణబిలములఁబడునను ♦ శంకనలిన
భవుఁడునిగళంబులుంచిన ♦ భాతిఁగజ్జ, లాంగకతఁబక్ష్మరేఖలు ♦ నలరుమిగుల. ౧౮.

చ. దళములుగూర్చిగంధఫలి ♦ తామరసాయతనేత్రనాసికన్
గెలువఁగవచ్చితద్రుచికిఁ ♦ గీడ్వడిలజ్జఁదొలంగికానన
మ్ములమటుఁగాటనాభ్రమర ♦ ముల్ పువులన్నియుఁజెందువేడ్కచే
నలరియుఁజంపకంబనన ♦ నాదరవృత్తిమెలంగునిప్పుడున్. ౧౯.

ఉ. మీనతసారసత్వమున ♦ మించినదేదనిలోచనద్వయం
బానిసమీకభూరిగతి ♦ నాప్తివిపర్యయదీర్ఘసత్వమై
మానుగనక్షరస్వపట ♦ మన్నిజమధ్యమునందునుంచఁగా
దానఁజెలంగెనాసద్రమ ♦ దామణికిన్ భువనప్రసిద్ధమై. ౨౦.

సీ. కల్కిచిల్కలకొల్కి ♦ గావునఁగెమ్మోవి, పక్వబింబమటంచుఁ ♦ బలుకరాదు
వికచోత్పలేక్షణ ♦ పికవాణిగావున, నధరంబుచివురంచు ♦ నాడరాదు
కామినిజలదాభ ♦ కచగాననోష్ఠంబు, పద్మరాగమటంచుఁ ♦ బలుకరాదు
కలకంఠికమలాస్య ♦ గానరదచ్ఛదం, బలమధురసపూర ♦ మనఁగరాదు
వనితనెమ్మోముసారలా ♦ వణ్యవిభవ, జలధినుదయించుసంపూర్ణ ♦ చంద్రుఁడగుటఁ
దద్గతామలనవసుధా ♦ ధారలుండు, దీపియనవచ్చుఁదొయ్యలి ♦ తియ్యమోవి. ౨౧.

తే. రమణిరమణీయయౌవనా ♦ రంభజాత, సారసాకూతదరహాస ♦ చంద్రికాంకు
రములచాలనఁజెలువొందు ♦ విమలదీప్త, దళితకుందకోరకకాంతి ♦ దంతపఙ్క్తి. ౨౨.

మ. చెలియాస్యద్యుతిఁజెందఁగోరిశశిరా ♦ జీవంబులెంతేవన
స్థలినిచ్చల్ తపమాచరింపనిజమి ♦ త్రస్నేహసంపన్నతన్
జలజంబందెఁదదాత్మతన్విధుఁడజ ♦ స్రంబుంగళంకాప్తిఁద
త్ఫలమొందంగనఁడయ్యెఁగాననదివ్రా ♦ తద్వైరమూలంబిలన్. ౨౩.

తే. చెలియువక్త్రాంబుజంబును ♦ శీతభాను, బింబమునుద్రాసులోనుంచి ♦ శంబరారి
తూఁపలాఘవమునఁగదా ♦ తోయజారి, పాడవునకుఁజేరెమిగులన ♦ ద్భుతముదోఁప.

మ. జనభీతిప్రదఘోషపంకజనన ♦ స్ఫారాయశఃప్రాప్తివ్రో
పనరాశిందపమొందిశంఖముకల ♦ స్వానామృతౌఘంబుకో

ఘనరేఖాత్రయభాసురంబునయిత ♦ ద్భామగళత్వంబునొం
దినముక్తావళితద్భవత్వమునఁజెం ♦ దెన్ హారనామాకృతిన్. ౨౫.

తే. వనితబాహుయుగముకల్ప ♦ వల్లులగుట, తథ్యమనియెన్నఁబోలును ♦ దారలీల
నంగుళులుకిసలంబులే ♦ యనఁగవచ్చు, నరుణనఖకోరకంబుల ♦ నలరుకతన. ౨౬.

తే. భీతమృగనేత్రబాహువుల్ ♦ బిసములగుట, కొకరినడుగంగవలయునే ♦ ప్రకటమగుచుఁ
బాణియుగ్మకనవశోణ ♦ పంకజంబు, లరిదినటఁదోఁచుచుండుటె ♦ గుఱుతుగాదె.

తే. మగువయంగంబులెల్లను ♦ దగన్సృజించి, యంతఁదప్పొప్పచూచువో ♦ నబ్జభవుఁడు
దబ్బజైతోఁచుచున్నమ ♦ ధ్యంబునందు, బుజయిడినచందమున నాభి ♦ పొలుచుమిగుల.

క. జలదరుచివేణినడుమం, జెలువొందఁగఁబిఱుఁదుదనరు ♦ సీమంతినికిన్
జలదాత్యయమునయమునా, జలధారందగుతదీయ ♦ సైకతమనఁగన్. ౨౯.

ఉ. కానకగాత్రనుద్దొడల ♦ కాంతికి నోడియనంటులంతటం
గాననభూమిలోనణఁగి ♦ కైతవవృత్తినిసర్గతత్ప్రభా
నూనవిలాసముంగొనఁగ ♦ వొక్కటదొంగలనంతరించియున్
దానసుజెందలేకయటఁ ♦ దద్దయువాంచుశిరంబులజ్జచేన్. ౩౦.

చ. దళములు వెంచికంజములు ♦ తామరసాక్షిపదద్వయంబుతోఁ
జలమునఁబోరవచ్చిరుచి ♦ సంపదసాలమిచేసహస్రధా
దళితములౌటనోచివురు ♦ తండమునూపురపద్మరాగభా
విలసనకైతవంబులను ♦ వేమఱుఁజేరిభజించుచుండుటల్. ౩౧.

తే. చెలియప్రపదంబుఁజూచిల ♦ జ్జించికచ్ఛ, పంబుదనతలఁబొట్టలో ♦ పలనెయుంచు
నంతఁబోకవిరక్తిచే ♦ నవనినెగడుఁ, గమఠమననెందుఁదానరి ♦ గాఁడనంగ. ౩౨.

మ. మొగమాచందురుఁగేరుఁగెంపులనగున్ ♦ మోవద్దపుంబిల్లలం
దిగడుంజెక్కులుచంచలాళిగెలుచున్ ♦ దేహంబునబ్జంబులన్
నగుఁబాణుల్ కనకప్రసూనకళికల్ ♦ నాసారుచుల్ ప్రేళ్లహో
చిగురుల్ మీఱెడునెంచఁగావన మెయా ♦ సీమంతినీరత్నమున్. ౩౩.

సీ. పద్మాక్షివేణితోఁ ♦ బాణితోనెనరావు, కందముల్ కనకార ♦ విందములును
దనుమధ్య మోవితోఁ ♦ దావితోసరిరావు, బింబముల్ సూనక ♦ దంబములును
సుదతిపల్కుద్గుతో ♦ నుదురుతోఁదులరావు, కుందముల్ శశిరేఖ ♦ చందములును
చంద్రాస్యయారుతో ♦ సారుతోదొరరావు, నీలముల్ చంచలా ♦ జాలములును

నలినలోచనతోడలతో ♦ నడలతోడఁ, గంబముల్ మదమత్తకా ♦ దంబములును
దలఁపఁసకి గావుమృదులతా ♦ తన్వి నెంచ, నలవియే వేయుజిహ్వల ♦ చెలువకైన. ౩౪.

ఉ. చంద్రుఁ గేరుమోముజిగి ♦ సౌరుప్రవాళము మీఱుమోవితా
నంవపుఁజిన్ని వెన్నెలల ♦ యారెయొయారమురువ్వునవ్వలిం
దిందిరపాళికింగురులు ♦ నీటగుముంగురులద్దిరయ్యయే
మందము ధారుణీవలయ ♦ మందము దానిపిఱుందుచందముల్. ౩౫.

సీ. బిసములకును బుట్టి ♦ కుసుమదామవిభూతిఁ, బరిభవింపఁగఁజాలు ♦ బాహుయుగము
కమలంబులకుఁబుట్టి ♦ కంతులకోరీల, కిట్టింకులిడఁజాలు ♦ నీక్షణములు
చిగురాకులకుఁబుట్టి ♦ జిగికెంపునిద్దంపుఁ, దేటవాటింపని ♦ తియ్యమోవి
హరిపదంబునఁబుట్టి ♦ హరిమధ్యమును బట్టి, యల్లలనాడించు ♦ ననదుఁగౌను
ననఁటులకుఁబుట్టిమదహస్తి ♦ హస్తములను, జెనకఁజాలిననున్దొడ ♦ చెలువుగలిగి
వెలయునబ్బాలలావణ్య ♦ వివిధలీలఁ, దలమెను తియింపవేనోళ్ల ♦ చెలువకైన. ౩౬.

ఉ. కౌముదితేటలబ్జముల ♦ కాంతి మెఱుంగుల చెన్ను పుష్పపుం
దామమునందముత్పలవి ♦ తానము చందము నేర్చికూర్చియా
తామరచూలి నేర్పుప్రథి ♦ తంబగునట్టులగా సృజించెనో
కామినిమందహాసము మొ ♦ గంబును దేహము బాహులక్షులున్. ౩౭.

తే. అనుమనీరీతి ద్విజవర్యుఁ ♦ డలరుఁబోఁడి, చారులావణ్యగరిమంబు ♦ సారఘణితి
మెఱయనభివర్ణనము సేసి ♦ మఱియునిట్టు, లనియెదానవవైరితో ♦ వినయ మెసఁగ.

సీ. ఆరూఢయౌవన ♦ యగునట్టితనపుత్త్రిఁ, గనుఁగొని భీష్మకుం ♦ డనఘువృత్తిఁ
దగినట్టివరునకుఁ ♦ దరళాయతాక్షిని, బరిణయంబొనరింపఁ ♦ దఱియటంచు
మది నెంచి బంధుల ♦ కదియెల్ల విదితమా, నటు సేయనందుల ♦ కలరివారు
నిదియుక్తమీరీతి ♦ కిఁకఁ దామసము చేయఁ, బాడిగాదటుగానఁ ♦ బరిణయంబు
వేగగావింపుమనిపల్క ♦ విభుఁడు దాని, కలరినాలికినను రూపుఁ ♦ డైనధవుని
నిశ్చయింపంగ నొడయులు ♦ నెమ్మిమీర, లనినవారిట్లు పలికిర ♦ మ్మనుజపతికి. ౩౯.

ఉ. కాంతునిరూపవంతునిఁ గఁ ♦ గన్నియ గోరును విత్తవంతుఁ గా
నెంతయు నెంచుఁ దజ్జనని ♦ యిచ్చను నిచ్చలు నెన్ను సత్కులా
వంతునిఁ గాఁగఁ దద్గురుఁడు ♦ బంధుజనంబులు సత్కులీనుఁ గాఁ
గాంతురు లోకముత్సవముఁ ♦ గాంచిను తించు వివాహవేళలన్. ౪౦.

క. కావున నీగుణములు గల, భూవరసుతు నొకని వెదకి ♦ పూర్ణేందుముఖిన్
శ్రీవెలయఁ బెండ్లిసేసిన, యేవారును మెచ్చుకుందు ♦ రేనినునధిపా. ౪౧.

తే. అరయ సర్వజ్ఞుఁడవగు నీ ♦ వఖిలదేశ, వాసిభూమీశ్వరాత్మజ ♦ వర్తనంబు
తెలియఁగుదువు గానఁ దగినట్టి ♦ వరుని వెదకి, కూఁతు నిమ్మని పల్కె నా ♦ క్షోణివిభుఁడు.

మత్తకోకిల. మీరతెంచిన సద్గుణంబుల ♦ మీఱు రాచకొమారులిం
దేరి యేరిగణించి చూచిన ♦ నించువిల్తునితండ్రియున్
వారిరాశితనూభవాపతి ♦ వారిజోద్భవవంద్యుఁడున్
వారిజాప్తమృగాంకనేత్రుఁడు ♦ వాసుదేవుఁడొకండిలన్. ౪౩.

సీ. ఎవ్వనిశాసనం ♦ బిందుశేఖరసరో, జాసనాగ్రకిరీట ♦ భాసురంబు
తనరు నెవ్వనిబల ♦ దావాగ్ని సురరిపు, గ్రామణిశలభైక ♦ ఘస్మరంబు
తగు నెవ్వనిచరిత్ర ♦ నిగమాంతరాద్ధాంత, సంతతాన్వేషణ ♦ శ్రాంతిదంబు
చెలఁగు నెవ్వనిమనో ♦ విలసనంబీహాప్ర, వర్తితాఖిలభూత ♦ నర్తనంబు
వెలయు నెవ్వం డు సురనర ♦ వివిధతిర్య, గచలమయనైకలోకవి ♦ హారపరత
నట్టిజగజెట్టి మనయల్లుఁ ♦ డగుటకంటె, భాగ్యమున్న దె తెలుపుఁడీ ♦ బంధుజనులు.

క. ఈగతి భూపతి యనఁ, దా వాగమృతముఁ గ్రోలి సభ్య ♦ వరులు సెలంగన్
నాగరిక వినుతగర్జా, భోగముతో దివ్యకుసుమ ♦ ములు జడివట్టెన్. ౪౪.

తే. అంతనివి యెల్లవినిరుక్మి ♦ యతులరోష, వివశుఁడై పల్కె సభవారు ♦ వెరఁగుపడఁగఁ
దనదుబాల్యంబు కతమునఁ ♦ దండ్రి నైన, సరకుసేయని యుద్ధతి ♦ సమదలీల. ౪౫.

క. ఈలీలావతి కృష్ణున, కేలాగున నీయఁదలఁచె ♦ నిప్పుడు ధరణీ
పాలుండు మీరలిప్పుడు, కాలించితిరెట్టులుచిత ♦ మాయిది మీకున్. ౪౬.

సీ. చనుపాలొసంగిన ♦ వనితనొంచెనటన్న, ధర్మాత్ముఁడనియెట్లు ♦ తలఁపవచ్చు
మత్తుఁడై తనమేన ♦ మామఁజంపెనటన్న, శ్రుతవంతుఁడనియెట్లు ♦ చూడవచ్చు
నలజరాసంధున ♦ కనివీఁగిచనెనన్న, బలుమగండనియెట్లు ♦ పలుకవచ్చు
నాభీరసతులపాం ♦ దాసించి నాఁడన్న, నందగాఁడనియెట్టు ♦ లాడవచ్చుఁ
దనదుతలిదండ్రులెంతయు ♦ వనటఁగనుచు, దొంతిసంకిళ్లఁబడినుండ ♦ సంతసమున
దోఁచినట్టులతిరుగాడు ♦ చుండఁగేఁడు, నెనరుగలవాఁడనుచు నెట్టు ♦ లనఁగవచ్చు.

క. వానిచరిత్రలు లోకము, లోనంగల ప్రజకువింత ♦ లునురంతులునై
నానాఁట నెగడవినమే, యానాటనపరునిమనకు ♦ నంటనఁదగునే. ౪౮

శా. ఏరీతిం గణియించి చూచిననువృ ♦ క్షీశుండు పాత్రుండుగాఁ
డీరామామణి నీయవిక్రమకళా ♦ హేలాపరాభూతవీ
రారాతిప్రకరుండు సద్గుణకదం ♦ బావాసుఁడౌ చైద్యుఁడీ
నీరేజాక్షిని బెండ్లియాడమనకు ♦ న్నైత్రైకపర్వంబగుస్. ౫౦.

ఆ. ఇట్లుపలుకుసుతున ♦ కెంతేని మోమోడి, మాఱువలుకకుండె ♦ మనుజనాథుఁ
డంతభీష్మమహిషి ♦ యంగనాతిలకంబు, ధర్మవచనసరణిఁ ♦ దలఁచిపలికె. ౫౧.

తే. ఏల మీలోనివాదంబు ♦ లిట్లుగలదె, మీరువారని మీరేల ♦ పేరుఁవాఱఁ
గన్యదనకంటికింపైన ♦ ధన్యునొకనిఁ, గోరికొనుఁగాక రాచకొ ♦ మారులందు. ౫౨.

క. పిలిపింపుఁడు నానాథూ, తలనాథకుమారవరుల ♦ ధైర్యాత్ములన
త్యలఘుబలాన్వితులనుని, ర్మలనిజచరితులస్వయంవ ♦ రంబునకిటకుస్. ౫౩.

వ. అని యివ్విధంబున నమ్మహారాజమహిషి నిజవల్లభాశయానుగుణంబును, నిఖిలబాంధవ సందోహప్రహర్షప్రదంబును, గుటిలహృదయకుమారవిరచితాసంభావనానుకూలంబుగాఁ జాతుర్యంబు నివ్వటిల్లం బలుక నవ్వధూమణివాక్యంబులకుఁ దత్సభంగలదొర లిమ్మహాదేవి యింత యొప్పం బలుకునే యిప్పలుకు తెఱంగున న్నడచుట మనవంగడంబునకుం గల ధర్మం బని యేకకంఠంబుగాఁ బలికి రప్పలుకులకు మొగంబు గంటువెట్టుకొని యాఁగాదనంజాలక రుక్మి యూరకుండె. అవ్విదర్భమండలాధీశ్వరుండును దత్సమయంబునఁ దనవ్రాయసాలవారెనిం జూచి నిఖిలనరపాలపుంగవకుమారులకు నుత్తరంబులు వ్రాయుఁడని మహాహర్షోత్కర్షంబుగా నానతిచ్చి సముచితప్రకారంబున నిజాంతఃపురంబున కరిగె. అటఁ గుటిలహృదయుం డగురుక్మియనువాఁడును దనసంగడీలం గూడి మంతనంబునకుం జొచ్చి యెత్తెఱంగున నైన నిత్తరుణి శిశుపాలునకే యిత్తునని రహస్యంబుగా నిశ్చయించి నిజమందిరంబునకుం జనియె నంత కొన్నిదినంబు లరుగుటయుఁ గ్రమక్రమంబున. ౫౪.

క. కరితురగరథపదాతి, స్థిరవిక్రమలీలధరణి ♦ దిర్దిరదిరుగస్
నరపాలసుతులురాఁవొడఁ, గిరిదిక్కులనుండిరాజ ♦ కీయులుపిలువస్. ౫౫.

తే. అయ్యకొలువుననడచిన ♦ యవ్విశేష, మన్నకాదన్న పలుకులు ♦ నాత్మజనని
యాపుయికముస్వయంవరం ♦ బనిన తెఱఁగు, చతురులైనట్టితనవయ ♦ స్యలువచింప.

సీ. శీతాంశుబింబాస్య ♦ చిఱుతనాఁటనుగోలె, సఖులచేనెపుడుఁబ్ర ♦ సంగవశత
భవదీయసౌందర్య ♦ భవ్యతరస్థైర్య, విభ్రమాదార్యముల్ ♦ వినుటఁజేసి

చెలికత్తియలకైనఁ ♦ దెలివిడిగాకుండఁ, దనునీదుస్వామిగాఁ ♦ దలఁచియుండు
నింగితజ్ఞుఁడనట ♦ సంగనామణిచిత్త, మింతంతయెఱుఁగుదు ♦ నేనొకండ
నాత్మసంకల్పమంతెరా ♦ యంబునొందు, నన్నుఁబటుభీతిచెలరేఁగి ♦ తన్నుఁగ్రమ్మి
చిత్తసంక్షోభమొనరింపఁ ♦ దత్తఱిలుచు, బాలసంతాపమునఁగుందు ♦ వేళయందు.

తే. పద్మలోచనకెప్పటి ♦ భంగి నేను, జదువుచెప్పంగనగరికిఁ ♦ జనినయపుడు
భూరినారంగకదళికా ♦ నారికేళ, మహితమైనట్టియారామ ♦ మధ్యసీమ. ౫౮.

సీ. కెలఁకులఁజెలువొందు ♦ నెలమావిగుములఁ, గ్రమ్ముద్రాక్షలతోడఁ ♦ గలసిమెలఁగు
నేలకతీవెల ♦ నెనసినకపురంపు, టనఁటులపజ్జలం ♦ బెనఁగియున్న
గొజ్జంగపాదలపైఁ ♦ గురిసినచిఱుమంచు, చినుకులతోఁగూడఁ ♦ బెనఁగివచ్చు
చిఱుతతెమ్మెరలచే ♦ విఱిగినతరఁగల, మించుటుయ్యాలలలరా ♦ యంచకొదమ
పిండునిమురింపజోలలు ♦ బిట్టుపాడు, తుమ్మెదలకిమ్ములైయొప్పు ♦ తమ్మిపూల
మెండుపుప్పొడికలయుంగ ♦ నిండియున్న, చలువతావులువెదచల్లు ♦ కొలనిచెంత.

క. బాలసహకారభూరుహ, మూలస్పృహణీయతమత ♦ మోవిమతశిలా
నీలాబ్జశయ్యమీఁదని, జాళితతుల్ గొలువనున్న ♦ యంగనఁగంటిన్. ౬౦.

చ. కనుఁగొనియున్నివాళ్లవలెఁ ♦ గల్కియిదే మొకో చేరవచ్చినన్
వనుఁగనిలేచిమ్రొక్కుఁదువి ♦ నమ్రముఖాంబుజయయ్యెనిప్పుడీ
వనజదళాక్షియంచుమది ♦ వారనిప్రేముడిఁజేరఁబోవవా
డినపుడుఁదీఁగెరీతిఁ బ్రక ♦ టించులతాంగినిజూచి నెచ్చెలుల్. ౬౧.

సీ. కూరిమిరాయంచ ♦ కొదమలలాలించి, నడపింపరాదటే ♦ నలిననేత్ర
కేలఁగైకొనిచిన్ని ♦ కీరంబునకు నేల, మాటలునేర్పవే ♦ మచ్చెకంటి
మేళవించివిపంచి ♦ నాలాపగతిమీఱఁ, బలికింపవేలొకో ♦ పంకజాస్య
జలకమాడుమటంచుఁ ♦ జెలులెచ్చరింపఁగాఁ, బోవమ్మనెదవేల ♦ పూవుఁబోణి
కలపమలఁదవిదేటికే ♦ కంబుకంఠి, వన్నెలిడనొల్లవేటికే ♦ వన్నెలాఁడి
పూలుముడువవదేటికే ♦ నీలవేణి, యారగింపవదేటికే ♦ యబ్జపాణి. ౬౨.

క. ఈవచ్చినయొజ్జలనిటు, సేవింపకయుండనీకుఁ ♦ జెలియాతగవే
నావినినాదిక్కుమొగం, బైవనజదళాక్షిలేచి ♦ యతిభక్తిమెయిన్. ౬౩.

తే. విధియుతంబుగనర్ఘ్యాది ♦ విధులొనర్చి, యుచితకనకాసనంబున ♦ నుండఁబనిచి
నానవానతవదనయై ♦ చాననిలువఁ, గలికిచెలులెల్లననుఁజూచి ♦ పలికిరపుడు. ౬౪.

తే. భూసురోత్తమ మీరు మీ ♦ పుత్త్రికన్న, వెన్నఁదగు ప్రేమ నీకన్నె ♦ నెపుడు చూచు
చుండెదరు గానఁ దెలుపక ♦ యుండఁదగదు, వినవలయు మీర లీకన్నె ♦ వితము నేఁడు.

సీ. నీరజదళనేత్ర ♦ నిన్నటినుండియు, నత్యంతచింతాభ ♦ రాప్తినొంది
చెలులతోఁ బలుకదు ♦ కలపము లందదు, వీణె వాయింపదు ♦ విరులు తురుము
దంచల నడపింప ♦ దలరులు చిదుమదు, పలికింప దొకపరిఁ ♦ జిలుక నెపుడు
తొడవులు పెట్టదు ♦ విడెమీయఁబోయిన, నాదరింపక త్రోయు ♦ నవలఁ జెలిని
ఇట్టు లుండంగఁ గారణం ♦ బేమి యనినఁ, జెలియ మాతోడ మము మాట ♦ పలుక దిపుడు
కలికి హృదయంబు మీరైనఁ ♦ దెలియరాదె, యనుచుఁ బలుకంగ వినియంత ♦ నలరుఁబోఁడి.

క. కన్నె అనేఱము చనపుడ, కన్నియ మనమునఁ గినియుచుఁ ♦ గడువడిఁ దనచే
నున్న విరిదమ్మి వైచుచు, నన్ననఁబోఁడుల విదల్చి ♦ యవ్వలఁ జనియెన్. ౬౭.

ఆత్తఱిభోజన్నృపాలుని, బిత్తరియరు దెంచి మాకుఁ ♦ బ్రియ మొనఁగఁ గడున్
బత్తి యొనరించి యోవి, ప్రోత్తమ మీ రిపుడు వింటి ♦ రో లేదో గదా. ౬౮.

క. ఈసకియున్న యునికిమ, హీసురకులతిలక నిన్న ♦ నృపుసభ వార్తల్
దాసీజనములు దెలుపఁగఁ, దాసైఁపమిఁ జేసియనుమఁ ♦ దలఁపుఁడు మదిలోన్. ౬౯.

వ. ఒదవిన వృద్ధభావమిది ♦ యొక్కటియే మహనీయబుద్ధియున్
సదమలవృత్తమార్జవము ♦ శాస్త్రవిధిజ్ఞతయెల్లఁ గల్గుటన్
మదిఁ దలపోసి గాన్నృపుఁడు ♦ మన్ననమిమ్ము గురుత్వబుద్ధిచే
ముదితకు విద్య నేర్పుఁడని ♦ మోదము నన్నియమించియుంచుటల్. ౭౦.

తే. అట్లు గావున మీకంటె ♦ నాప్తుఁ డొకఁడు, గలుగ నేర్చునె మదినున్న ♦ కార్యమెల్ల
విన్నప మొనర్తునది మీరు ♦ వినుచునాడు, మనవి చేఁగూర్చియిచ్చెద ♦ మనిన యపుడు.

అనవుండిట్లని పల్కుతి, వనజేక్షణతోడ నెందుఁ ♦ బనిచినఁ జననీ
మనమునఁ దలఁచిన కార్యం, బనుకూల మొనర్తుఁ బల్కు ♦ మాజంకేలా. ౭౧.

ఈగతి నెంతేని ♦ హితము దోఁపఁగఁ బల్క, నాకిట్టులని పల్కె ♦ నలిననేత్ర
మనుజేశుఁ డాదరం ♦ బున రుక్మిణికిఁ బెండ్లి, యొనరింపఁగా నెంచి ♦ వినుతలీల
బంధులకెఱిఁగింపఁ ♦ బ్రమదంబుతో వారు, నదియుక్తమని పల్క ♦ నలరియపుడు
వసుదేవసుతునకు ♦ వనితనిచ్చుటయుక్త, మనినిశ్చయము సేసె ♦ నవనివిభుఁడు
నీవితం బెల్ల వినియుక్మి ♦ యీసుతోడ, హరిని నిందించి శిశుపాలుఁ ♦ గరముఁ బొగడి
యతనికిచ్చుట తగునని ♦ యపుడు పలుక, నింతయును విని నేనపు ♦ డిట్టులంటి. ౭౩.

క. ధరణీశులందఱిం దమల, కరుదెంచినవారిలోన ♦ హరిమధ్యస్వయం
వరమునఁ గోరినవారికిఁ, దరుణీమణి నిచ్చుటరయఁ ♦ దగవని యంతన్. ౨౬.

సీ. ఇది యుక్త మని సభ్యు ♦ లెల్లవారును బల్కఁ, గవనీశుఁ డామోద ♦ మందియుండ
చారులఁ గనుఁగొని ♦ సత్వరగతిఁ జని, ధరణీశ్వరుల నెల్లఁ ♦ దడయ కిపుడు
తోడితెమ్మనసుక్మి ♦ మోడితోఁ దనయింటి, కడకేగి దుర్మంత్ర ♦ మెడఁద నెంచి
బలిమి చేనైనను ♦ బద్మాయతాక్షిని, శిశుపాలునకు పెండ్లి ♦ సేయఁ దలఁచు
టంతయును రుక్మిణి ♦ యధికదుఃఖ, మంతరంగంబు నేఁటియంగ ♦ నార్తినొంది
నెపుడు కృష్ణుని వరియింప ♦ నెంచుకతన, నరయ వేఱొక్కరుని బెండ్లి ♦ యాడరోసి.

ఉ. కావున వాసుదేవు నిటు ♦ కంజదళేక్షణ గోరియుండుటన్
భూవిభుఁ డేను నిద్దఱముఁ ♦ బొల్పుగ యోజన చేసి యెట్టులేన్
శ్రీవరుఁ డైనకృష్ణునికిఁ ♦ జేడియ నిచ్చినభాగ్య మంచు మా
భావమునం దలంచితిమి ♦ పద్మభవాన్వయవార్ధిచంద్రమా. ౨౭.

ఉ. ఈగతి కంతరాయముగ ♦ నెంచిన రుక్మికి దుష్టవృత్తి యే
బాగుగ నెంచి యాసురవి ♦ వాహమునన్ సతి నాక్రమింపఁగా
వేగమె వచ్చు చైద్యునకు ♦ వేమఱు నుందలవంపులౌనటుల్
రాగము నెందు రుక్మిణికి ♦ రాజవతంసుని గృష్ణుఁ గూర్పఁగన్. ౨౮.

క. మీచేతనైన దగుటను, వేచని ద్వారకకుఁ జేరి ♦ విస్ఫుటఫణితిన్
సూచింపుఁ డెల్లకార్యం, బాచక్రాయుధునితోడ ♦ ననఘా తెలియన్. ౨౯.

సీ. కరము మత్ప్రార్థనఁ ♦ గైకొని మీరలు, శ్రీకృష్ణదేవుని ♦ చెంతఁ జేరి
ధవళాక్షి రుక్మిణిఁ ♦ దనుఁ గోరియున్నట్టి, తెఱఁగును భీష్మక ♦ నరవరుండు
నేనును నాచంద ♦ మెంచియున్నక్రమం, బందులకు విరోధి ♦ యైనరుక్మి
దుర్మంత్రమును జెప్పి ♦ తోడనతా నిందు, వచ్చి మాకెల్లను ♦ బ్రమద మెసఁగఁ
జైద్యుఁ డాదిగాఁ గల ♦ యట్టిశత్రునృపుల, నందఱ జయించి సత్కీర్తి ♦ నధిగమించి
యంబుజాక్షిని వరియింపు ♦ మనుచుఁ బలుకు, మనఘచారిత్ర భూదేవ ♦ తాగ్రగణ్య.

చ. అనవిని యిట్టులంటి మను ♦ జాధిపురాణికి నీదుపంపునం
బనివిని శీఘ్రమే యిపుడ ♦ పంకజనేత్రుని చెంత కేగి యా
తనిమది కింపుపుట్టఁగను ♦ ధారసధారలు వొని వాక్యముల్
పనుపడఁ దెల్పితోడ్కొనుచు ♦ వచ్చెద నిందు నరాళకుంతలా. ౩౦.

మ. అనియిట్లేఁ వనతల్లితోఁ బలుకుచో ♦ నబ్జాక్షియారుక్మిణీ
వనితారత్నములజ్జనొందిదివినమ ♦ ద్వక్త్రాబ్జయై యుండియుం
మునుమున్నుల్కలుదేహమందుఁబొడమెం ♦ బూర్ణేందుభాస్వన్ముఖం
బునసాకూతదరస్మితంబువెలిసె ♦ బ్రాంగేలతాతన్వికిన్. ౯౧.

తే. ఇట్లువ్రీడాభరంబున ♦ నించుఁబోఁడి, చెలులకునుదయహృదయంబు ♦ తెలియకుండ
దాఁచియున్ననునీమీఁద ♦ దవిలియున్న, మనముతెలిసెఁగినననురాగ ♦ మహిమనపుడు.

క. వనితారత్నముమదిఁగల, ఘనమగురాగానుషక్తి ♦ గాంచుటనాకున్
గనుఁగొనఁగవిశదమాటన్, వనజేక్షణసత్వరముగ ♦ వచ్చితినిటకున్. ౯౩.

ఉ. వారిజనాభ నేనిటకు ♦ వచ్చుతఁజెందరళాక్షితోడనీ
ప్రాభటనుండుమీకలఁక ♦ నొందకుమీరయెటులైనఁబ్రార్థనా
చారువచోవిలాసముల ♦ సమ్మదమానటువిన్నవించియా
శౌరినిదోడితెత్తునని ♦ సాదరవృత్తినిబల్కివచ్చితిన్. ౯౪.

క. భక్తులప్రతిజ్ఞగూర్చుట, యుక్తముగదనీకువారి ♦ జోదరవిలస
న్నక్తంకరముఖిభవదా, సక్తాత్మికఁగొనుటలోక ♦ సమ్మతిసుమ్మీ. ౯౫.

క. అనియిట్లుభూసురాగ్రణి, తనరాకకుఁగారణంబు ♦ తథ్యముపలుకన్
వినియంతఁగూర్మినిట్లను, దనుజారిప్రమోదపూర్ణ ♦ తనువిప్రునితోన్. ౯౬.

సీ. ధారణీసురవర్య ♦ మీరాకవలిచ్చిన, వితమెల్లవింటిమి ♦ వ్రతముగాక
భీష్మకనరపతి ♦ పెండ్లికిరమ్మంచు, మముఁబిల్వనంపిన ♦ మన్ననయును
మీరిటవచ్చుచో ♦ మెలఁతకృష్ణునిదెత్తు, నేరీతిననినవా ♦ గ్గౌరవంబు
నేకమైనదిగాన ♦ నేయంశమునఁజూడ, నేవాయితంబయి ♦ యిపుడెయఁదుఁ
జనుటతగవౌటశుభమైన ♦ సమయమునను, గదలివచ్చెదఁదెచ్చెదఁ ♦ గమలనయనఁ
జైద్యుఁడొకఁడేలవినువిప్ర ♦ సకలసురులు, నాగ్రహంబునఁజనుదెంచి ♦ యడ్డపడిన.

క. మీరాకపోకలచ్చటి, పౌరులకుందెలియరాని ♦ భంగినిమెలఁగన్
నేరుతురమీరమీకిఁక, వేరేవివరింపనేల ♦ విశ్రుతలీలా. ౯౭.

క. అనిపలికివస్త్రభూషణ, కనకాదులుకన్నుదనియఁ ♦ గానొసఁగితగం
బనిచిననినిచినహార్దం, బుఁబిడ్డొకనిచనియెవిప్ర ♦ పుంగవుఁడంతన్. ౯౮.

తే. యదుకులాధ్యక్షుఁడునుభూసు ♦ రాగ్రగణ్యు, పలుకులనువిన్నసిమ్మ ♦ లలనగేలున
నెట్టుగొనిబాలఁగన్నులఁ ♦ గట్టినట్లు, నిన్నటిలుచుండవ్యామోహ ♦ నిరతుఁడగుచు.

తే. ఎపుడు కుండినపురికేగి ♦ నృపుల నెల్ల, జన్యభూమిని నిర్జించి ♦ జయముగాంచి
పంకజాక్షిని వరియించి ♦ ప్రమద మెసఁగఁ, జిత్తజన్ముని సంకల్ప ♦ సిద్ధిఁగాంతు. ౯౧.

క. అనియిట్లు మదిఁదలంచుచు, వనజాక్షిని సంగ్రహింప ♦ వదలని ప్రేమన్
మన మెంతయుఁ జివురొత్తఁగ, దనుజేంద్రవిదారిగమున ♦ తత్పరమతియై. ౯౨.

సీ. కొలువుకూటముఁ జేరి ♦ బలభద్రసాత్యకి, ప్రభృతులునముఁగులౌ ♦ బంధుజనులు
హితులుఁ బురోహితుల్ ♦ చతురులౌ మంత్రులు, నలుగడ నెంతేని ♦ బలసి యుండ
నందఱఁ గనుఁగొని ♦ యాదరం బడరంగ, భీష్మండు తనయుకుఁ ♦ బెండ్లిసేయ
వైభవంబున స్వయం ♦ వరము చాటించుచు, మనకునుత్తరమునం ♦ పినవితంబు
మీరు వింటిరె కదయిఁక ♦ మీఁదమనము. తామసము సేయుటిది యుచి ♦ తంబుగాదు
కాన ఱేపప్రయాణమై ♦ కదలవలయు, గమనసన్నద్ధులై వేగ ♦ కదిసిరండు. ౯౩.

క. అనిశౌరి వలుకనట్లన, పనివిని యెదమింతకన్న ♦ భాగ్యము గలదే
యని వారు సంతసింపఁగ, వనజాక్షుఁడు వారిఁ బనిచి ♦ వైభవ మెసఁగన్. ౯౪.

ఉ. అంతిపురంబుఁ జేరి జల ♦ జాయతలోచన మీఁదిప్రేమచే
స్వాంతము పల్లవింపమృదు ♦ శయ్యపయిం బవళించి బాళినే
కాంతలతాంతచాపగుణ ♦ కర్కశదుస్సహనిస్స్వనార్తనా
వంతయు నిద్ర రామి నిద్రి ♦ యామఁదరించెఁద్రిలక్షయామఁగన్. ౯౫.

వ. అంతఁ బ్రభాతసమయం బగుటయు నప్పుండరీకవిలోచనుండు పయనంబై యహర్ముఖ సముచితకర్మకలాపంబు నిర్వర్తించి సముచితాంగరాగభూషావిశేషవిభూషితుండై యంతఃపురంబు వెడలి యంతకుమున్న పయనంబునకుఁ గట్టాయితంబై వచ్చిన బలభద్ర సాత్యకిప్రముఖయదుపుంగవుల సాదరావలోకదరహాససంభాషణాదులవలన సంభావించి వారలుం దానును విమలనవరత్నపాంచాలికారచితవివిధరాజోపచారంబగు సభాద్వారంబు నిర్గమించి కొలువుకూటంబునకు వచ్చి వెంబడిఁ జనుదెంచువారును, బురంబున నధివసించువారును, వీరువీరని హాసము దొరల వేరువేర పేరువాడి నియమించి విద్వజ్జనంబును రావించి వారలకుఁ బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణసమయసముచితంబులగు ధనకనకవస్తువాహనంబులు దానంబు లొసంగి తదాశీర్వాదపూర్వకమంత్ర పరికల్పితాక్షతదూర్వాంకురాదిమాంగళికద్రవ్యంబులు భక్తియుక్తిం గైకొని వారలవలన ననుమతుండై హజారంబు వెడలి శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకసమాహ్వయగంధర్వ బంధురంబును, బతంగకులధురంధరపతాకికావిలిఖితకంధరంబును, శంఖచక్రగదాశార్ఙ్గాదిదివ్యాయుధసమన్వితంబును నగా జతనపఱిచి దారుకుండు దెచ్చినశతాంగంబు

నకుం బ్రదక్షిణంబు గావించి ముంగల నిలిచి యభంగురమంగళావహనినదచాతుర్యంబు లగుతూర్యంబులు సెలంగ నాంగికంబులగుచుం దోఁచుశుభనిమిత్తంబులకుఁ జిత్తంబునందు సంతసిల్లుచు బలభద్రపూర్వకంబుగా నడచి రథారోహణంబు గావించి యొంటరుల నెలగోలుప్రజలముందరం జనఁ బనిచి యదువృష్ణిభోజాంధకప్రముఖబంధులోకంబుతోడ సాత్యకి నత్యంతసావధానత్వంబున వెన్నుగాచి రమ్మని నియోగించి శుభముహూర్తంబునం గదలి సుమంగలీసలిలపూర్ణకలశయుగకుసుమదామదధిక్షీరఘటాముల నవలోకించుచు నభంగసముత్తుంగసౌధశృంగంబులనుండి పుణ్యపణ్యాంగనలు వెల్లి వెదచల్లు సేసవిరులకు నుల్లసిల్లుచుఁ బురంబు నిర్గమించి యనుగుననరంబున.

సీ. ప్రళయకాలోత్తుంగ ♦ జలధిభంగాభంగ, ఘుమఘుమంఘుమలతోఁ ♦ గూడియాడి
నరసింహవదనగ ♦ హ్వరసముత్థితమహా, కహకహాధ్వనులతోఁ ♦ గలసిమెలసి
యసమానహాననదు ♦ ర్వ్యసనసంత్రాసది, గ్వసనఘోరార్భటుల్ ♦ కనటుమించి
కనకదృక్పీఠభు ♦ క్క్రతినదగ్ధనక్ర, త్రికూటకుభృద్ఘుటఘుట ♦ లటుమటించి
బలసియీరీతి భువిలోనఁ ♦ బ్రబలిమెఱయు, శక్రలోకమహర్లోక ♦ సత్యలోక
తలతలాతలపాతాళ ♦ తలములంటి, భైరవంబయ్యెవిజయభే ♦ రీరవంబు. ౯౨.

క. చతురంగబలసమన్విత, గతినీగతి వేగిరమ్ము ♦ గలపయనముల
జతనముగనడచియదుకుల, పతికుండినపురముఁ జేరెఁ ♦ బ్రాభవమొనఁగన్. ౯౩.

క. తనరాకన్విని భీష్మకుఁడు, తనయాప్తులతోడనపుడు ♦ తగురీతి నెదు
ర్కొనిపూజింపఁగ యదునం, దనుఁడప్పురిబయలనుపవ ♦ నంబునవిడిసెన్. ౯౪.

వ. అనిన శుకమహాయోగిం గనుంగొని పరీక్షిన్నృపపుంగవుం డప్పాలివృత్తాంతం బెట్టి దీ యువలయునని యడిగిన. ౯౫.

మ. కనకాచ్ఛాదనగౌరగౌరవసను ♦ గ్రస్ఫారదోర్దండలీ
వినిపాతాహితవీరవీరరసద్ృ ♦ గ్విజ్ఞాపనాజ్ఞప్తిభా
జననానాసురవారవారణమహా ♦ సంరంభవ్యాత్పద్మన
జ్జనచక్రాద్యవతారతారకవిలా ♦ సశ్రీనఖాంచత్పదా. ౯౬.

క. కంసమదహంసవిదళన, శంసనముదితాయమాన ♦ శారీరసభా
హింసాపరదనుతనుజ, ధ్వంసప్రభలోలనటన ♦ దమితవ్యాళా. ౯౭.

నర్కుటము. సరసిజపత్రవిలోచనసంస్మృతి ♦ సాగరమోచనసారకృపా
స్ఫురితసుదర్శనభవ్యహలుతాశన ♦ శోషితకైటభనవ్యనపా

స్వరసమరోచితక్షైతవభాషణ ♦ సాధితనూతనభోజసుతా
హరబలిజిత్వరధాత్రుముఖామర ♦ హారిపవాంగదదీప్తికరా. ౧౦౩.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజసుతాపరిణయంబను మహాప్రబంధంబున ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

క. శ్రీవర్ణనీయశశితవి, క్ష్మావిద్ధహృదయలలితవి ♦ హారవిచారా
పావనజనతావనబ్బం, దావనఘటితప్రచార ♦ నందకుమారా. ౧.

వ. అవధరింపు మప్పరీక్షిన్నృపాలునకు శుకమహాయోగి యిట్లనియె. అట్లమ్మురదమనుల
సురంధరుండు విదర్భానగరసవిధసముంచితోద్యానానవద్యమధ్యదేశంబున నసం[illegible]శల
శంబులతోడి యరిదిసూరెపుటంపుఁదేజున నమరినజీవదంతపుంబలకలవింతైన [illegible]
పడకింట విడిసి వివిధసామంతమహీకాంతులను, యదువృష్ణిభోజాంధక[illegible]ను
బంధుజనంబులను, దదుద్యానబహిరావరణప్రదేశంబులఁ జతురంగబలంబు మొత్తంబుగా
దగుపట్టుల విడియుం బంచి విదర్భరాజసమర్పితవివిధోపచారంబులం [illegible]గింపుచు [illegible]
మితవిభవంబున నున్నయవసరంబున. ౨.

సీ. విరహిజనస్వాంత ♦ విదళనకుంతంబు, తరులతాకల్పిత ♦ తల్పలతాంతి
మంగనానూత్నవి ♦ హారనిశాంతంబు, శిశిరస్తురాత్రిసం ♦ స్థితినితాంతి
మభినవకిసలయ ♦ వ్యాకీర్ణదంతంబు, సుమగంధసురభిళ ♦ తనుగిగింతి
మనుగళన్మధురస ♦ వ్యాప్తతానంతంబు, భావజానుగలక్ష్య ♦ పథకకాంతి
మఖిలజనహృద్యసంతతో ♦ ద్యానసీమ, దేవతాస్వర్గకగ్గాంత్య ♦ భావకాంతి
బహుళసుమనఃపరాగసం ♦ పాద్యమాన, సంతతవసంతమగు దాన ♦ సం[illegible]రె.

మ. విదితంబయ్యె దివాకరుండు పుణుద ♦ గ్విద్ధిగతుండౌటను
యాదుమార్గన్యకృతాధివాసపరిల ♦ భ్యాయల్లకప్రజ్వల
ద్విదురార్తిందుహిమాంబుపూరమయభూ ♦ భృన్నైకసానుస్థ
సదనాక్రాంతనితాంతసంగతులఁదీ ♦ ర్చంగోరుసెందంబునన్.

మ. వెనుఁజోచ్చైశకులవ్యధన్ స్వయతఁజూ ♦ పెన్నిగ్గిమిత్తంబుకా
ననవహ్నిన్ గ్రసియించెనీతఁడనిత ♦ న్మత్తాన్యభుమ్ముంగిపఁగ్న
ష్ణునిమీఁదన్ ధ్వజమెత్తివేఁచుమరుఁడం ♦ చుం జేంచుంక[illegible]
దనరెం గానియెడంగనంబడు నెమి ♦ నంబుప్తాత్తిస్త్రైమున్.

మ. రమణాలింగనగాఢతాసుఖభర ♦ ప్రహ్యాహంభూమాపేక్ష
ప్రమదాపాదనిజాధరార్పణకృతి ♦ ప్రౌఢంబు [illegible].

తముదోషంబునకేమియొందుగుణమె ♦ న్నంజెల్లునందున్ సుదృ
క్సముదాయంబుతదేకసేయతగనం ♦ గాహెచ్చెఁబైకధ్వనుల్. ౬.

ఉ. మాఁకెనఁబోల్పఁగాఁదగని ♦ మస్తుమెఱుంగునశీతునందుపీ
లైకనుపట్టుమమ్ముభళి ♦ రాసవరించెనుమస్తుమాటిన
ట్లీకడనీమధూపకృతి ♦ నేమననౌనని వానిపల్లవ
శ్రీకలనంబుగాంచెనన ♦ స్త్రీలరదాంశుకముల్ రహింగనెన్ ౭.

మ. మెలఁతల్ దోహదదోహనప్రవణతన్ ♦ మేపుంచిపుష్పావళీ
విలసద్గుచ్ఛమహోఘమున్ నివిరితి ♦ విన్ బంభరీవత్సపు
ష్కలతృప్తిన్ ఘటియించితత్సురభిభా ♦ స్వత్సాక్షికాక్షీరధా
రలాగింబల్లవపాత్రినించిమదనా ♦ ర్చల్ సేసిరన్వేళలన్. ౮.

సీ. మంజుగుచ్ఛమృగాంక ♦ మండలాంకంబులు, ఘనమహీరుహభద్ర ♦ భవ్యరుచులు
కుంజకుంజరగండ ♦ కుంభితమదధార, లసమాస్త్రిఖడ్గము ♦ గ్రీవసరణములు
మృదులతాభామినీ ♦ మృగనాభితిలకమ్ము, లుద్యానమాశ్రవ ♦ ణోత్పలములు
యమదిగాశుగహస్తి ♦ హస్తశృంఖలములు, బహుళకేసరతృణ ♦ గ్రహణమణులు
సతతముస్తాప్తిసాదర ♦ స్తబ్ధరోమ, పవిసమరదారసంతత ♦ బాఘభిద్య
మానభూవివరోద్ధకుం ♦ భీనసేంద్ర, గరళఘామ్యలుమధుపరే ♦ ఖలుచెలంగె. ౯.

మ. ఘనశీతర్తుమహాంధకారములడం ♦ గన్ మల్లికాసూనశో
భనక్షత్రపరంపరల్ నిగుడఁద ♦ ద్భవ్యప్రభాచంద్రిక
ల్దనరన్ మాధవుఁడన్ విధుండువిలసి ♦ ల్లంగాకయమ్మానినీ
జనతాస్వాంతశిఖాకలాపములనా ♦ ర్చంగూడునేయేరికిన్. ౧౦.

తే. స్థాణువునకైనఁబల్లవ ♦ శక్తిగలుగ, వెలసినవసంతమొక్కటి ♦ కలుగుఁగాక
మానకుపితనితంబినీ ♦ మానసాశ్మ, వితతికరఁగునెయెటువంటి ♦ వేళనైన. ౧౧.

సీ. మాధవసంవ్యాన ♦ మాంజిష్ఠవసనంబు, వనరమాకృతపట ♦ వాసకంబు
ఘనకుంజకుంజర ♦ కాంచనవర్ణంబు, క్ష్మాజవీరాతామ్ర ♦ కంచుకంబు
విరహిహృదుద్గత ♦ స్మరకృశానుభరంబు, లతికాహిఫణమణి ♦ వితతదీప్తి
కుంభీనధృతశోణ ♦ కూలరజోరాజి, హైమనకితవని ♦ శాంతసంధ్య
విపులవనరాశిసముదిత ♦ విద్రుమప్ర, రోహసంజాతనిర్నిద్ర ♦ రుక్ప్రకాండ
మంగజతురంగవల్గనో ♦ ద్ధతరజంబు, విస్ఫుమంబయ్యెవనవీథిఁ ♦ గుసుమరజము.

మ. స్మరధర్మదేవతఁ దెల్పెఁజందనన గాం ♦ చద్గంధవాహాంబుపు
ష్కరఖేలన్మధుపాలిశృంఖలపరా ♦ గస్వర్ణవర్ణాస్తృతి
స్ఫురదుత్ఫుల్లసుమాళిపద్మకమధు ♦ స్ఫూర్జన్మదాసారపై
కరవాభీలపురోధయాయుకతిశా ♦ కధ్వానఘీంకారితన్. ౧౩.

సీ. ఘనకుంజమృగనాభి ♦ గతరక్తధారలు, స్మరశిలీముఖముఖ ♦ జ్వాలనశిఖలు
పికతప్తశిఖతిఘాల ♦ సార్ద్రసిందూరమ్ము, లారామకమలాంఘ్రి ♦ యావకములు
పికజాతవాయస ♦ ప్రకటకోపరసమ్ము, లవనిజమానిజ ♦ టాళిరుచులు
మధువర్షపరిదృశ్య ♦ మానేంద్రగోపమ్ము, లారణ్యకాసార ♦ హల్లకములు
సాంద్రవనరాశిభాస్వరా ♦ స్థానపేశి, పన్నివిష్టసుమాకర ♦ సన్నిధాన
ఘటితనీరాజనప్రభా ♦ చ్చటలనంగ, నుల్లసిల్లెవనమ్ములఁ ♦ బల్లవములు. ౧౪.

శా. త్మారుణ్మండలశాంబరీపృథుతర ♦ స్తంభంబునన్ మాధవుం
డారూఢిన్ జనియించిశీతబుతుమాం ♦ సాశిన్ వడిన్ ద్రచ్చుచో
నారక్తద్యుతిపూరతన్నఖశిఖా ♦ వ్యామోహకృద్దీప్తిచె
న్నారంగింశుకకోరకమ్ములుసము ♦ ద్యల్లీలలన్ రంజిలెన్. ౧౫.

శా. పున్నాగంబులుపూచెనుంపఁదగదన్ ♦ బుద్ధిన్ వసంతుండవే
తన్నాళీకశరాసనప్రభునకుం ♦ దానమ్ముచో నాతఁడా
పున్నాగంబులెపూనిపాంథవిజయ ♦ స్ఫూర్తిన్ విజృంభించె నె
ట్లన్నన్ గెల్పులభించు వేళలనకృ ♦ త్యంబైన మేలియ్యదే. ౧౬.

సీ. కేళీసరోవరా ♦ లోలకల్లోలసం, రావంబుమర్దళా ♦ రవముగాఁగ
మకరందరసపాన ♦ మాద్యన్మిళిందఝం, కారంబుతగునుపాం ♦ గంబుగాఁగ
శుకకోకిలకలాప ♦ సుకుచిరాలాపంబు, జతగూర్చువందిసం ♦ స్తుతులుగాఁగ
రమణీయవిస్మమర ♦ సుమనఃపరాగంబు, కెంబట్టుజవనిక ♦ డంబుగాఁగఁ
జలితకిసలాభినయహస్త ♦ చలనమమర, మధునిముందటవనరంగ ♦ మధ్యమందుఁ
దనరుకరువలిసూత్రధా ♦ రునివిలాస, లలితగతులలతాపాత్ర ♦ ములునటించె. ౧౭.

క. విరహిజనమానహారిణో, త్కరములనుఋమాడిబలుమ ♦ గంటిమిమిగులన్
మెఱయువలరాచబెబ్బులి, కరరుహములుతనరుఁగింశు ♦ కమ్ములమొగ్గల్. ౧౮.

క. అలరువిలుకాఁడుపాంథుల, గెలువన్ గమికింపనతని ♦ కన్ మధుఁడుప్రియం
బలరనొసంగినతరకస, ములవలెనుగుసుమనికుంజ ♦ ములుగననయ్యెన్. ౧౯.

మ. అతినీరంధ్రనికుంజబింబఫలవీ ♦ క్షాసక్తకీరంబుత
ల్లతికానంవళితత్రికంబగుమని ♦ ల్వాఁ జెక్కులంజక్కఁగు
చ్ఛితతుల్ గన్పడునైకపాంథసిజయా ♦ సక్తస్మరాగ్రస్థలా
నతవాలాత్తఖలీనసూత్రహయతూ ♦ ణద్వంద్వముం బోలుచున్. ౨౦.

సీ. మానరోగంబులు ♦ మానులొల్లమిఁ జెందె, మహనీయజాతిసం ♦ పదను మదను
వేలాపరిష్కృతుల్ ♦ విరహులొల్లమిఁ జెందె, నతులితోద్యానదే ♦ వతలలతల
శ్వేతతాశిశిరముల్ ♦ శీతాంతమునఁ జెందెఁ, బ్రణయకోపార్తుల ♦ తనులవనుల
భూతిధర్మముల ♦ జాతమొల్లమిఁ జెందె, ఘంద్రపుష్పితనమే ♦ రువులనవుల
మంజుతరకుంజసుమపుంజ ♦ మసృణఘుసృణ, రససదృశకౌసుమపరాగ ♦ రాగజనిత
మోహసవ్నాహజంతుస ♦ మూహమృదుల, మలయమరుదంకురమ్ములు ♦ కలయవిసరె.

సీ. తొలుదొల్తఁ బొదరిండ్లఁ ♦ దూఱిక్రొన్ననలపై, బ్రాలిమధువులేమి ♦ వనటచెంది
కోరకతతులపైఁ ♦ జేరియాసక్తిచే, నవిపిల్చియాపోవ ♦ కవలికేగి
కుసుమమొక్కటియబ్బ ♦ నెవమూఁగిమధుపాన, నక్కొండుటను జేసి ♦ వెక్కుఫుట్ట
నించుకించుకత్రావి ♦ చంచువుపదనొంద, నాతృప్తిఁ గోలఁబో ♦ నందులేమి
నచటుఁ బాసియావనమెల్ల ♦ నరయఁ గోరి, వెతనుదిరుగాడు ననిలాభి ♦ హతినిసోలుఁ
జైత్రికాదిక్షుధాక్రాంత ♦ చంచరీక, విసరమవ్వేళవనమెల్ల ♦ ముసరుకొనియె. ౨౨.

క. శరవర్షధారలుడుగక, పఱపెడునసమశరకుసుమ ♦ బాణాసనవి
స్ఫురితగుణారావమ్ములు, తఱుచయ్యెన్ మత్తమధుప ♦ తతి నినదమ్ముల్. ౨౩.

సీ. శిశిరర్తువిరహదు ♦ ర్దశదీఱసహకార, సీధుసుధాప్లుతి ♦ చెందఁ దేఱి
స్థలపద్మకరపద ♦ చలనాప్తినిజెలంగి, కొదమతుమ్మెదచూడ్కి ♦ బెదరిమాచి
గుచ్ఛస్తనస్రంసి ♦ కుసుమరజోరాజి, సంవ్యానవసనంబు ♦ చక్కఁజేర్చి
చందనభూమిజ ♦ శాఖాళికరమూఁది, గంధవాహవిలాస ♦ గతులతేచి
వనరమాశైలదుహితృ ♦ కృపాకటాక్ష, పునరుదంచితహృదయేశ ♦ భువనవిజయ
సాధనసమగ్రకిసలహ ♦ స్తములఁదనర, వల్లరీకేళినీకాంత ♦ యుల్లసిల్లె. ౨౪.

మ. చెలియొక్కర్తుముఖాబ్జవాసనకునై ♦ చిట్టాడుభృంగావళుల్
తొలఁగన్ మోమునులంచుడుందిలకముం ♦ దూరంబునం బోవన
య్యళులాత్తీయమ్మతిందదీక్షణగతిం ♦ బ్రాపించెఁ జూనుల్లస
త్తిలకశ్రీలనగన్ గతానుగతముల్ ♦ తిర్యక్కృతుల్ నామహిన్. ౨౫.

చ. తరుణియొకస్తుతిపాఠము సఁ ◆ దన్నినఁ గ్రొన్ననగుంపునన్ జిగిన్
మెఱసె నశోకభూజము వి ◆ మిశ్రితతత్పదయావకద్రవ
స్ఫురణ నెచూపఁ దోఁడివిరి ◆ బోణులకుంబువులంచుఁ దెల్పని
ర్భరగతిఁ బ్రాలు నమ్మధుక ◆ రమ్ములు గువ్వ కరిన్నటించుచున్. ౨౬.

మ. అనయంబున్ ద్విజకోటితోడిసహవా ◆ సాసక్తి వర్ధిల్లుచున్
వనవాసంబొనరించుచుండు మముని ◆ వ్యామాత్రులుచ్ఛిష్టశీ
సురసంసిక్తులఁ గానొనర్చిరనుచున్ ◆ దూషించి యత్రుప్రజం
బునిరూఢంబుగఁ దాల్చి మాడ్కి వకుళం ◆ బుల్ నించెఁ బూఁదేనియల్. ౨౭.

ఉ. ఆతతినొక్కయంగనయు ◆ పాంగము లేక యగీలిఁ బోడఁద
చ్చాతురి రోమహర్షణము ◆ సంధిలునట్లసకుట్మలస్థితిం
బ్రీతిఁ బ్రియాళుభూజముల ◆ రించె సుమాసవమత్తభృంగసం
గీతము పాంగభంగిఁ జెలఁ ◆ గించుచుఁ దన్మృదుగానసంపదన్. ౨౮.

శా. శ్రీమంతుండఁట యేమి దెల్పనగు ముష్ ◆ కృష్ణుండు గోపాంగనా
స్తోమాచ్ఛాదనపశ్యతోహరత ని ◆ చ్చో వెల్లికొల్లాడెఁ గా
మామానంబనినట్లనవ్వ చెలిఁ ద్రే ◆ మంగాంచి సాకూతతం
బామున్నవ్వి నయట్లనివ్వటిలెఁ బో ◆ న్నల్ క్రొన్ననల్ నించుచున్. ౨౯.

ఉ. బాలకరాప్తిఁ దత్పదృశ ◆ పల్లవమిచ్చె రసాలసాలము
ద్వేలపదాప్తిఁ దన్నిభన ◆ వీనసుమంబుల సంఘటించెఁ గం
కేళి హసాప్తి నేనుగలి ◆ గింపఁగఁ జెల్ల దతత్సుమంబులో
పూలనఁ బల్లవాప్తి సుర ◆ పొన్నలు క్రొన్ననలిచ్చెనచ్ఛతన్. ౩౦.

మ. అలిపుష్పస్థితి మానిచెందు నె ప్రవా ◆ ళావాప్తి నెందేనియన్
చెలి మాటన్ సతి మోము ద్రిప్పినగన ◆ చ్చెంతన్న మేరుద్రుమం
బలరెన్ మంకెనయంచు బ్రాలుననియే ◆ లాపల్కఁ గానొల్లదీ
కలికం చుంబికసూక్తి నాడెదు లతా ◆ కాంతాళితో నవ్వి నాన్. ౩౧.

మ. ఇతరస్త్రీనిహితాధరక్షతము ప్రా ◆ ణేశుండు వీటీరస
స్థితి చేమాటుటచుంబనంబున ప్రకా ◆ శింపంగ బిట్టల్కతో
నతిపోహమ్మని నంతఁ జెంగట నపు ◆ ష్పంబయ్యె గోఁగేయయుపూ
యతివల్ వేళ యిదంచు మాధునకువా ◆ లమ్ముల్ మగుండిచ్చె నాన్. ౩౨.

మ. స్వరవాణీకలవాక్ప్రపంచములతో ♦ వైరంబుగావించుతి
త్వరపుష్టాళికి కోకిలికిన్ వెఱచిమేఁ ♦ తల్ చూతముల్ డాఁపన
త్తతినమ్మానినినమ్మికిచ్చుగతిహ ♦ స్తంబుంచఁదోడ్తోనెని
ర్భరలీలన్ గిసలప్రసూనఫలసం ♦ పత్ప్రాప్తి హెచ్చెంగడున్. 33.

మ. వనజాక్షీముఖనవ్యపూర్ణశశిబిం ♦ బస్ఫారరాగంబుదోఁ
చినవేళన్ స్మరదేవసన్నిధినుద ♦ ర్చిర్భూరిదీపవ్రజం
బునిరూఢస్థితిఁ గాంచఁ జూచిజనముల్ ♦ పూఁబోండ్లవక్త్రద్యుతిన్
గనకక్ష్మాజముపూయనంద్రుతఃపసే ♦ కల్పింపనీసంగతుల్. 3౪.

సీ. శశికదశీరజో ♦ విశదాభ్రవిభ్రమా, యాతకైరవగుచ్ఛ ♦ హంసకులము
మకరందరసవర్ష ♦ మాద్యదిందీవర, ప్రాగ్భారచాతకా ♦ ర్భకచయంబు
స్ఫాటికవేదికా ♦ ఛాయామరీచికా, సంవిన్నపాంథహృ ♦ చ్చంబరంబు
జలసూత్రసలిలశే ♦ శతుపారశీర్ణపి, కాదష్టకిసలయో ♦ పాధరంబు
మలయపవమానహిమమరు ♦ ల్లలితకలిత, దీధితిజపాకుసుమహాసం ♦ తీచయంబుఁ
గనుచు నామనికృష్ణసే ♦ వార్థమడిగి, యఖిలఋతుసంపదవహించి ♦ నట్లయుండె.

మ. స్మరయోగీశ్వరుఁడధ్వనీనజనతా ♦ సంహారవాంఛన్ వనా
ధ్వరరాడంచదశోకగుచ్ఛనివహో ♦ ద్యద్వహ్నికుండంబునన్
బరపుష్టారవమంత్రఘోషముదలి ♦ ర్పన్ వేల్మిగావింపభీ
కరమై పుట్టినకృత్యనా నెగసెభృం ♦ గశ్రేణినీలచ్ఛవిన్. 3౬.

సీ. తియ్యదేనియఁ గ్రోల ♦ ద్విపణీకృతంబైన, మధురతనధరబిం ♦ బములుదనర
హురుమంజిసరులతో ♦ నోఱపుగాఁ బెనఁగొని, కదియుమల్లెసరాలఁ ♦ గంఠమలర
వివిధప్రసూనత ♦ ల్పవిహారములఁదనూ, కమలవాసనకదం ♦ బమయివిలుఁబఁ
జెరివినవిరులకై ♦ చిట్టాడుమగతేఁటి, చాయలనిడువాలు ♦ జడలుమెఱయ
వలిపెచెంగావిపావడ ♦ కలసిమెఱయఁ, గోమరుచిపురాకుటంగద ♦ ట్టములువర్వ
చిఱుదొడలమిన్న లెంతేని ♦ చికిలిసేయఁ, దెరవలెనసిరివిరులయో ♦ వరులవరుల.

వ. ఇత్తెఱంగున సకలవిరహిణీజనజైత్రం బగుచైత్రంబు విజృంభించునవసరంబున విదర్భ
రాజనగరసవిధోద్యానసీమ విడిసియున్న యన్నలినయనుండు నిజాంతరంగవిజ్ఞాన
కళాభిరాముండగు కింకిణిధాముం దనునుంగుంజెలికానికై దండంబూని యవ్వనిం
గలసౌభాగ్యవిశేషంబునుం జూచుచెపంబున ఋక్షిణీచపలలోచనవలన నుపగతం బగు

మరులు కొలఁక నవనయించుటకు వెడలె నట్టియెడ నల ప్రియవయస్యుండు నొక్కెడఁ దదుద్యానసౌభాగ్యంబు చూపి గోపాలదేవున కిట్లనియె. ౩౮.

సీ. కమలదళాక్ష చూడుమిటఁ ♦ బ్రమ్మెడుఁదు మ్మెదపిండు మెండుగా
సుమరజమంగసంఘములఁ ♦ జొప్పడ నొప్పెసు నధ్వనీనబృం
దములజయింపఁ బంపు నెడ ♦ దర్పకుఁ డాత్మబలంబు వెంటనీ
భ్రమరకులంబుఁ బిల్చి పట ♦ హాన మొనర్పఁ గఁ బంచెనో యనన్. ౩౯.

గీ. బహుళకింశుకచంచలా ♦ భాసివిపిన, ముదిరసందోహ సర్వతో ♦ ముక్తనినిహ
మధురసాసారమనఁదోఁచు ♦ పృథులకరక, సంఘమునవనిప్పపూలొప్పె ♦ వరసిజాక్ష.

క. సురసాలము హరువుననీ, సురసాలము దనరెనిచటఁ ♦ జూడుము కిసల
స్ఫురదురుసుచినిచయంబులఁ, కురువిందాభరణదీప్తి ♦ కొమరువహింపన్. ౪౦.

చ. మలకలు గాఁగ లేఁజిగురు ♦ మావిజిగిన్ దొగరెక్కఁ దేటిచాల్
నిలిచినయందమిచ్చటభ ♦ లీయన నయ్యెడుఁ జూడవయ్య యో
నళినదళాక్ష పాంథులది ♦ నంబునఁ గుత్తుక గోయ నెత్తుటన్
దళమయి తోఁచుచున్న రతి ♦ నాథుని మేల్ కిరుసుంబలెం డగన్. ౪౨.

ఉ. నీరజనాభ కంటివె వ ♦ నీరమ పుష్పిణియౌటఁ గాంచి గొం
తేరహిఁ నీయనంగువన ♦ దేవతలీ సుమపుంజ శేళికా
గారమునందుఁ గూడుకొని ♦ గంధఫలీచయదీపభృంగరుం
కారసుగీతికల్ మొఱయఁ ♦ గావిసులన్ దళిమంబమర్చుటల్. ౪౩.

సీ. తలఁబ్రాలువ్రాయుచో ♦ నిలమీఁదఁ జెదరిన, ముత్యాలనమధూక ♦ ములు వెలుంగఁ
గవగూడియంగనల్ ♦ ధవళంబులనునట్లు, చంచరికాంగనా ♦ స్వనము నిగుడ
మునుమున్న నిగిడెడు ♦ మునులయాశీర్వాద, ఘోషంబులనద్విజ ♦ కులము సెలంగఁ
గలయ నెల్లెడమించు ♦ కాహళారవమునాఁ, గలకంఠనాదముల్ ♦ గ్రమ్ముకొనఁగ
పికచకింశుకకుసుమన ♦ వీనకాంతి, సంతతివసంతమై పర్వఁ ♦ జైత్రవిభుఁడు
వనరమ వరింపనాయితి ♦ పఱచినట్టి, పరిణయాగారమీవనీ ♦ భాగమధిప. ౪౪.

వ. అని యనేకవిధమ్ములఁ బ్రియవయస్యుండు విన్నవించునవసరంబున. ౪౫.

సీ. సఖుఁడు పల్లవజాల ♦ సౌభాగ్యమును తింపఁ, దరుణిపాదాబ్జముల్ ♦ దలఁచి దలఁచి
చెలికప్రపులనంటి ♦ చెలువును బొగడంగ, నెలవాగనును దొడల్ ♦ దలఁచి దలఁచి
నరసవయస్యుండు ♦ చంపకంబును తింప, జలజాస్యనాసికఁ ♦ దలఁచి దలఁచి
మిత్రుండురహిమించు ♦ మెట్టతామర నెంచ, నలివేణి నెమ్మోముఁ ♦ దలఁచి దలఁచి

సంగడీఁడు సమంచిత ♦ చంచరీక, తతి నిగొని యాడ సతి వేణిఁ ♦ దలఁచి తలఁచి
మఱిమఱియు వేడ్కఁ గాంచు మన ♦ స్సాధవునకు, నింతిపై మోహమంతంత ♦ కెక్కుడయ్యె.

క. లలనన్ బాళిను పవన, స్థలి నానాగతుల నిట్లు ♦ దలఁచుచు యదురా
ట్కులనాథుఁడు కోకిలకా, హళి నాదము సైఁపరామి ♦ నడలున్ మిగులన్. ౪౭.

చ. అడలుచు నీగతిన్ బ్రియవ ♦ యస్యునిగన్గొని యయ్యదూద్వహుం
డుడుగక పైపయింగనియె ♦ నుగ్రసుమాశుగతీక్ష్ణబాణపుం
జడికిఁక నోర్వలేననుచుఁ ♦ జాలనలంగి కలంకఁ జెందెడుం
దిడుమదియేమి సేయుదువి ♦ నీతసఖా చెలిఁ జూచు టెన్నఁడో. ౪౮.

క. నీ పలికినపలుకు లెయ్యి, ద్దీపకముల్ మాకుఁ గన్నె ♦ తిన్న నిరూపున్
జూపట్టఁ జేసెనితర, వ్యాపారము దెలియదేమి ♦ రా ప్రియమిత్రా. ౪౯.

సీ. స్మరమృగేంద్రకిశోర ♦ చాపమార్వ్వఘోర, నినదార్భటికిఁ దాల్చి ♦ నిలుపరాదు
మకరందరసపాన ♦ మాద్యన్మిళిందౌఘ, ఝంకృతుల్ వెంపైన ♦ సైఁపరాదు
విరహిహృద్భేదనో ♦ ద్వేలకోకిలకల, ధ్వనుల నాలింపంగఁ ♦ దరము గాదు
వివిధకాంక్షాభంగ ♦ విరహసముత్తుంగ, జలరాశిఁ దరియింపఁ ♦ దరము గాదు
కాముకతటాకతటసము ♦ త్కటరథాంగ, జాలశృంగారలీలకుఁ ♦ దాళరాదు
మదవతిఁ దలంచి కంటికి ♦ నిదురరాదు, కింకిణీదామ యీ కాన ♦ నాంకసీమ. ౫౦.

సీ. విరిసురటీలచేఁ ♦ దొఱఁగు నేయీ కాఁక, పువుఁబోడి యూర్పుగా ♦ డ్పులను గాక
తలిరాకుగుత్తుల ♦ దఱుఁగు నేయీ కాఁక, సనబోణి కేలుసోఁ ♦ కినను గాక
పన్నీటి వఱదలం ♦ బాయు నేయీ కాఁక, నెలఁత మైచెమ్మట ♦ నీటఁ గాక
అన్యకథాసక్తి ♦ నడఁగు నేయీ కాఁక, వెలఁది వృత్తాంతంబు ♦ వినుటఁ గాక
పరిపరి వితానఁ బూఁదేనె ♦ నెరయ మేన, నించినంత నెచను నెయీ ♦ నిండు కాఁక
నీరజాతాక్షి పలుకు తే ♦ నియలఁ గాక, యేల చెలికాఁడ నీవు న ♦ న్నిట్లు వేఁడ. ౫౧.

వ. అని యిత్తెఱంగున నయ్యదుకులోత్తముండు బిత్తతిమీఁద నత్తమిల్లిన యుల్లమున వననిహారమ్ము క్రొత్తసేయుటయుఁ జిత్తజుని చేతి చివురాకు కత్తికోఁతలకు నుత్తలపడుచు నత్తఱి నచట నిలువనోపక మెత్తంబడిన తాలిమిం జిత్తభిత్తి నత్తలోదరి హావభావంబులు చిత్రించిన తెఱంగున హత్తుట యుత్తలపడుటం జూచి కింకిణీదాముం డతని కిట్లనియె. ౫౨.

క. మేరా యిది మీవంటిమ, హారాజున కెందు నవ్వ ♦ రా సరి నృపతుల్
ధీరోదాత్తుఁడవిటులీ, యారాటము నీకు నాయ ♦ మావనమాలీ. ౫౩.

క. మరునిబలమెల్లనీవగు, కరచాతురిఁ వ్రాసివేఁడఁ ♦ గాఁదగుదానన్
మరుఁడుప్రసన్నుండగున, వ్వరుస నెఫలియించునీదు ♦ వాంఛితమెల్లన్. ౫౪.

చ. అనిమృగనాభికర్దమము ♦ నబ్జదళంబును దెచ్చికూర్మితో
ననుఁగువయస్యఁడియ్యనవు ♦ డయ్యదువంశపయోధిచంద్రుఁడిం
పెనయఁబరిగ్రహించియొటు ♦ లేనియునూఱటయైనమేలటం
చనుపమచాతురీభరితుఁ ♦ డైలిఖియింపఁదొడంగెనత్తఱిన్. ౫౫.

చ. అళులనుజందమామనసి ♦ తాబ్జశరమ్ముల గెల్పుచిందమున్
సలలితచక్రవాకముల ♦ జైత్రకృపాణియుపీరమాల్యమున్
జలరుహలోచనుండువరు ♦ సన్ లిఖియించుచువచ్చియంతలో
నలమెడుమోహమగ్నతదృ ♦ గబ్జములించుకమూసిక్రమ్మఱన్. ౫౬.

క. తెలిసికనుదెఱచిమఱియుం, బులినమ్ములనఁటులుతూర్య ♦ ములుపద్మములన్
విలసితశృంగారకళా, కలితమ్ములుగాఁగవ్రాసి ♦ కంసారితగన్. ౫౭.

సీ. అళికలాపముఁవ్రాయ ♦ నలకలైకనుపట్టె, వనజారివ్రాయంగ ♦ వక్త్రమయ్యె
నల్లగల్వలువ్రాయ ♦ నయనయుగ్మంబయ్యెఁ, గంబువులిఖియింపఁ ♦ గంఠమయ్యెఁ
జంపకంబునువ్రాయ ♦ సతినాసగాఁదోఁచె, నసివ్రాయఁజికిలిరో ♦ మాళియయ్యె
నలరుదండలువ్రాయ ♦ హస్తయుగ్మంబయ్యె, మఱచివ్రాయనిచోటు ♦ మధ్యమయ్యె
సైకతంబులువ్రాయ ♦ జఘనభాగంబయ్యె, నెగినసంటులువ్రాయ ♦ నూరులయ్యె
బిరుదుకాహళములువ్రాయఁ ♦ బిక్కలయ్యెఁ, దమ్ములనువ్రాయఁబాదప ♦ద్మములయ్యె
నేమివ్రాయంగఁదలఁచినే ♦ నేమివ్రాసి, తనుచునివ్వెఱఁగందెను ♦ యదువిభుండు.

గీ. ఇట్టులద్భుతమతినున్న ♦ కృష్ణుఁగాంచి, కింకిణీదాముఁడిట్లనుఁ ♦ బంకజాక్ష
నేనుదెలిపినదొకటియు ♦ నీవువ్రాసి, నదియొకటియయ్యెనదిగదా ♦ యద్భుతంబు.

క. మనుజుఁడుదనమదిఁదలఁచిన, యనువున నేసేయుఁగార్య ♦ మనుబుధవాక్యం
బనఘాతప్పె నెనీమది, వనజేక్షణయుండదాని ♦ వ్రాసితి వెలమిన్. ౬౦.

చ. అనుటయునయ్యదూద్వహుఁడు ♦ నత్తఱిభోజనృపాత్మజాతయుం
గనుపడినట్టులైనసుమ ♦ కార్ముకకార్ముకఘోరశింజనీ
నినదముకర్ణరంధ్రముల ♦ నెక్కొనితాల్మిచలింపసేయ నె
మ్మనమునవొందుదోఁపకల ♦ మానినిఁగన్గొనిదైన్యమేర్పడన్. ౬౧.

చ. అలిగెదవేటికేసరసి ♦ జాయతలోచనపల్కవేటికె
ఛిలుకలకొల్కియేలవయ ♦ సేయవుతెల్పఁగదేలతాంగి మొ

క్కాలమున నాపయింగనలఁ ♦ గాఁదగు నేనగు మోముఁజూపు మో
జలరుహగంధిలాఁ తినకె ♦ చంద్రదముఖీ చల మేలభామినీ. ౬౨.

ఉ. భూసురుఁ డేగుదెంచివిరి ♦ భోజికినీ పయికూర్మియగ్గలం
బైసమకూరునోయగుకు ♦ లాగ్రణినీవిఁకఁజాగు సేసినం
గాసిలుఁజూనన్నానిజము ♦ గాఁదలపోసితిఁగానియావితం
బోసరసీరుహాక్షియిటు ♦ బొల్లమి సేయుఁటెఱుంగనింతయుఁన్. ౬౩.

సీ. కమలాక్షి నీకటా ♦ క్షములుగల్గినగాని, చంచరీకములజ ♦ యించఁజాల
నలివేణి నీపల్కు ♦ లాలకించినఁగాని, రాచిల్కబహుసారు ♦ సైఁచఁజాల
ముగుదనీ నెమ్మోము ♦ ముద్దుగొన్నను గాని, హరిణాంకుగురువంబు ♦ నణఁపఁజాల
రాజీవనయననీ ♦ రాకఁ గాంచినఁగాని, యంచలపోగరుమా ♦ యించఁజాల
వెలఁది నీ మేననేకీభ ♦ వించికాని, యించువిలుకానిమాయజ ♦ యించఁజాల
నేలరారాపు సేసెద ♦ వేలతాంగి, యలఁతనిఁకఁదాళనీయాన ♦ హంసయాన. ౬౪.

ఉ. నీనిడువాలుకన్దళుకు ♦ నీదగు వెన్నడకుల్కు నీజగా
తేనియలొల్కుపల్కు కడు ♦ తేఁటగునీ నును మోవిరంగునీ
కౌను మెఱుంగు నీతొడల ♦ క్రొఁపునునీసొగసైనరూపునో
మానినినూని నిల్వఁదిఁక ♦ మానసమానను మీనుకూస్తుగ్రపైన్. ౬౫.

క. అని పెక్కగతులదీనత, గనుపడఁ బ్రార్థించుచుదుశి ♦ ఖామణిమీఁదన్
మనసిజుఁడు మెఱుఁగుచాయల, నన బాణాకత్తికరుసు ♦ నన్ బరపించెన్. ౬౬.

శా. ఫుల్లేందీవరపత్రనేత్రఁకచాం ♦ భోజన్ఫురద్వక్త్రియై
యల్లీలావతియాత్మనెక్కొనఁగఁద ♦ ధ్యానాత్తతంబగ్నినా
మల్లధ్వంసివిలోచనద్వయము నా ♦ త్మస్వైరిపూర్ణోదయో
ద్యల్లీలన్ వహియించనోడెననన ♦ ధృష్టైరతిన్ జొప్పడెన్. ౬౭.

సీ. దండశూకాధీశ ♦ తల్పుఁడౌ కృష్ణుని, మందానిలములకుఁ ♦ గ్రిందుపఱిచె
రామత్రయావతా ♦ రముఁగన్న వెన్నుని, నుదుటుకోయిలధాటి ♦ కొదుఁగఁజేసెఁ
గనకాంబరచ్ఛన్న ♦ గాత్రుఁడౌ శౌరినీ, కొదమతుమ్మెదలకు ♦ బెదరఁజేసె
సింహికాసుతశిర ♦ శ్ఛేదియౌ యదువర్యు, జాబిల్లికాఁకకు ♦ జడియఁజేసెఁ
గుంభినీభర్తయైనట్టి ♦ గోపవిభుని, దనదురసదాడివింటికిఁ ♦ దరలఁజేసె
ననినముల్లోకములనింక ♦ నరసిచూడ, మదను నిభుజాబలమ్మున ♦ కెదురుగలదె. ౬౮.

సీ. కలశాబ్ధి నేప్రొద్దు ♦ నెలకొంటనంటిన, తద్దీప్తినామేన ♦ ధవళిమలర
దావానలాస్వాద ♦ నాజన్యధూమాంకు, రములనాఁబలకాంకు ♦ రమునెలంగ
జఠరస్థితానేక ♦ జలధులొకొక్కమాఁడిఁ, జెమ్మగించినరీతి ♦ స్వేదముబుక
సహితమందరకుభృ ♦ ద్వహనజాతశ్రాంతి, కరణినిట్టూరుపు ♦ గాడ్పులెసఁగ
నీదృశాసక్తిగోపిక ♦ లెచటవిందు, రోయనెడుభీతిఁబలెఁగంప ♦ మొదవ్వమేన
బంధమోచనదక్షుండు ♦ పంకజాక్షుఁ, డమృతకరముఖిప్రేమబం ♦ ధమునఁదగిలె.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండు మందానిలస్యందమానోద్దండశ్వాతరమానసుం డగుచు విరహాదవదహనతాపంబున వివిధప్రకారంబుల వేఁగుచుండె నంత నక్కడ నమ్మహీసురుండును యదుసార్వభౌమునివలన సంభావనాపూర్వకంబుగా నంపించుకొని యతిత్వరితగమనంబున విదర్భదేశాభిముఖుం డగుచుఁ గతిపయప్రయాణమ్ములఁ గుండినసగరమ్ముఁ జేరె. అంతకమున్న యన్నారీరత్నంబు వృష్ణికులరత్నం బగుకృష్ణునకు నిజమనోరథంబు నెఱుకపఱిచి ప్రయత్నంబునఁ దేటపన్నీట మజ్జనం బొడనట్టులు నాదగించి నట్టులునుం భావించి యబ్జరేఖయుఁ జకోరాక్షియు నబ్జవదనయు లలితయు రసమంజరియు నను నమ్ముఁగుఁజెలులు గొలువ నిరుపమానయామవతీరమణకిరణగణగళితసమృతశీతలకరశిలాతలరచితవిమలవేదికాతలంబున నధివసించి యాత్మగతంబున. ౨౦.

సీ. జననిచేనంపించు ♦ కొనిచన్నవిప్రుండు, కడుదూరదేశముల్ ♦ గడచుపెట్లు
కడచెఁబోయాయాస ♦ మడరఁగనిలువకే, యూరఁదాద్వారకఁ ♦ జేరుపెట్లు
చేరెఁబోయీశాన ♦ వారిజాసనులకు, దొఱకనిహరికొల్వు ♦ దొఱకుపెట్లు
దొఱకెఁబోగాంభీర్య ♦ ధుర్యుఁడౌశౌరిబ్రా, హ్మణునితోఁబిలిచిమా ♦ టాడుపెట్లు
లాడెఁబోనాదుమదినున్న ♦ యట్టిమమత, నాత్మనంగీకరించియు ♦ య్యమరవంద్యుఁ
డిటకుఁజనుదెంచుపెట్లును ♦ దీప్సితంబు, సఫలముగనన్నుఁజేకొను ♦ జాడలెట్లు.

గీ. అన్నసభలోననిన్నఁదా ♦ నన్నమాట, విన్నఁదోడ్తోనెనామది ♦ వేయుభ్రయ్య
లగుచుఁజనకున్నదప్పుడే ♦ యరసిచూడ, వ్రజముఖమంచుఁజింతింప ♦ వలయునిజము.

క. నాపాలిభాగ్యదేవత, గోపాలునినిటకుఁదెచ్చి ♦ గొనగూర్చునెడు
ర్వాశ్యపారుఁడైనసుకృతికిఁ, బ్రాపైవాఁడెన్నినట్ల ♦ ఫలమిచ్చునొకో. ౨౩.

మ. అనిచింతించుచునవ్వెలందికుసుమా ♦ స్త్రాభీలచాపోజ్ఝిత
స్వనదత్యుగ్రశరాళికిన్ సుమరసా ♦ స్వాదప్రమాద్యత్ప్రఖర
స్వనదత్రాసకరాళికిన్ విరహిహృ ♦ స్నిర్భేదనారక్తలో
చనభృత్కోకిలపాళియాళికినిజ ♦ స్వాంతంబుకంపింపఁగన్. ౨౪.

చ. నగుఁదలయూఁచు నుస్సురను ♦ నల్దెసలుం బరికించు మిన్నకే
బెగడుఁదపించుఁ జేరిచెలి ♦ బిల్వఁగఁ బోవుఁ దనంతనంతలో
మగుడుఁగ రారవిందమును ♦ మాటికిఁ జెక్కునఁ జేర్చు నేమిరా
నగధరయంచు గొంకులల ♦ నామణి చిత్తజమోహమగ్నయై. ౨౭.

గీ. ఇట్లు విరహాగ్నిఁ దపియించు ♦ నింతిఁ జూచి, యబ్జరేఖాదులైనయ ♦ య్యబలచెలులు
గుసగుసలఁ బోవఁదొణఁగిరి ♦ యసమశరశ, రార్తియోయిది వేరొండొ ♦ యనుచు నపుడు.

సీ. మృదుతనూసుమవల్లి ♦ మిగులఁ గాఁగఁ దొడంగె, నీకైన మైపూఁత ♦ పేటులెత్తె
సొగసులేఁ జెక్కుల ♦ సుక్కిళ్లుగను పట్టె, వదనారవిందంబు ♦ వాడుపాఱెఁ
గమ్మచెమ్మటనీరు ♦ గలయ నెమ్మెయిఁ బర్వె, నిట్టూర్పుగాడ్పులు ♦ మట్టుమీఱె
నుదరిచాయలనీను ♦ నొడలు వెల్వెలఁ బాఱె, వెడవెడ నెంతేని ♦ వడఁకుదోఁచె
నుల్లమునఁ జింతలంతంతఁ ♦ బల్లవించె, మనలపైఁ గూర్మి నానాట ♦ మట్టుపడియె
కంటిరే చెలులారయీ ♦ కాంతయున్న, పతము మనకెల్లఁ జూడఁగ ♦ వింతయయ్యె.

మ. అనినన్ నవ్వుచు నబ్జరేఖ చెలులా ♦ రా నిన్న యిక్కన్నెయి
వ్వనిపూవుల్ గొనవచ్చి వావిలివిరుల్ ♦ వాంఛింప నిట్టూర్పుగా
డ్పునఁ గల్పించుమటంచు నేననఁగఁ దో ♦ డ్తోనట్ల కావింపయే
మని నేఁ బల్కుదు దీనియూర్పు సెకలా ♦ హా పెంచె నవ్వావిలిన్. ౨౮.

చ. అనర సమంజరిట్లను వ ♦ యస్యలు వింటి రెనిన్న రేయినీ
కనకలతాంగి మైచెమట ♦ గ్రమ్మని దేమనియేను వేఁడఁదా
నినకరసక్తి నాఁగనినుఁ ♦ డేడి యనన్ శశిఁ జూపనిల్పికా
దనవపునంచుఁ బల్కుచను ♦ నంతియకాని యెఱుంగ దేమియున్. ౨౯.

చ. అనినఁ జకోరనేత్రయను ♦ నంబుజలోచనలార నిన్న నీ
కనకనిభాంగినన్ బిలిచి ♦ గంధముఁ బూయుమనంగ నేను స
ట్లనసవరింపమేని సెక ♦ లన్ను గంధము బీటలెత్తఁ జం
దనము నలంద నేరవని ♦ నన్ననుఁ గాని యెఱుంగదూష్మమున్. ౩౦.

మ. అనసబ్జాస్యయనున్ వయస్యలకు నీ ♦ యబ్జాక్షికై సేయుమం
చన నేసొమ్ముల పెట్టి తెచ్చి మణిభూ ♦ షానీకముల్ బూన్పఁబో
యిన నొండేనియుఁ గ్రాటి గామినివియే ♦ మే చెల్లి నా సొమ్ములా
చనుమంచాడును గాని నేర దెఱుఁగన్ ♦ స్వప్రాప్తకార్శ్యోన్నతిన్. ౩౧.

చ. అనలలితాంగి సెప్పఁ జెలు ♦ లారవినుండొక వింతయేనుమ
జ్జనమొనరింపలె మ్మనినఁ ♦ జక్కఁగ నైతెము నన్నుఁ జూడకే
మనసొకచోటఁ బాఁచుటను ♦ మానినిరో యలచోటికీవు పో
మ్మనియనుఁగానియేఁ బలికి ♦ నట్టివితంబెఱుంగ దింతయున్. ౬౨.

క. అనియీగతి యాలీతతి, వనజేక్షణయున్నరీతి ♦ వాకొనితమలో
మనమిపుడీకన్నియనె, మ్మనముంగనుకున్నఁ గడుప్ర ♦ మాదంబనుచున్. ౬౩

క. చెంగటికిఁ జేరియనిరో, యంగననీవున్నవిధము ♦ నరసినమాకున్.
వింగడమైనదియున్నతె, ఱంగెఱిఁగించెదవొ మమ్ము ♦ తాపిడిరొదవో. ౬౪.

చ. పలుకవిదేటికే చెలులు ♦ పల్కుఁ బిల్చిన నొల్ల వేటికే
జలకములాడుమన్నముఖుఁ ♦ జక్కఁగ నైతెము చూడవేటికే
కలపమలందుమన్నమదిఁ ♦ గైకొనవేల భుజింపుమన్న బి
ట్టలిగెదవేల నీచరిత ♦ మక్కటమిక్కిలి వింతయయ్యెడిన్. ౬౫.

క. అటమట వాఁడెను మొగమును, గటకట నసివాడెగడిమ ♦ గడియకుమేనున్
గిటగిటనగుచుఁ గృశించెను, జిటిపొటినిగవుల్ దొఱంగెఁ ♦ జేడ్పడె నెదయున్. ౬౬.

క. కామిని నీవిటులున్కి, కేమినిమిత్తంబు మేము ♦ నింతంతటు పో
రామిగలవారమనుచు, న్నామదనెన్నఁడమునీము ♦ నంబెటులున్నన్. ౬౭.

ఉ. మోమబవాంచియున్నమతి ♦ ముచ్చటకేనియుఁ బల్కకున్న దృ
క్తామరసంబులందొగరు ♦ దార్కొనఁ జూచినఁ గేల్విదర్చినన్
బ్రేమదొఱంగిపల్కనను ♦ బిట్టదలించితృణీకరించినన్
భామినిమాకునమ్మికలు ♦ పాటిలనేరవు నిన్నుఁ జూచినన్. ౬౮.

క. నీవెంతదాఁచినను నీ, భావంబొకకొంతయొఱుఁగఁ ♦ బడకుండునటే
జైవాతృకసమముఖు నదె, యావలివసివాడెనేల ♦ యదికనుఁగొనమే. ౬౯.

సీ. ఊరువుబలు వేఁడి ♦ మూరఁగఁగమలిన, కరగతాబ్జము చూఱ ♦ చుఱులు దెల్ప
నంతంతకును హెచ్చు ♦ నతనుతాపస్ఫూర్తి, ననిశంబు నెపఁబగ్గ ♦ నదరు దెల్పఁ
బలుమాఱు చెలిపిల్వఁ ♦ బలుకంగ వసహోమి, వరగంటనిచ్చును ♦ త్తరము దెల్ప
నత్యుష్ణబాష్పంబు ♦ లలవోకనొత్తంగఁ, దడిసికందిన గుచ్ఛ ♦ తతులు దెల్ప
నదరు నెవ్వగఁ బొరినుస్సు ♦ రసుట దెల్ప, భావభవభీతి వడినుల్కి ♦ పడుట దెల్పఁ
దెగువ మోమునఁ దెచ్చుకోల్ ♦ తెలివి దెల్పఁ, గొమ్మనీయునికి యేమాకు ♦ గుఱుతు గాదె.

స్వేదాంబునిధిలోన ◇ చెలఁగుఫేనంబుగాఁ, బూసినగంధంబు ◇ పొంగఁదొలఁగెఁ
బొంగుగంధపుఁబేటు ◇ మొగులందెఁబొమ్ముద. రమలనాజాగరా ◇ రుణ్యమడరె
జాగరారుణదీధితి ◇ స్ఫుటమునగ్గ, సంఘటితతారకా(ప్రకా ◇ శంబుమిగుల
నడరియే(ప్రొద్దునెడఁబాయు ◇ కలరుచుండ, వెలఁదికనుఁగల్వలరమోడ్పు ◇ విడివడియె.

సీ. వితతబాష్పాసార ◇ వృద్ధిదంబయిపువ్వు, ననిలంబునాసూర్పు ◇ లతిశయిల్లెఁ
జారుతనూలతా ◇ సంజాతముకుళో(ద్గ, మంబునాఁగరో ◇ మాంచమొదవెఁ
జింతాపయోరాశి ◇ యంతంతకుబికిన, కరణిమై(శ్రమవారి ◇ గ్రమ్ముకొనియె
నతనుశిలీముఖా ◇ హతికిఁదల్లడమందు, గతిననుక్షణసంప్ర ◇ కంపమడరె
హృదయసదనాధిగతపృథ్వీ ◇ శేశసేవ, నానుషక్తినిబలెనింద్రి ◇ యమ్ములెల్ల
నిశ్చలతనుండునునసంగ ◇ నివ్వటిల్లెఁ, (బత్యాహరమ్మునని వ్వెఱ ◇ పాటుచెలికి. ౧౦౯.

మ. జలజాతాహితుఁడా(ప్రభాతమునిజ ◇ చ్ఛవ్యగ్నికీలాహతిన్
నెలఁతన్ వేఁచుచునంతకుట్టుసురుతో ◇ నీలాబ్జనే(త్రన్ దయన్
నిలుపంగానుసురింతపోపజలజా ◇ నీకాళి(మోయంగన
క్షులుజైవాతృకవక్త్రియందునునిచెన్ ◇ (శ్రోత్రమ్ములందర్శులన్. ౧౧౦.

మ. అరుణాబ్జాతనిరీక్షణంబతికులా ◇ య(ప్రోత్థప(త్రిచ్ఛటా
గరుదుద్య(ద్వగర్జితంబభిపత ◇ త్కంజాతబంధు(ప్రభా
పరికీర్ణాంబరచి(త్రమంసలతమో ◇ భ(ద్రచ్ఛిదాదక్షమై
హరిణాక్షీహృదయార్తితోఁదొడఁగెఁగ ◇ ల్యద్వీపియత్యు(గతన్. ౧౧౧.

శా. నానారక్తపటీవితానఘణర ◇ త్నద్యోతముల్ మల్లికా
సూనతో(త్కరకతీక్ష్ణదంష్ట్రిణునలి ◇ స్తోమాఖ్యవైపాగ్నిధూ
మానీకంబురరోదసీబిలముఖ ◇ వ్యాత్రయోత్తమజ్జేక్షణా
(ప్రాణస్పర్శనకంపదంబగుచుమ ◇ ధ్యాహ్నహిదోఁచెన్ వడిన్. ౧౧౨.

శా. స్ఫాయద్ధల్లకపద్మకంబు(భ్రమరీ ◇ పాళీమదాసారమ
త్యాయామస్ఫుటసాంధ్యరాగకుధము ◇ ద్యత్తారకాపుష్కర
(ప్రాయఃకీర్ణపయఃకణంబుహృతభా ◇ స్వద్బింబరక్తాబ్జమై
సాయంభ(ద్రగజంబుచొచ్చికలఁచున్ ◇ శ్యామామనోదీర్ఘికన్. ౧౧౩.

మ. అలిగానాతిశయంబడంతుననియ ◇ య్యబ్జాక్షివేవల్లకీ
కలనాదంబుఘటింపదానమిగులం ◇ గన్పట్టుసౌధస్థలా

కలితస్తంభసముల్లసత్కిసలయ ◈ గ్రాసాతిమాద్యత్పికా
వలిరంతులో వలవంతగూర్పనగుభా ◈ వంబాత్మలో మెచ్చుచున్. ౧౧౪.

చ. నెలఁతవిభీతి నైందవమ ◈ ణీపరినిర్మితశాలమానిత
ద్బలరిపునీలశాలఁ బ్రమ ◈ దంబునఁ జొచ్చితసంశుమాలికా
జలదవిలోకనృత్యదహి ◈ శత్రుతతింగనిడాఁగఁబోవుచోఁ
దలవరులం బిలించుబలు ◈ తాపము చే వెడలున్ దనంతటన్. ౧౧౫.

వ. మఱియు నవ్వైదర్భిసుభ్రూవతంసంబు నిజవయస్యలనుస్యూతంబుగ నవరించువివిధ శిశిరోపచారమ్ముల నంతంతకు విరహదవదహనభారం బపారం బగుచు విజృంభించుటయుఁ బంచశరుండు శంబరేక్షణాభిధానసంజనితసమగ్రతరదురాగ్రహంబునఁ జక్రరిపుబింబదంభసంభావితశాణచక్రంబు నపరాగవిస్ఫులింగంబు నలుగడలం జెదరఁ గైరవశిలీముఖంబులు గావించి వంచనం బొంచి పొంచి నిగిడించిన యుది యరుంతుదంబు లగుచు నంగంబునం దాఁకి వెన్నునం దటాయించినం గనిపించు మొనలచెలువునం జూపట్టుకుసుమశయ్యావివర్తననిషక్తకళికానికాయంబు వెంబడిం దొరఁగునపరిమితకుసుమరజస్సమ్మిళితపరిశ్రమవారిపూరంబులు క్రొడగండ్లఁ దొరఁగు వేఁడిరక్తధారల తెఱంగునం దురంగలింప ముహుర్ముహురుదంచితనిశ్వాసశ్వసనానుక్షణప్రవర్ధమానభావభవపావకసముద్ధూతమ్ము లగుధూమరేఖాశిఖాకలాపభసితమ్ముల నుల్లసిల్లునిజతాపమేచకితచందనాచులేపనరసాలకిసలయపిసరఘనసారరేణుమిళితవిరహధవళిమమ్ములతోడి యంగవల్లి యుల్లసిల్లుటకు నవరించిన దోహదధూమస్తోమంబు ననుకరించుచుఁ గ్రొమ్ముడివీడి యాక్రీపనంబుగా నిగిడి యెల్లెడల నావరించినచికురనికురంబును ఘనాఘనంబునం దోఁచు పృథులకరకానికాయజకణచంచలాకలాపంబులనం దగుపరిపతత్కుసుమమాలికాప్రస్ఫుటత్తారహారముక్తాఫలప్రఫుల్లమల్లికమల్లికాదామంబు లనునిర్ఝరనికరతదుచ్ఛలత్సలిలశీకరగైరికధాతులేఖాభిరామంబు లగువక్షోరుహాక్షోణిధరంబులఁ గనంబడుశైవాలమాలికయను కాళికయందుఁ గ్రందుకొను బలాకశ్రేణిఁ గ్రేణి సేయుచు రాణించు నంచితమృణాలనాళంబుల గుచుచు వేడుక గతాగతంబులు సలుపుమరాళీసముదయంబు లుల్లోలకల్లోలంబుగా నుల్లసిల్ల నాయల్లకమహార్ణవతరంగంబుల తెఱంగు నంగీకరింప మాటిమాటికి గాటంబుగా నిగుడు కాటుకకన్నీటి వెల్లువలు వెల్లుబికి విరహదవదహనపాండరంబు లగుకపోలముకురఫలకంబులందు ముక నొక్కమ్మడిం గ్రమ్ముకొను క్రొంబొగలు గగనమధ్యంబునం దనరు నరుణకిరణుని వేఁడిమి వాడఁబాఱిన

కుసుమమంజరుల కాలూఁదనోడి సెగయు బంభరడింభంబుల విజృంభణమ్ము నెరప వివిధదశావిశేషంబుల వేఁగుచున్న సమయంబున. ౧౧౬.

సీ. పాలఁతియొకర్తె సెంగలువ ◆ పూవులబంతుల కేలఁబూనిక
న్నులఁబాలుమాలునొత్తునుపా ◆ నూలొక్కతె మ్రేముడిఁగన్నులారయీ
కలికినోర్వృథాభరమ్ముఁ ◆ గంటిరె నేత్రపయోజనిస్సర
త్సలిలకణంబులారవిసి ◆ చల్లఁగఁజుమ్ము హారినీలరోచులన్. ౧౧౭.

గీ. అన్న సార్థసుశ్లోకిణి ◆ కన్నె దెలిచి, చూచితనచెలి హారినీల ◆ రోచులనినఁ
బలుకు పెవ్రుల సంమృతంబు ◆ గులికినట్లు, లలరి నోముననోకకొంత ◆ తెలివిఁజెందె.

కం. ఇందీవరాక్షులెత్తెని. యందఱునయ్యబలఁజేరి ◆ హర్షమునఁగడున్
డెందములనలరిమించఁగ, మందస్వనలగుచుననిరి ◆ మానినితోడన్. ౧౧౯.

కం. ధీరోదాత్తుఁడనీసఖు, లారాటముఁజెందనాయ ◆ మారాకన్నెల్
కూరిమిఁజక్కనిరాసుతుఁ, గోరకొలత్త్రణము లేక ◆ కూడవొయతనిన్. ౧౨౦.

కం. మగఁడేమిపులిపాముమెగఁగో, కరకరిపెట్టుటకువాని ◆ కాంతమునిల నె
వ్వరిదూసిచనియనూహక, వెఱచెదవ్రాయమ్మయిచవి ◆ వేకము తెఱఁగే. ౧౨౧.

చ. వనజదళేక్షణుండనుద్విజ ◆ వర్యునిచేభవదీయవృత్తమున్
వినిఁ దిరయాదిరామునిని ◆ వీఁకఁదపింపకయుండు టెట్లుని
న్ననిపిశరమ్ము లేయుచును ◆ నిద్దురయుండఁడౌసుమసాయకుండు వే
దయునాసనవేలనాహరిని ◆ దయుయ్యలనూఁచుచుజోలవాడునే. ౧౨౨.

గీ. అనిన సక్తిణిమీరన్న ◆ యర్థమెల్ల, నిజము చెలులార వానియా ◆ రజము విన్న
కన్నె యెవ్వతె చేకాక ◆ గాకయుండుఁ, గ్రొన్ననలకును వెన్నెల ◆ చిన్నెలకును.

కం. యదుకులతిలకునిజగతిన్, మదనజనకుఁడనఁగవిందు ◆ మాటికినేఁడ
ట్టిదయయ్యెనేమి దెల్పుదు, హృదయేశ్వరుసంజ్ఞయింతి ◆ యెంచుటకతనన్. ౧౨౪.

ఉ. ద్వారకకేగి భూసురుఁడు ◆ తత్పరతన్ మదువంతమంతయున్
శౌరికిఁదెల్పనాతఁడును ◆ సత్వరతన్ జనుదెంచునంచుమీ
రారసియుండిరయ్యుఁదెలియ ◆ నట్లువచించెదరింతకాకయా
వ్వారు నెఱుంగరేయతఁడు ◆ వారిజనేత్రలనేఁచుచెయ్యుదుల్. ౧౨౫.

గీ. తనదువక్షస్స్థలంబుపా ◆ యనిపయోధి, కన్యనటుఁబ్రోచితాపరి ◆ గానిరూపు
దాల్చిభూదేవివెన్నునఁ ◆ దాల్చితెచ్చెఁ, గూర్మిగణియింపమికినిది ◆ గుఱుతుగాదె.

క. విమలవ్రతకంచుకములు, తెమలన్ దనవచనములక ♦ ధీనలగునటుల్
భ్రమయించి త్రిపురదానవ, కమలవిలోచనల నెల్లఁ ♦ గలఁపఁడె యీవలన్. ౧౨౭.

క. ప్రాగ్రూపంబునరామా, విగ్రహవాన్ ధర్మయనఁగ ♦ వెలసియు మానుషు
న్నుగ్రతఁ దునుమఁడె పృథులత, రాగ్రహమునఁ బాటకాని ♦ శాటవధూటిన్. ౧౨౮.

చ. అవనితనూజపైఁ గదిసె ♦ నంచొక నేరము మోపి దక్కసిం
గవుఁ దలంచు దానవు ♦ గాపనక్కొనుబజీతు సేసెనో
కువలయనేత్రలార తన ♦ కూర్మినిజంబగునే నిసీతన
త్యవిరళవస్త్రలన్ విడువ ♦ నానతియీఁడె హనుగ్రదౌహ్యదన్. ౧౨౯.

మ. వృషగాదోచెలులార నాపలుకులీ ♦ కృష్ణుండు స్తన్యంబునన్
ద్రుపదీర్ఘంజను దెంచుపూతన వృథా ♦ హింసించెఁ బ్రాగ్వాసనన్
విషమీనచ్చిన వారిజంపుటుచితం ♦ బేకాదయన్నట్టిదో
విషరాసుల్ నిజకుక్షినుండెనకటా ♦ వేఁగేవిషంబింతయున్. ౧౩౦.

చ. మగలగణింపకందఱుచు ♦ మాటల నెంచకయున్నదమ్ములన్
దగదననోహటింపకయుఁ ♦ దన్వరియించినఘోషసంస్థలా
మగువలఁ బాసివచ్చియొక ♦ మాఱుతలంపఁడటన్న స్త్రీలపైఁ
దగులును గూర్మియుంగలదె ♦ తామరసేక్షణలార వానికిన్. ౧౩౧.

సీ. అతనిమనోవీథి ♦ నవతరించుటఁ గదా, విశదరశ్మికి నింత ♦ వేఁడిగల్గె
నతనికొమారుఁడై ♦ యతిశయించుటఁ గదా, మారుఁడన్ విఖ్యాతి ♦ మరునకొదవె
నతని నెమ్మేయిచాయ ♦ ననుకరించుటఁ గదా, యళిశిలీముఖసంజ్ఞ ♦ నతిశయిల్లె
నాతని నామధే ♦ యము వహించుటఁ గదా, మలసెవైశాఖాఖ్య ♦ మాధవునకు
నతని కేతువునకుభృత్య ♦ లగుటఁ గాదె, శారికాకీరసితగరు ♦ చ్ఛకదయుము
లకటకుటిలాలకలకుబా ♦ ధకములయ్యె, నింతలేవానిచెయ్దులు ♦ లెవ్వలఁదలార.

వ. అని యిత్తెఱంగు నమ్మత్తకాశిని చిత్తజావేశంబునం జేసి యమ్మహాంభదంభోజనసం
భోజలోచనుని సారెసారెకు సంస్మరించుచు సముద్రమధ్యగతుం డైననిజమనోవల్ల
భుని వెదకవలయు ననుకుతూహలంబునం బలె సారెసారెకు నపారవిసిహపారావారం
బున మునుంగుచు సఖీజనపునఃపునారచితవివిధశైత్యోపచారంబులఁ గొంతతొంత
పారంబు నొందుచున్న సమయంబున సఖీజనంబు లెంతప్రయత్నంబు గావించియు న
క్కాంతారత్నంబు ముఖోల్లాసంబు వడయంజాలమిఁ బరస్పరానునాపలోకంబులు

నెరపుచు వనవిహారంబునం గాని దీనిమనంబునం గల వగటు దీఱదని నిశ్చయించి య
య్యింతుఁబోణిం గనుంగొని యిట్లనిరి. ౧౩౩.

ఉ. హల్లకపాణి నీవిటుల ♦ హర్నిశముందుదలేని దారుణా
యల్లక వేదనాగరిమ ♦ నార్తివహించెద వేలయమ్మనీ
యుల్లము పల్లవింపనిక ♦ నోపవనాంతరవీథులందురం
జిల్లు నికుంజవాటికలు ♦ చేరినయాఁటఁ గల్గునచ్చటన్. ౧౩౪.

క. అని యిట్లు విన్నవించిన, ఘనసన్నిభవేణియపుడు ♦ కంజదళాక్షుల్
దనుఁ గొల్వ వనికిఁ జేరెన్, మనమునఁ గలవంతకొంత ♦ మట్టుపడంగన్. ౧౩౫.

సీ. బహువిరహోద్భూత ♦ పాండురాగద్యుతుల్, కంజాతసాయకు ♦ గర్వమడఁప
విస్రస్తకబరీవి ♦ పీననీరదపఙ్క్తి, మదమరాళశ్రేణి ♦ యెదుటుమాన్ప
జాగరారుణదీప్తి ♦ సారెచకోరాక్షి, మానితౌద్ధత్యంబు ♦ మట్టుపఱుప
ముహుమదంచద్గాఢ ♦ మోహతమస్స్ఫూర్తి, కోకలోకంబుఁజీ ♦ కాకుసేయ
ఘనతరవియోగయోగసం ♦ జనితగతులె, యడరియీరీతిసాహాయ్య ♦ మాచరింపఁ
జిత్తమునఁ గొంతయూఱట ♦ చెందియబల, యలసగతిఁ బూనివనవీథి ♦ కరిగెనపుడు

క. చెలులంతనతులసంభ్రమ, కలనన్ జెంగటికిఁ జేరి ♦ కమనీయవనీ
విలసనములు చతురోక్తులు, దెలుపుచు నిట్లనిరి యలస ♦ తీమణితోడన్. ౧౩౬

సీ. చాంపేయసుమరజ ♦ శ్చామీకరాంబర, ప్రభలు నల్దిక్కులఁ ♦ బరిఢవిల్ల
బలభిన్మణిశ్యామ ♦ ఘనకదంబనిజాంగ, కాంతులెల్లెడలను ♦ గ్రమ్ముకొనఁగ
బంధూకసుమపూజ ♦ బంధురద్యుతిపూర, కౌస్తుభచ్ఛాయలు ♦ కలయఁబర్వ
మలయానిలాపూర్య ♦ మాణవేణుధ్వని, మురళీనినాదంబు ♦ మురువుదెలుపఁ
బ్రకటవనవాసనిశ్చలా ♦ వికలహృదయ, శుకముఖానేకసద్ద్విజ ♦ స్తూయమానుఁ
డగుచు నిత్తఱి నీరాక ♦ కలరి యెదురు, చూచుచుండెడు మాధవు ♦ సొబగు కంటె.

చ. పరభృతవృత్తిచేఁ బెరిఁగి ♦ పాటలలోచనదీప్తి నిప్పులన్
గురియుచుఁ గాలమూర్తియనఁ ♦ గ్రూరతఁ జెందు పికంబు గానలోఁ
దిరుగుచుఁ బల్లవాశనతఁ ♦ దీవ్రతపంబిటులెంత చేసినన్
గరివరయాననీ మధుర ♦ కంఠనినాదముఁ జెందనేర్చునే. ౧౩౭

చ. కమలదళాయతాక్షి యిదె ♦ కంటివె యీకమనీయపుష్పవి
ట్పముదయ చాతకప్రమద ♦ సంఘటకంబగు తేనెవానభూ

జములను మేఘముల్ గురియఁ ◆ జాల్వగఁ బండితనంత వ్రీలుదా
డిమఫలబీజపాళి ప్రక ◆ టించె సురేశ్వరచాపసంపదన్. ౧౮౦.

చ. కనుఁగొను మబ్జనేత్రయల ◆ కామిని క్రొవ్విరితీవె యుయ్యెలన్
మును కొని నిల్చి పాదముల ◆ ముందఱి భూజముఁ దాఁచినంతఁ గ్రొ
న్ననలచటన్ జనించియరు ◆ ణద్యుతితో నె వెలార్చెఁ దత్పదా
గ్రనిహతిఁ గ్రొత్త నెత్తురులు ◆ గ్రక్కెడు కైవడిఁ గాననస్థలిన్. ౧౮౧.

సీ. చలువ గొజ్జఁగినీట ◆ జలకమ్ము సవరించి, తెలిదమ్మి తేకుపాం ◆ త్తుటిఁ గదించి
కోమరావకుసుమగు ◆ చ్ఛములను వెలిగ్రమ్ము, మధురసస్తన్యంబు ◆ మమత నొసఁగి
తెమ్మెరచే నూఁగు ◆ తీవె నున్దొట్లలో, నెయ్యనఁ జిగురాకు ◆ శయ్య నునిచి
చెవులకు నింపైన ◆ చిఱుతతుమ్మెదపిండు, రొద పేరిజోలల ◆ ముద మొనర్చి
ప్రేమమునఁ గాననెందిర ◆ పెనుపమరుఁడు, ప్రొద్దుప్రొద్దుకు నభివృద్ధి ◆ పొందియపుడె
పచ్చవిలువూని విరహుల ◆ భంగపఱుప, దండు వెడలెడుఁ గంటె వే ◆ దండగమన.

క. అనివనవైభవమీగతి, వనజేక్షణ కెఱుఁగఁ దెల్పి ◆ వనితామణుల
త్యనుపమలీలాగతిఁ జే, కొని యాటచనిరపుడు విరులు ◆ గోయఁగ వేడ్కన్. ౧౮౩.

సీ. మధురసాస్వాదాళి ◆ మత్తాళిపఙ్క్తితో, వేణీభరంబులు ◆ వీయమందఁ
గుంజసంఘుస్ఫుట ◆ త్కుసుమవాసనలతో, గాత్రసౌరభ్యంబు ◆ కలయఁ బర్వ
బహుతరవల్లరీ ◆ పల్లవావళులతో, లలితాంగుళీశ్రేణి ◆ చెలిమి సేయఁ
గలితసప్తచ్ఛద ◆ కదలికాతరులతో, మహితోరుకాండముల్ ◆ మైత్రి నెఱప
మదమరాళనినాదసం ◆ పదలతోడ, మంజుమంజీరనినదంబు ◆ మాఱుమలయ
వనరమానవ్యసారూప్య ◆ మునఁ జెలంగి, వారిరుహనేత్రలందఱుఁ ◆ గేరినగుచు.

క. నవనవరసాలమృదుప, ల్లవలవనస్ఫుటనినాద ◆ లలితపరభృతో
త్సవకరనిస్వనమాధురిఁ, దవిలెడు వచనములు మెఱయఁ ◆ దరుణులు వరుసన్. ౧౮౫.

రగడ. మగువక్రొవ్విరులు ◆ మాటకుమాటకు, మగఁటిమిసూపెదు ◆ మాటకుమాటకుఁ
జెలియపలుకుసుధ ◆ చిలుకకుచిలుకకు, చెలఁగురోసమిా ◆ చిలుకకుఁ జిలుకకు
తరుణిమయూరముఁ ◆ దఱుమకుతఱుమకు, వరణీయంబిది ◆ వనజాతరమకు
పొలఁతి క్రొవ్వలను ◆ బొగడకుపొగడకు, తులరాదిదిమన ◆ తోఁపులపొగడకు
జోటిమాటికిటుఁ ◆ జూడకుచూడకు, సూటిగాదు చెలి ◆ సూనము చూడకు
పడఁతి కోకములఁ ◆ బట్టకుపట్టకు, మెడనెడఁ దిరిగెడు ◆ నివితమపొట్టకు

ఇంతిదూరమిఁక ♦ నేగకు మేగకు, మెంతలోఁతోయిది ♦ యీఁతకువీఁగకు
చెలువచిల్కఁగమిఁ ♦ జెనకకుచెనకకు, మలిగినబాధక ♦ మదియే వెనకకు
మెలఁతభీతిచే ♦ మెదలకుమెదలకు, మెలమినివలఁగొను ♦ నీతు మ్మెదలకుఁ
దొయ్యలిబిసములఁ ♦ ద్రుంచకుత్రుంచకు, మెయ్యెడజీవన ♦ మీకడ సెంచకు
వెఱఁదిపంతమును ♦ విడువకువిడువకు, మలఁతిగా దెనీ ♦ యంతటిప్రోడకు
చెలియ పువుఁబొదరుఁ ♦ జేరకుచేరకు, మళులుపొంచినవి ♦ యవిగో చూఱకు
బిత్తరిరోసమ్ముఁ ♦ బెంచకుపెంచకు, మిత్తతిరమ్మీ ♦ యీపాదపంచకుఁ
గోమలిజాజులుఁ ♦ గోయకుకోయకు, కాముఁడుదిగిరాఁ ♦ గలయదిచేయకు
సుదతిరాఁగదే ♦ చూతముచూతము, మదశుక మెదిరిన ♦ మనకువిఘాతము
తోయజముఖియిటఁ ♦ ద్రుళ్లకుత్రుళ్లకు, మేయెడ మెత్తురె ♦ యీపడిసుళ్లకుఁ
గొమ్మకోయిలకుఁ ♦ గొంకకుకొంకకు, మమ్మ చెల్లరా ♦ దదినీవంకకు
నాతికనీనిక ♦ నమ్మకునమ్మకు, మీతటిపొంచిన ♦ దీగజనిమ్మకు
ముదితచిగురులివి ♦ ముట్టకుముట్టకు, కొదరుకోసమీ ♦ కోయిలఁదిట్టకు
వెలయుందినదీ ♦ విడువకువిడువకు, తొలుతటివతెవ ♦ త్తునెనీగొడవకు. ౧౪౬.

చ. అనిలలితాంగులత్తటిస ♦ మంచితసౌరభవైభవంబునం
దనరెడువానిఁ దుమ్మెదల ♦ తండముచేఁగసిగందకెంతయుం
గనఁబడువానిఁ దేనియల ♦ కమ్మదనమ్ముల వ్రొనివానిఁ గ్రొ
న్ననలాకకొన్నిఁ గూరిచియ ♦ నంగునిపూజకు నేర్పరించుచున్. ౧౪౭

సీ. తెలివిరిమొగ్గనే ♦ వళములచెలువంబు, హురుమంజిముత్తెంపు ♦ సరులఁదెగడఁ
దళుకొత్తుమైదీవ ♦ నలముపుప్పొడిచాయ, తాఁగందపొడియం ♦ దమహసింప
రంగారుతలిరాకు ♦ టంగదట్టపునిగ్గు, చెంగావిపావడ ♦ సిరివహింపఁ
గమ్మగేదఁగిరేకు ♦ కమ్మయొయ్యారమ్ము, కనకతాటంకయు ♦ గ్మంబుగెలువ
వనజముఖులెల్లబహువిధ ♦ వనవిహార, హారలీలావిశేషప్ర ♦ చారగతులె
యమరఁజేయనిసింగార ♦ మగుచుఁదనర, నతనునిజయేందిరలమాట్కి ♦ నలరిరపుడు

క. సల్లలితవకుళముకుళో, ద్వేల్లితమకరందహీన ♦ విహ్వలమధులి
ట్సల్లజగరుదాస్ఫాలన, హల్లోహలమగుచుశీత ♦ లానిలమొలయన్. ౧౪౮

గీ. చానలీరీతిఁ బుష్పాప ♦ చయవినోద, జనితమగుశ్రాంతిదీఱంగ ♦ జలవిహార
కాంక్షలిగురొత్తఁ జనిచని ♦ కాంచిరెదుట, శ్రీకరంబగునొక్కప ♦ ద్మాకరంబు.

వ. ఇత్తెఱంగున న య్యంగనారత్నంబులు తమకురంగటం దనరుసరోవరంబునుం గనుం గొని యభంగురసముత్తుంగతరంగమాలికాడోలికాకేళికాదరంబునం బొంగుసలిలాధిదేవత యుపరివిస్ఫురచలదరుణకమలమంజుమంజీరశింజారవంబుల సామంజస్యంబు నెరపు హంసకులక్రేంకారనాదంబులకు మోదంబుఁ జెందుచు, నిజాగమనసంభ్రమ కుతూహలంబులఁ గాసారకమలామణి తమ్మెదుర్కొనుమార్గంబునఁ గలయ నెల్లెడఁ బన్ని దట్టంబుగాఁ జిలికి వెలిపట్టుపావడలు పఱచెనో యన సంతతసమంతతస్తంతన్యమాన మృగులపవమానమాణవకవికీర్యమాణశిశిరసలిలకణధవళసరసీరుహపలాశనివహంబులకు నివ్వెరఁగుఁజెందుచు, విమలసలిలాంతరాళంబునం దోఁచునిజబింబంబులసంరంభంబున నంభోరుహాకరరమారమణి తవదునెచ్చెలులం బనిచి మధ్యవినిహితదీపంబు లగుమర కతపాత్రికల హారతు లెత్తించెనో యన నితస్తతశ్చలనపరజలవిహంగమచలాచలనలినీ పలాశసంసక్తరక్తారవిందంబులం గనుంగొని డెందంబులందు నానందంబు నొందుచుఁ, జీనాంబరంబులు ననూనమణిమయాభరణంబు లుజ్జగించి క్రమక్రమంబున వజ్రోపల నిర్మితంబు లగుసోపానమార్గంబుల జలంబు సొచ్చి వివిధవిహారణచాతుర్యంబు మెఱయింపం గడంగి రట్టియెడ. ౧౫౧.

లయగ్రాహి.

ఓలయనుచున్మునిఁగి ♦ నేలఁగనుచుణ్ మగుడఁ, దేలినగుచుణ్ మఱిమ ♦ రాళికల వెంటణ్
బాళిఁజనిపట్టుచును ♦ హాళిగిలకొట్టుచుని, జాలితతిఁదట్టుచును ♦ గేలుగొనియండల్
జాలుగొనఁజల్లుచును ♦ మేలుకనిత్రుళ్లుచును, వేళముగమళ్లుచును ♦ లోలతనుదీప్తిణ్
బాలకడలిణ్ బోడము ♦ బాలికలపోలికకుఁ, జాలిజలకేళిఁగని ♦ రాలలనలెంతణ్.

చ. నలినములుంబ్రసన్నవద ♦ నమ్ములు శైవలముల్ శిరోజముల్
కలికిమెఱుంగుబేడిసలు ♦ కన్నులుఁదామరతూండ్లుబాహువుల్
చెలియఁగరాకయేకమయి ♦ తేజరిలణ్ సలిలాంతరస్థితిణ్
బలుమఱుఁజూడఁబద్మినులు ♦ పద్మినులట్లచెలంగిరయ్యెడణ్. ౧౫౩.

చ. వనరుహనిస్సరన్మధువ ♦ వారణఁగ్రోలుమిళిందమాలికం
గనియొకబోటిపంకరుహ ♦ కర్ణికవైవఁగనగ్రభాగభా
జనమధుపంబుచేరెసిత ♦ సారసముణ్ హరిచక్రధారచేఁ
దునిసినరాహుమస్తకము ♦ తోడ నెచంద్రుఁగ్రసించుకైవడిణ్. ౧౫౪.

ఉ. మొత్తముగూడికామినులు ♦ మోమునసీరముఁజల్లుచల్లఁగాఁ
గుత్తుకబంటినీటిలోక ♦ గుబ్బెతవేచనినిల్చియుండఁగఁద

శ్లో త్తెఁదదీయవక్త్రిముమ ♦ హార్జ్జ్వలనైజవిలాససౌష్ఠవం
బెత్తిన వేడ్కఁగన్గొనజ ♦ లేందిరయెత్తినదర్పణంబనన్. ౧౫౫.

శా. నారీరత్న మొకర్తునీటఁగనుమీ ♦ నద్వంద్వమున్ బట్టవే
నీరంబంజలినెత్తియందుఁగనసా ♦ నేత్రద్వయింగాంచియం
దారూఢస్థితిఁజిక్కనంచుదరిదా ♦ యంబోయితాఁజల్లిత
త్తీరంబందవిలేకయుంటకుఁజెం ♦ దెన్నివ్వెఅన్మగ్ధతన్. ౧౫౬.

క. బాలామణులీగతిజల, కేళిన్ బాళింఘటించి ♦ కిలకిలనగుచున్
జాలించితటముఁజేరిరి, సోలెన్ సోలుచునుభోజ ♦ సుతయున్ దాముస్. ౧౫౭.

క. చిలుకలకోలుకులురుక్మిణి, కలకలతడియొత్తిచిత్రి ♦ తాంబరభూషల్
కలపముఘటించిమతియా, లలనానుమతమునఁదార ♦ లంకృతలగుచున్. ౧౫౮.

గీ. భోజసుతకోరినట్లయం ♦ భోజనయను, వేగమునఁగూర్పఁబోలుపూ ♦ వింటివేల్పు
నెలమిమీఅంగఁబూజింప ♦ వలయుననుచుఁ,దనరుపూజోపకరణముల్ ♦గొనుచునపుడు

సీ. నెమ్మోముజాబిల్లి ♦ నిగ్గువెన్నెలతేటఁ, గఱఁగెడునెలరాల ♦ దరులఁదొరఁగు
తెలినీటనెనసిన ♦ యలరుతేనియవాఁక, క్రేవలనలరులే ♦ మావిగుమురు
చలువలంబెరిఁగిన ♦ వలికప్రపుటనంటి, చెంగటఁదనరుగొ ♦ జ్జంగిపొదల
నల్లినద్రాక్షల ♦ నలమినవిరవాది, తీవెలకిరవైన ♦ క్రోవికలనఁ
గమ్మునేలకిజొంపపు ♦ మమ్మరమ్ము, తెమ్మకిమ్మగుపొగడపూ ♦ రెమ్మనలరు
కమ్మతావులయొమ్మునఁ ♦ జిమ్మిరేఁగి, వచ్చుతెమ్మెరవేడుక ♦ లిచ్చుచోట. ౧౬౦

ఉ. చల్లనికమ్మతావివెద ♦ చల్లఁగఁజాల్ కురువేరుసెజ్జలోఁ
బల్లవతల్లజప్రకర ♦ భద్రవితర్దికదీర్చియందుపై
మొల్లలపాన్పుతమ్మివిరి ♦ ముద్దియగద్దియయందుమీఁదభా
సిల్లనమర్చిప్రోడలగు ♦ చెల్వలుమేల్వలిదమ్మిఁటేకునన్. ౧౬౧

సీ. కామినీశ్లేషసం ♦ గతకుంకుమరసంబు, మేలుచందురుకావి ♦ చేలగాఁగ
భామినీపరికీర్ణ ♦ పటవాసమునఁదోఁచు, శశపదాల్ ముత్యాల ♦ సరులుగాఁగఁ
బ్రియమోవితేనియల్ ♦ నయముతోఁగ్రోలుట, నవకృతవీరపా ♦ ణంబుగాఁగ
దయితార్పితాధర ♦ దంతక్షతములాడు, కఱచినఁజెందుప ♦ ల్గంట్లుగాఁగఁ
బ్రేయసీహాసపూర్వక ♦ ల్పితమనోజ్ఞ, ఘనతరాశ్లేషదృఢవేణి ♦ కాప్రహార
లాంఛనమ్ములుసరిపెన ♦ ల్గాఁగమిగుల, వీరశృంగారములఁజాల ♦ వెలయులీల,

గీ. హరువుమీఱమరులిఖించి ♦ యచటనుంచి, యతనికెలఁకులశుకశారి ♦ కాళిమలయ
పవనశరధరమాధవ ♦ పరభృతముల, వరుసఁజివురాకుల ♦ వ్రాసియునిచి. ౧౬౩.

క. అలరువిలుదాల్పువేల్పున, కలరుంబోఁడులుసమంచి ♦ తాగమలీలా
కలితమతులగుచుఁబూజల్, సలిపిరికృతషోడశోప ♦ చారశ్రీలన్. ౧౬౪.

క. జలజాక్షులురుక్మిణిచేఁ, జిలుకపతాణీవయాళి ♦ జేజేదొరక
ఱ్ఱిలిమీఁఱవిరులవోయిలి, యలవఱచిరిభక్తివిరచి ♦ తాంజలులగుచున్. ౧౬౫.

క. పలువగలనభినుతించిరి, చలపాదిన్గిరసాది ♦ సరసద్రాక్షా
ఫలలలితమధురగుణాసం, కలితశుకీవచనరచన ♦ గడలుకొనంగన్. ౧౬౬.

శా. శ్రీనాథుండఁటతండ్రితల్లియఁట ♦ లక్ష్మీకాంతవాగీశ్వరే
శానేంద్రుల్భవదీయభృత్యులఁటనీ ♦ సామర్థ్యమెవ్వారికిన్
గానన్రాదఁటయిట్టినిన్నుఁబొగడన్ ♦ గాంతాజనుల్శక్తులే
మీనాంకానిరుపాధిసత్కరుణనీ ♦ మీనేక్షణంబ్రోవుమీ. ౧౬౭.

క. పలుదెఱఁగులనీశరములు, తలపైథరియింపకుండు ♦ దైవముగలదే
చెలులనఁగనెంతవారలు, తలఁకకనీయాజ్ఞఁగడవఁ ♦ దామరసాస్త్రా. ౧౬౮.

మ. అవికారంబమలంబమేయమనఘం ♦ బవ్యక్తమాత్మస్థితి
ప్రవణంబాగమవేద్యమైతగుపర ♦ బ్రహ్మంబునీచేఁబ్రకృ
త్యవియుక్తంబయిలోకసృష్టికలనన్ ♦ బ్రాపించెనానిందిరా
ధవగౌరీపతిభారతీశ్వరులకృ ♦ త్యంబెన్నఁగానేటికిన్. ౧౬౯.

క. దితిజపురహృతికివిశిఖా, కృతియైహరినిన్సహాయ ♦ మెంచన్వినమే
అతిశయతేతనుజాతో, వితరన్కశ్చిన్నిజేన ♦ విభవేనయనన్. ౧౭౦.

శా. సూనంబుల్బలువిల్లునుంగుఁజెలియున్ ♦ సూనాంకరుండస్త్రముల్
సూనంబుల్శితఖడ్గమున్గవచమున్ ♦ సూనంబులిట్లున్నచో
నీనానావిధసూనజాలములునీ ♦ కేమిచ్చిప్రార్థించుటల్
భావోద్దీపసమర్పణంబనిదయం ♦ భావింపుమబ్జాంబకా. ౧౭౧.

మ. మునిపత్నీహననంబుఁజేసినఁగదా ♦ మున్గానలోమాధవుం
డనుఁగున్నెచ్చెలిఁబాసిదుఃఖములపా ♦ లైయుండుటల్కావునన్
వనజాక్షుల్దయనీయలీవునుదయన్ ♦ వామాక్షులంబ్రోచినన్
జనసంస్తుత్యశుభంబులౌవనరమా ♦ సాంగత్యమౌమాధవా. ౧౭౨.

శా. శ్రీరాంభోనిధిజన్మభూమివిబుధ ♦ శ్రేణీసముజ్జీవనం
బారూఢస్థితినీవుదర్వ్యతగని ♦ త్త్యావాసముణ్ సర్వలో
కారాధ్యుండెసనీశుమౌళిజగదా ♦ హ్లాదప్రదంబెన్నఁగా
నీరూపంబటుకానఁగావుమిఁకనీ ♦ నీలాబ్జనేత్రణ్ శశీ. ౧౭౩.

క. దక్షిణభూభృజ్జననము, నీక్షితిలోనీకుఁజెలికి ♦ నేకంబగుటణ్
రక్షింపుమునీచెలియలి, దాక్షిణ్యంబాత్మమిగులఁ ♦ దగునునమీరా. ౧౭౪.

క. అనియిట్లుచెలియలందఱు, వనజాస్త్రినిఁదత్సమీప ♦ వర్తులమాధ్వీ
పనితరమణీయసూక్తుల, వినుతులుగావింపనపుడు ♦ విస్ఫుటలీలణ్. ౧౭౫.

క. మాంగలికసూచకానే, కాంగికసునిమిత్తగతుల ♦ నండజనికరా
భంగురవాగ్రీతములు, సంగనకెఱిఁగించెనీప్సి ♦ తార్థావాప్తిణ్. ౧౭౬.

ఉ. అత్తఱిభాగ్యదేవతత ♦ నంతటసన్నిధిసేయుదీతివి
ప్రోత్తముఁడందురాఁగనిమ ♦ హోత్పలపత్రవిశాలనేత్రప
లోత్కటత్తుముదంబుతోఁబులక ♦ లొక్కటఁజెక్కులఁబిక్కటిల్లఁగాఁ
జిత్తరుబొమ్మనాఁగనిలి ♦ చెణ్ జెలియించుకవిస్మయంబుగణ్. ౧౭౭.

గీ. చెలియలంభోజదళనేత్ర ♦ చెంతఁజేరి, యిటకువచ్చినయొజ్జల ♦ కింపుదనర
నతియొనర్పకయుండఁగ ♦ నతిపతగునె, యనఁగరుక్మిణియెదురేగి ♦ యతిముదమున.

క. భూదేవకులోత్తంసుని, పాదాంభోజములకెరఁగ ♦ బ్రాహ్మణుఁడంతణ్
సాదరముగఁజెలిఁగనుఁగొని, మోదముతోననియెనగవు ♦ మోమునఁదొలఁకణ్.

గీ. అతివనీకుమనోరథా ♦ వాప్తిరస్తు, టంచుదీవనయొసఁగియో ♦ యంబుజాక్షి
నీదుకోర్కులుఫలియించె ♦ నిక్కమిపుడు, చింతనందకయూఱటఁ ♦ జెందవమ్మ.

క. అనిపలుకునంతనటకును, మనుజేశ్వరురాణివచ్చి ♦ స్మాదేవునకుణ్
వినతియొనర్పఁగనతఁడును, ననఁబోణిణ్ జూచిపలికె ♦ నవ్యమృదూక్తిణ్. ౧౮౧.

సీ. భవదనుజ్ఞనుజేసి ♦ ద్వారకకేఁజని, కమలలోచనుసము ♦ ఖంబుచేరి
బాలాలలామంబు ♦ భావాబుజాలోనెంచి, యున్నట్టివిధముఁద ♦ దుచితలీల
ధరణీశుఁడీవును ♦ దలఁచినచందంబు, నట్టికార్యమునకు ♦ నంతరాయ
మగునట్లుగారుక్మి ♦ యంతరంగంబునఁ, జింతించియున్నదు ♦ శ్చేష్టితంబు
విన్నవించినదైత్యారి ♦ వినిప్రమోద, కలితమానసుఁడగుచుశ్శౌం ♦ గారవీర
రసములొక్కటమదిలోనఁ ♦ గ్రమ్ముకొనఁగ, వదనముననవ్వుదొలఁకంగ ♦ బలికెనతివ.

మ. కరసజ్జీకృతశార్ఙ్గచాపవిలస ♦ త్కాండప్రకాండాహతిణ్
స్వైరునిర్భిన్నగిరీంద్రబృందముగతిణ్ ♦ వైరిణ్ శరంబొక్కటం

ధరణింగూలంగఁజేసిబల్మినిసుధం ◈ దార్క్ష్యుండువేతెచ్చిన
ట్లరవిందాస్యనుదెత్తుభూతలసుప ◈ ర్వానీకచూడామణీ. ౧౭౩.

గీ. పురము వెలువడి రాక న్నె ◈ గిరితనూజ, కధికభక్తిని మ్రొక్కంగ ◈ నరుగుదేర
నటకు నేవచ్చికూడిన ◈ యవనిపతులు, వెరఁగుపడిచూడఁగొనివత్తు ◈ విమలచరిత.

క. అనిపలికెఁగాననింతట, వనజేక్షణుఁడిటకువచ్చి ◈ వారిజనేత్రన్
దనయరదముపైనిడికొని, చనుటకుసందియములేదు ◈ సామజగమనా. ౧౭౪.

వ. ఇట్లు పలికినమహీసురోత్తంసునకు సభక్తికంబుగా నయ్యిందువదనలందఱును బునః పునః ప్రణామంబు లాచరించి నీయట్టి హితబంధుండు గలుగుటంజేసికదా మా చెలియ కోరినకోర్కె లీడేరె నని పలుమరును వినుతులు గావించె నంత భోజభూపతిదేవి రుక్మిణిం దోడ్కొని యంతఃపురంబునకుఁ జని భూసురునివలనవినినవృత్తాంతంబంతయు మహీపతి కెఱింగించిన నతండునుం బ్రమోదభరితాంతరంగుం డగుచును మఱునాఁడు స్వయంవరాస్థానంబునకు సకలరాజలోకంబును వచ్చునట్లుగా నియమించి కుతూహలంబున నుండె ననిన శుకమహాయోగిం గనుంగొని యప్పరీక్షిన్మహీపాలుండు నవ్వలివృత్తాంతంబు నానతీయవలయునని యడిగిన. ౧౭౫.

మ. శ్రితరక్షైకపరాపరాపరసమ ◈ క్షేచూమహాత్మాసిని
ర్జితదైత్యప్రకరాకరాకరమహా ◈ ర్చిస్ఫారచక్రత్వరా
హృతనక్రప్రవరాదరాదరమహా ◈ గ్రీవాబ్ధిరాట్కన్యకా
రతికృత్కేళిధరాధరాధరభృతి ◈ ప్రౌఢప్రదాంభశ్చరా. ౧౭౬.

క. నాగేంద్రధ్వజసేనా, భోగమహావిపినహవ్య ◈ భుగ్దళ్గాలా
భాగవతసతతవినుతయ, శోగంగార్ఝురివిశాల ◈ శుభకృల్లీలా. ౧౭౭.

భుజంగప్రయాతము. సితాంఘ్రిప్రవాహావి ◈ శిష్టావనోహా
హతాత్మీయమోహావి ◈ హంగేంద్రవాహా
కృతానేకలీలాస ◈ ఖీభూతబాలా
ధృతోత్తుంగశైలాసు ◈ ధీబృందలోలా. ౧౭౮.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజనుతాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.

క. శ్రీరుచిరకీర్తిసాంద్రా, ఘోరతృణావర్తదనుజకుం ◆ జరదళనా
పారీంద్రానిర్వ్యాజ, స్మేరాననరుచివిశాల ◆ శ్రీగోపాలా. ౧.

వ. అవధరింపు మట్లడిగిన పరీక్షిన్నృపాలునకు శుకమహాయోగి యిట్లనియె. ౨.

క. రేపకడ రాకుమారులు, భూపాలనియుక్తులగుచు ◆ భూషణలీలా
రూపబలైశ్వర్యంబులు, చూపఱులకువిస్మయంబు ◆ సొంపాదవింపన్. ౩.

శా. రాజామాత్యులుతమ్మెదుర్కొనియథా ◆ ర్హప్రక్రియాచాతురిన్
బూజల్ సల్పస్వయంవరోత్సవనవ ◆ ప్రోద్భాసిపంచాగ్రవి
భ్రాజత్కాంచనరత్నపీఠములపై ◆ రాణింపఁగూర్చుండిరా
భోజాధీశతనూజరాకకుమనం ◆ బుల్ మున్నెదుర్కొల్పనన్. ౪.

ఉ. అంతకుమున్నభోజమను ◆ జాధిపుచెంతకు వేగఁజేరికా
ర్యాంతికులిప్పుడొక్కటధ ◆ రాధిపులెల్లస్వయంవరాంగణ
ప్రాంతముచేరవచ్చిరటు ◆ లంతికమయ్యెముహూర్తమింతయున్
గంతువిరోధిగేహినిస ◆ కౌతుకవృత్తిభజింపరాఁదగున్. ౫.

క. అని తెలుపమనుజనాథుఁడు, దనమనమున వేడ్కదనర ◆ ధాత్రీజనులన్
గని పెండ్లికూఁతుఁ జేయుఁడు, మనరుక్మిణినను చుఁబలుక ◆ ముదపతులెల్లన్. ౬.

క. పాటలుపాడుచుఁగుంకుమ, పాటీరనిశాదిదివ్య ◆ వస్తుప్రతతిన్
బాటలగంధులునలుఁగిడి, బోటికిజలకంబులార్చి ◆ భూషణవితతిన్. ౭.

గీ. తగనలంకృతఁగాఁ జేసి ◆ ధరణివిభున, కప్పుడెటిఁగింపనాతండు ◆ నంబుజాక్షి
హరుని దేవికిమ్రొక్కంగ ◆ ననుపవలయు, ననుచుమదినెంచిపరిచారి ◆ కాళిఁజూచి.

గీ. తగినవస్తువులొనఁగూర్చి ◆ తరళనయన, రాజశేఖరపత్నిని ◆ బూజసేయ
నిపుడెతోడ్కొనిపొండని ◆ నిపుణులైన, వారలనుగూర్చియనిచెన ◆ త్వరతమెఱయ.

క. అంతటఁ జెలులారుక్మిణి, చెంతకుఁజనితడవుసేయఁ ◆ జెల్లదు వేగన్
గంతురిపుపత్నిపూజకు, నింతీచనవలయుననఁగ ◆ నెంతేవేడ్కన్. ౧౦.

క. వేదండగమనయొక్కతె, కైదండయొసంగరూప ◆ కలనాసుమన
కోదండరమణిరుక్మిణి, గ్రామదండధరారినారి ◆ కర్మిలిమ్రొక్కన్. ౧౧.

గీ. ఇరుగడలఁజామరలు వైచు ♦ నిగురుఁబోండ్ల, కనకనవరత్నకంకణ ♦ క్వణనములకుఁ,
జరణయుగమంజుమంజీర ♦ సరసనినద, మెదురుకొననగరు వెడలె ♦ ముదితయపుడు.

వ. ఇవ్విధంబున నయ్యిందువదన మందమందగమనంబునఁ గక్ష్యాంతరంబులు గడచి యిరుగెలంకులఁ గరతలసజ్జీకృతవీజ్యమానధవళచామరంబు లాననపర్వేందుబింబ కళావిలాసంబుసొంపు సంపాదింప వేణీభరసంవేల్లితోత్ఫుల్లహల్లకమల్లికాదామ సంజనితసౌరభాలోలపుష్పంధయస్తనంధయనినాదంబులు మాత్సర్యంబున వెన్వెంటం దవులుమకరధ్వజధనుర్జ్యాఘోషం బని తలంచి భయంబున మరలిచూచు నెడఁ దిర్యక్ప్రసారితంబు లగుకటాక్షంబు లనునీలోత్పలశ్రేణులవలన నభిరామంబు లగు కేదారంబుల ననుకరించుప్రాంగణతలనిబద్ధనిశాకాంతకాంతమణిప్రభాపూరంబులఁ దొలంగి చనం గమకించుసఖీకదంబమంజుమంజీరనినాదంబులతోడ మల్లచఱచు పోషితమల్లికాక్షతల్లజక్రేంకారంబులతోఁగూడఁ గలయఁబర్వదర్శనోత్సుకజనోత్సారణసంభ్రాంతవేత్రిణీచలాచలకరాంబురుహభాస్వరమణికంకణఝుణఝుణత్కారసంగతావరోధవధూకటితటవిలంబిరశనాదామసముల్లసత్కింకిణీనిచయఘణాత్కారంబులతో నెనసి చెలంగుమాగధవైతాళికాంగనాగానానుకూలవేణువీణాక్వణనపల్లవితహర్మ్యతలస్తంభకిసలయగ్రాసాత్యుత్తమావార్యమాణపికానీకార్భటులకుం గయిదండ యొసంగఁ జాలువిప్రవనితలుం బాడుధవళంబులయులివును మంగళతూర్యనినాదంబులును భేరీప్రముఖవాద్యఘోషంబులును నెక్కుడై చెలంగ కలశపాథోరాశిమధ్యంబు వెలువడుసరోరుహగేహిని చాడ్పునఁ గాసారంబు నిర్గమించు రాయంచపోలిక హజారంబు వెల్వడి చతురంతయానం బధిరోహించి సౌధాగ్రంబులనుండి పుణ్యాంగనలు పెల్లు వెదచల్లుముత్తియంపు సేసప్రాలువలును నభస్స్థలంబున నున్నసుధాంధస్సీమంతినీనివహంబులు గురియుకుసుమవృష్టియు నీరంధ్రంబుగాఁ దొరఁగుచుండ మందమందగమనంబున మందాకినీధరగేహినిమందిరప్రాంతంబుఁ జేరి శిబికావతరణంబు గావించి హస్తపాదప్రక్షాళనం బాచరించి యొక్కబిబ్బోకవతి కరతలంబు నిజపాణిపంకేరుహంబునం గీలించి కతిపయాళిజనంబును వృద్ధబాడబాంగనలు మున్నుగా నడవం జని సర్వమంగళాసన్నిధానంబు సేరి పుష్పాంజలి యొసంగి ప్రణామం బాచరించి కేలు మొగిడ్చి వినయవినమితోత్తమాంగ యై యిట్లు వినుతింపం దొణంగె. ౧౩.

శ్లో. జయ శ్రీకంఠదయితే, జయ పుండ్రేక్షుధారిణీ
జయ లోకైకజనని, జయ కల్యాణి పార్వతీ. ౧౪.

వీరనృపసంఘహృదయాబ్జ ♦ విదళనప్రవ, ణసుమబాణసమ్మోహ ♦ విద్యయనఁగఁ
జెలులు వేవేలుతనవెంటఁ ♦ జేరికొలువ, శ్రీవిదర్భోత్తరుక్మిణీ ♦ దేవివెడలె. ౧౭.

క. ఈరీతివెడలియపుడా, నారీతిలకంబుమనుజ ♦ నాథులుదన్నున్
నూరెలనిలిచికనుంగొన, వారలవేర్వేఱఁదెలియ ♦ వలయునటంచున్. ౧౮.

క. తనమద్దినిగోరుచుండఁగ, జననాయకుఁడదియెతింగి ♦ సకలమహీభృ
జ్జననగుణరూపశీలము, లనువుగవచియించుదాని ♦ నచటికిఁబనిచెన్. ౧౯.

క. పనిచినయారసమంజరి, యనుభోజకుమారిఁజేరి ♦ యున్నతసింహా
సనములవసించురాజులఁ, గనుఁగొనివివరించితెలుపఁ ♦ గాఁదొడఁగుతఱిన్. ౨౦.

చ. బలిమినియేనిచైద్యునకు ♦ బాలనొసంగుదునంచునాత్మలోఁ
దలఁచుచురుక్మిచాపసము ♦ దంచితహస్తుఁడుతీవ్రసాయకో
జ్జ్వలితనిషంగుఁడున్గవచ ♦ సంవృతగాత్రుఁడునైముదంబునన్
జెలఁగుచురుక్మిణీసవిధ ♦ సీమవసించెనహంక్రియోద్ధతిన్. ౨౧.

ఉ. పంకజలోచనాశతము ♦ పార్శ్వయుగంబునరత్నఖేటకై
ణాంకకళావిలాససము ♦ దంచితచామరసత్కలాచికా
సాంకవముఖ్యచిహ్నములు ♦ సజ్జకమైకొనికొల్చియుండదూ
ర్వాంకమధూకమాలికఁగ ♦ రాబ్జమునధరియించివేడుకన్. ౨౨.

క. తరుణీమణియగురుక్మిణి, ధరణీపతిక్రమజంబుఁ ♦ దరళదృగిందీ
వరములసరములగప్పుచు, నరుదెంచెన్గోదమరాజ ♦ హంసియుఁబోలెన్. ౨౩.

క. అయ్యెడనలరసమంజరి, తొయ్యలికడఁజేరిజనప ♦ తులవేర్వేఱన్
నెయ్యముచతురతచెలిమియుఁ, దియ్యనదగువచనములకుఁ ♦ దెచ్చెన్వరుసన్. ౨౪.

క. పంచాస్త్రసమాకారుఁడు, సంచితపాండిత్యసత్య ♦ సరసాత్మకుఁడీ
పాంచాలుఁడులలనాజన, పాంచాలుఁడువీనిఁజూడు ♦ పంకేజముఖీ. ౨౫.

సీ. వీనిచక్కఁదనంబు ♦ వెరఁగంటికనఁగాదె, యనిమిషేక్షణలైరి ♦ యమరసతులు
వీనిప్రతాపంబుఁ ♦ బూనినిర్జింపంగ, గాదెస్వాహాసేత ♦ కడలిఁబడియె
వీనియౌదార్యంబు ♦ వినినంతటనెకాదె, సంతానవితతితపం ♦ చత్వమొందె
వీనిధైర్యవిభూతి ♦ వెలసినంతనకాదె, సౌవర్ణకుధరంబు ♦ చట్టఁపడియె
తరుణివీనిభుజాగ్రసం ♦ స్థానమహిమఁ, గాదెవసుమతియచలయై ♦ ప్రౌఢిగనియె
వీఁడుగుణరాశికల్లను ♦ వీడుచూడు, వేడ్కగలదేనివరియింపు ♦ వీనినబల. ౨౬.

గీ. ఇంతియీతండుకుండలా ♦ ధీశ్వరుండు, ప్రాక్కుధరశృంగమునఁదోఁచు ♦ భానుకరణిఁ
గనకసింహపీఠి వసించి ♦ కమలనయన, నిన్నుఁగనుచున్నవాఁడొత్త ♦ నెనరుదొరల.

క. కందళితశ్రీనిజభుజ, సందోహనివారితారి ♦ శార్వరుఁడీరా
ణ్ణందనుఁడు విబుధజనహరి, చందనుఁడు వరింపుమితని ♦ శచిహరిఁబోలెన్. ౨౮.

గీ. పంకజేక్షణ యీతండు ♦ పాండ్యనృపతి, కనకముక్తాకవాటసం ♦ కలితమగుచు
మహితగతి నొప్పుదక్షిణ ♦ మధుర నేలు, మేటిలేరెందునీతని ♦ సాటిదొరలు. ౨౯.

ఉ. ఎంతటిభాగ్యశాలియితఁ ♦ డెంచఁగ వేరకుమారికాతటీ
సంతతవిస్ఫురత్ఫలవి ♦ శాలరసాలమహీరుహావళీ
ప్రాంతవిహారహారిశుక ♦ రాజమరాళసమగ్రశారికా
సంతతగీతికాశ్రవణ ♦ సాదరుఁడై విహరించు నెప్పుడున్. ౩౦.

క. ఇతని వరియించు వేడుక, సతి నీమదిఁ గలుగునేని ♦ సమకూరుదివ
స్పతితోడివిహృతిరుచికిన్, జతగూడినరీతి వీని ♦ సహవిహరణముల్. ౩౧.

పంచచామరము. స్మరుండు రూపసంపదన్ ద్వి ♦ షద్విశోషణక్రియా
హరుండు కిన్నరుండు గీతి ♦ కాఖిరూప్యచాతురిన్
వరాటనీనివారితారి ♦ వర్గుఁడై చెలంగునీ
మరాటభూవిభుండు కంటె ♦ మానినీశిరోమణీ. ౩౨.

శా. భద్రేభంబులఁ గూల్చుసింగము గతిన్ ♦ బ్రత్యర్థిభూపాలురన్
రౌద్రోల్లాసవిలాసముల్ మెఱయఁబో ♦ రంగెల్చి నానాదిగ
త్క్షుద్రశ్రీలకు నాటపట్టగుచుఁ బో ♦ ల్చున్ వాసవుండో యనన్
మద్రాధీశుఁడితండు చూచితివె శ్రీ ♦ మద్రాజబింబాననా. ౩౩.

స్రగ్ధర. పూరించున్ దానవారిన్ ♦ భువనవిలయకృ ♦ ద్ఘూరదావానలశ్రీ
ఘోరంధర్యప్రకర్ష ♦ స్ఫుటితవిమత ♦ స్థానదివ్యన్మహాప్రా
గ్భారాత్యంతప్రశుష్య ♦ ద్బహుజలనిధులన్ ♦ బల్మియున్ దివ్యలెంచన్
సౌరాష్ట్రాధీశ్వరుండన్ ♦ జనపతిసకలా ♦ శ్చర్యచర్యానుషక్తిన్. ౩౪.

క. ఆసుమచాఁపుడు వివిధో, ల్లాసమ్ములు మెఱయముంగ ♦ లనిలిచెననఁగన్
భాసిల్లుచున్నవాఁడీ, కోసలపతి యితనిఁ జూడు ♦ కువలయనయనా. ౩౫.

లయగ్రాహి.

అంగనరపాలుఁడితఁ ♦ డంగనకనుంగొనుమ, నంగుఁడు వరాకృతిఁ బ ♦ తంగుఁడురుదీప్తిన్
జంగమసుమేరువుభు ♦ జంగమకులాధిపుఁడ, భంగురకళావిభవ ♦ సంగతిగణింపన్

ముంగిటినిధానముత ◆ నుంగనినుతించుకవి, పుంగవులకుఁ గోదమ ◆ సింగమనియెంచుఁ
సంగరమహీతలము ◆ నంగినియుశాత్రవకు, రంగములు వీనిదౌర ◆ యంగలరెయన్యుల్.

మత్తకోకిల. భాసురాత్తయశోవిశాలవి ◆ పాండురాబ్జనివాసనో
ల్లాసబంధురబంభరార్భక ◆ లక్షితాంబరమండలుం
డాసితాచలచందనాచల ◆ హారిసద్గుణధుర్యుఁడీ
కోసలావనిభర్తమత్తచ ◆ కోరలోచనచూచితే. ౩౭.

తరళ. జగతినద్భుతచండకౌశిక ◆ సంయమీశ్వరసత్కృపా
నుగతినార్జితవిక్రమోదయ ◆ నూత్నవైభవభాస్వరుం
డగణితోజ్జ్వలతేజుఁడైతన ◆ రాజుచుండుమహోన్నతిన్
మగధభూతలనాథుఁడీతఁడు ◆ మత్తసింధురగామినీ. ౩౮.

సీ. పశుపతియాగార్థ ◆ బంధితానేకదు, ష్పాదనానృపతిసం ◆ దానుఁడితఁడు
ప్రబలభుజాక్షిప్త ◆ పటుగదావినిపాత, చకితమాఘురజన ◆ స్వాంతుఁడితఁడు
సమరపరాభూత ◆ శౌరిపరిగ్రాహి, తాపూర్ణజలనిధి ◆ ద్వీపుఁడితఁడు
సంతతవితరణా ◆ శంసికేతనసవ్య, నిజనికేతనగిరి ◆ వ్రజుఁడితండు
తరుణిసామాన్యుఁడెయితండు ◆ తరణితనయ, విస్తృతనియుద్ధచాతుర్య ◆ విభవజనిత
హర్షతదధీనకృతచతు ◆ రంగసంఘ, మేదురితమాలినీపుట ◆ భేదనుండు. ౩౯.

క. మంజులవచనమ్ములరస, మంజరియీరీతినృపకు ◆ మారులగుణసా
మంజస్యముబహువృత్తము, లుంజతురతమీఱఁగాఁదె ◆ లుపుచునువరుసన్. ౪౦.

క. హృద్యానవద్యభూషా, ప్రద్యోతితభూనభోంత ◆ రాళుండగున
చ్చైద్యన్నృపాలునిఁజూపుచు, మాద్యత్పరభృతనినాద ◆ మధురిమననియెన్. ౪౧.

శా. ఖద్యోతంబులుతిగ్మరశ్మియెదుటం ◆ గన్పట్టఁగాలేనియ
ట్లుద్ద్యోతంబగునేతదుద్ధతమహో ◆ వ్యూహానలజ్వాలికా
పద్యన్మాద్యదరివ్రజంబుకలభ ◆ ప్రాయంబగున్జిత్రమీ
చైద్యక్ష్మాతలవల్లభుండుతలఁపన్ ◆ సామాన్యుఁడేరుక్మిణీ. ౪౨.

క. అనిపలుకుచెలియమాటల, ననాదరమొనర్చితరుణి ◆ యవ్వలికరుగన్
మనమున నెంచుటయింగిత, మునఁదెలియుచుదుక్కిగదిసి ◆ ముదితకుననియెన్. ౪౩.

గీ. నెలఁతయీతండుసామాన్య ◆ నృపతియనుచు, నీమదిఁదలంపకుముభుజో ◆ న్నిద్రభద్ర
విక్రమక్రమనిర్ధూత ◆ విమతధరణి, పాలుఁడనఁగ్రీఁగనుశిశు ◆ పాలుఁడబల. ౪౪.

సీ. కంబుకంఠమువాఁడు ♦ కమనీయరమణీయ, చారుశోభనకటా ♦ క్షములవాఁడు
మొలకనవ్వులవాఁడు ♦ మురిపెంపుటరిపెంపు, గరిసించుబాహాయు ♦ గంబువాఁడు
నిడుదకన్నులవాఁడు ♦ జడిదంపుటడిదంపుఁ, దళుకుమైమెరుపునఁ ♦ గలుగువాఁడు
తళుకుఁజెక్కులవాఁడు ♦ వెలిదమ్మివెలిఁజిమ్మి, యలరారుకీర్తుల ♦ వెలయువాఁడు
కాంచనధరాధరాధిత్య ♦ కావిభాస, మానబాలారుణాతప ♦ మసృణఘుసృణ
పంకసంకీర్ణలసదురో ♦ భాగలిప్త, చందనుండింతిసాత్త్వతీ ♦ నందనుండు. ౪౫.

తరళ. ఉదుటుమీఅధరాధరంబున ♦ నుండిదండిమగంటిమిన్
గొదమసింగమువచ్చునోజన ♦ కుంఠతేజుఁడితండురా
యదుకుమారులువీనిఁగాంచిమ్ర ♦ గార్భకంబులచొప్పునన్
బెదరినల్లడఁబాఱుచుందురు ♦ భీతబాలమృగేక్షణా. ౪౬.

మ. అరవిందాహితపుత్రికాతటయుగ ♦ ప్రాంచన్మహోద్యానభా
స్వరమాకందతమాలతాళబదరీ ♦ జంబీరనారంగకే
సరముఖ్యద్రుమపల్లవప్రసవగు ♦ చ్ఛస్ఫారమాహిష్మతీ
పురసామ్రాజ్యరమాధురంధరుఁడుపూఁ ♦ బోఁడీయితండెన్నఁగన్. ౪౭.

మ. సఖులైవీనియెడన్సుయోధనజరా ♦ సంధాదిధాత్రీపతుల్
సుఖులైయొప్పుచునున్నవారనుటసే ♦ చోద్యంబువృత్రద్విష
న్ముఖబర్హిర్ముఖులైనమిత్రులయియా ♦ మోదంబుసంధిల్లఁగా
నఖిలాశాపరిపాలనస్ఫుటనిజ ♦ వ్యాపారులైయుండఁగన్. ౪౮.

గీ. నయముభయమునుదోఁపను ♦ నయములాడు, మాటలకునవ్వఘూటిలో ♦ గాటమగుచు
చింతవలవంతయంతంత ♦ చిగురులొత్త, తత్తఱముతోయదూత్తముఁ ♦ దలఁచియనియె.

సీ. నీదుపేరురముపై ♦ నివసింపనేనేమి, కలశాబ్ధికన్యనా ♦ కమలనాభ
నినుఁజిన్ననాఁడెపెం ♦ డిలియాడనేనేమి, నీలావధూటినా ♦ నీరజాక్ష
నీయంకతలమున ♦ నెక్కొననేనేమి, రాధావధూటినా ♦ రాజసింహ
నినుఁగూడిపండువె ♦ న్నెలనాడనేనేమి, గోపాలబాలనా ♦ గుణనిధాన
యేలననుఁగోరివచ్చెద ♦ విటకుఁగృష్ణ, యేలననుబాళిఁజేకొందు ♦ విపుడురమణ
యేలననుఁగౌఁగిటఁగదింతు ♦ విపుడుశౌరి, యేలనానోఁచునోములీ ♦ డేర్తువధిప.

క. బ్రహ్మణ్యుఁడుగోవిందుఁడు, బ్రాహ్మణవచనములకొండు ♦ బాటింపఁడునా
బ్రహ్మర్షులచేవిందుము, బ్రాహ్మణుపలుకిట్టులేల ♦ రాయిడిఁబెట్టన్. ౫౧.

వ. అని బహుప్రకారంబులం దలంచుచు నచ్చంచలేక్షణయు దంచితవిరహదవదహన దోదూయమానమానస యగుచు నుండియు నండజగమనలతోడ నెప్పటియట్లన నగుచు సహజదరహాసకందళతుందిలామందమందాక్షసంకుచితనిజావలోకనమ్ముల రాకుమారులు ధైర్యమ్ములు వదలియును మోహాతిరేకంబునం బొదలియును గాంభీర్యంబులు విడిచియును గౌరవంబులు మఱచియును బిరుదమ్ము లుడిగియును నరదమ్ములు డిగియును నాయుధమ్ములు వైచియును నాయాసమ్ములు పైఁచియును సేయునది లేక కుసుమసాయకుని ధాటకు జకాకువడి జంత్రపుంబ్రతిమలవిధంబున నప్రతిమమమతాశయంబునం గనుంగొన వారలం జేరికిం గొనక కనకవసనుండు రాఁడో కో యను తలంపున నెల్లపెసలం గనుంగొను చున్న సమయంబున. ౫౨.

సీ. ముంగలనతిఘోర ♦ లాంగలాయుధమహో, ద్దండుఁడై తాళధ్వ ♦ జుండునడవ
నూరెలవీరాది ♦ వీరప్రైస్సాత్యకి, ప్రముఖానుజన్ములు ♦ బలసినడవ
వెన్నంటిబలులింక ♦ వృష్ణ్యంధకానేక, బాంధవస్తోమంబు ♦ ప్రబలినడవ
నవలసంరక్షకుఁ ♦ డైయుగ్రసేనుండు, చతురంగబలసము ♦ ద్ధతులనడవఁ
బణవఢక్కాహుడుక్కాది ♦ బహుళవాద్య, ఘోషములవైన్యపతుల ♦ గుండెలద్రవఁ
గేసరికిశోరవిక్రమో ♦ ల్లాసహరి, శౌరినళినాక్షియెదుటసా ♦ క్షాత్కరించె. ౫౩.

చ. ఉదుటుననిట్టులయ్యదుకు ♦ లోద్వహుఁడద్భుతభంగిఁదోఁచియ
మ్మదవదరాతిభూపతుల ♦ మానసముల్ కడుతల్లడిల్లబె
ట్టిదముగసింహనాదముక ♦ దిండిమగంటిమిసంఘటించియ
మ్మదవతిఁజూచెలేనగవు ♦ మన్ననయుందళుకొత్తనత్తఱిన్. ౫౪.

క. సతియునుజూచెన్ యదుకుల, పతినపుడుధృగంచలముల ♦ బాలికఁజూచెన్
బతియునునిదిగనిడగ్గఱి, రతిపతితనతూణయుగము ♦ గ్రక్కునఁజూచెన్. ౫౫.

సీ. పాంచజన్యశ్రీల ♦ పరిచయంబునఁబోలెఁ, గంఠంబుమీఁదను ♦ తక్కంఠ నెరపు
నందకవినిహితా ♦ నందంబునంబోలెఁ, గటికినూఁగారుపైఁ ♦ జెలిమి నెరపు
శార్ఙ్గశరాసల ♦ స్తకమైత్రిచేఁబోలె, యరిదిలేఁగౌనుపై ♦ నాస నెరపుఁ
జక్రసంఘరణవీ ♦ క్షాధురీణతవోలె, కటిమండలంబుపైఁ ♦ గాంక్ష నెరపు
నెరపుగలమేనిజిగిపేరి ♦ యుదధిదుమికి, యూరుకదలియుగముబట్టి ♦ యోలలాడు
కంబుకంఠరసకలాంగ ♦ కంబులందు, మురహరునిచూడ్కి చుట్టాల ♦ సురభిమాడ్కి.

క. తొలుతొలుతయ్యదుకులేంద్రుని, యలరుంజూపులులతాంగి ♦ యాననసీమన్
నిలిచెఁగుసుమాస్త్రశబ్బరునియు, రులనఁదగుకురులఁదగిలి ♦ యుండెననంగన్. ౫౭.

ఉ. క్రందొనరించుమాగధము ♦ ఖక్షితిపాలసహాయసాత్యకీ
నందనసూరిభూషణక ♦ నత్కనకచ్యుతిదస్సియుండఁగో
విందముఖారవిందమొక ♦ విందునుటించెమ్ము గేక్షణేక్షణేం
దిందిరపాళికిం బ్రియము ♦ నెక్కొనహాసమరంద ధారలన్. ౫౮.

ఉ. కోమలిమోడ్కు లక్ష్మియుఁగ ♦ కోటరముద్దిగనాడిసంభ్రమో
ద్దామగరుచ్ఛలందనరు ♦ తప్తసుభద్రకకర్ణపత్రముల్
భూమికిఁ బ్రాలఁగ్రొన్నిముఖ ♦ పూర్ణశశిద్యుతిఁ గ్రోలిక్రోలిబల్
ప్రేముడిమర్లునమ్మరుని ♦ పెంపుడువెన్నెలపుల్గులోయనన్. ౫౯.

గీ. నాతితమిఁ జూపుచూపుల ♦ న్నలిననయను, రకపుఁజూపులఁ దాసిసా ♦ రెకనుమరలు
నతనిమది బ్రేమఁ దనవారి ♦ నడిగియడిగి, తెలిసిక్రమ్మతిలలవకుఁ ♦ దెలుపనఁజేఁగ.

శా. బాలారత్నము చూపులన్ గమలనా ♦ భప్రౌఢదృష్టుల్ సము
ద్వేలప్రేమపరస్పరాస్పదములై ♦ దీపించుచున్ గేళినీ
హేలావత్యవతంససూనశరభా ♦ గిందీవరేందీవర
శ్రీలన్ చాలఁ జెలంగెసర్వభువన ♦ క్షేమంకరస్ఫూర్తితోన్. ౬౧.

ఉ. అంతమురాంతకుండు గడు ♦ నగ్గలికన్ దగుదిగ్గజంబునా
వింతహొయల్ సెలంగనట ♦ వేగమెపత్నిని చెంతఁ జేరియా
వంతయుఁ గొంకులేకనలి ♦ నాననవానన టింపఁజేయ నేఁ
డింతయు దేలసిగ్గనుచు ♦ నెత్తిరథంబుననిల్పెఁ బొల్పుగన్. ౬౨.

వ. ఇత్తెఱంగున మెఱుంగు నపహరించువలాహకంబుచందంబునం బునఃపునరాలోక
నోత్పాదితసితాంభోజవన్య యగుభోజకన్యను బ్రతిపాదితనిజమనోరథం బగు
రథంబున నధిరూఢం గావించుకొని హసితరుచిదళితకుందుం డగుముకుందుండు
నిజభుజవిక్రమక్రమోద్రేకంబది లోకంబున కసహ్యంబుగా నభంగసంగరక్రియా
కౌశలకృతవర్మ యగుకృతవర్మయు దళితపరనాయకసాయకక్షోభితాన్యదానుం
డగుయుయుధానుండును ముసలహలసంఘాతభీతదితిజాతవిలోకనప్రవర్ధమానబల
దేవుం డగుబలదేవుండును వెంట నంటి రా వివిధవిహారసమగ్రజాగ్రదుగ్రసేనుం
డగు నుగ్రసేనుండును బరిపంథినిర్వాపణక్రూరుం డగునక్రూరుండును నిరుగెలంకులం
బలసి నడువ విడువనిచలంబున బలంబున కగ్రభాగంబునఁ బ్రతిపాదితధనుర్వేద
పరాయణు లగునారాయణగోపాలురు చనుదేర ద్వారకాభిముఖుండై పోవు
నవసరంబునం గనలి నళినబాంధవకరప్రకరసమశరనికరశోషితవిపక్షసేనాసిం

ధుండును సమధికగంధుండును మదాంధుండును యాచకాభీష్టదానసంఘటిత మహాసంధుండును నగుజరాసంధుండును విపక్షశిక్షకచాపవిద్యావైశద్యుం డగు చైద్యుండును ముహుర్ముహుఃకథితనిజబిరుదకథోదంతవక్త్రుం డగుదంతవక్త్రుం డును ద్విషత్సముత్పాదితభయవిదూరుం డగువిదూరుండును విమతసమాసమా హామరీచికానిషేషణఖల్వుం డగుసాళ్వుండును స్వకీయదోస్సారనిర్ధాటితమహాపౌం డ్రుం డగుపౌండ్రుండును గూడుకొని పిచండిలగండమండలప్రవన్మదధారా విభ్రమదభ్రవిమరప్రభాసందోహంబు దేహంబు కాంతులతో నంబరంబునం బర్వ దుర్విషహంబు లగుఘనాఘనంబుల ననుకరింపఁ దద్గతవిద్యుల్లతావితానంబు భంగి నరుణధాతుకేతుమణికాంతు లుల్లసిల్ల నిబిడశరశీకరంబు లాసారంబుగా బృంహితంబు లనుగర్జల నూర్జితంబు లగుచు వర్షాదినంబులఁగండు మెండుకొన వేదండంబులును ఖచితకాంచనబింబసుందరంబు లగునీషాదండంబులును సుకల్పిత కూబరాక్షవరూథంబులును గేతనవిద్యోతమానంబులును గింకిణీజాలాభిరామం బులును నీశావిశేషంబులం బరిణతంబు లగుచు మనోమారుతజవంబుల నపహసించు యుగ్యంబులుం దనరి వైయాఘ్రచర్మసంవృతంబు లగుచు జంగమంబు లగుధరా ధరంబుల ననుకరించునరదంబులును బహువిధంబు లగువర్ణంబులును గుఱుచ లగుకర్ణంబులునుం గలిగి సింధుపారసికకాంభోజారట్టబాహ్లీకదేశసంభవంబు లగుతురంగంబులును నయోమయంబులును బహువిధంబు లగువర్మంబులుం గలిగిపరిఘ పట్టిసప్రాసగదాముసలముద్గరకరవాలశూలభిండివాలశక్తితోమరకుంతక్షురికాదిసా ధనంబులం బూని యుద్భటాటోపదీపితు లగుపదాతులునుం బరివేష్టింప నిలింపకోటి కద్భుతం బగుపరాక్రమాతిశయంబునం దనరి జ్యాఘోషంబులును శంఖనిస్వనంబులును సింహనాదంబులును నాస్ఫోదితక్ష్వేళితంబులును భేరీపటహ మృదంగడిండిమగోముఖకాహళాదివాదిత్రనాదంబులును భూనభోంతరంబుల నిండ యాదవవాహినీసముదయంబుల వెన్నాడి నడుచు నవసరంబున స్వసహజాపహరణ జనితాతిరోషాకులస్వాంతుండును శూరాభిమానియు నగురుక్మి సముత్తుంగమాతంగ తురంగశతాంగసంగతు లగుచు రుక్మబాహుప్రముఖు లగుతమ్ములు పరివేష్టింప సజ్జీకృత శరాసనుం డగుచు జరాసంధప్రముఖులం దలకడచి ఘోరంబుగా శరాసారంబుల వృష్ణిబలసంతానంబులం గప్పుచు నడరునతనియురు గెలంకులఁ బశ్చాద్భాగంబున శిశుపాలమాగధప్రభృతులు బరవసంబు చేసిన హలాయుధుండు కనలి జనవాయ కులం గనుంగొని సర్వతోభద్రవ్యూహంబు సంఘటించి యుండు వలవటుఁ జేకితాన

సహితుండై సాత్యకియునుం దాపటం గృతవర్మయును బూర్వభాగంబున నుగ్రసేనుం డును బశ్చాద్భాగంబున నక్రూరుండును నారాయణగోపాలపురస్సరంబుగా గరుడకేతనాభిరామంబును సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహక నామతురంగశోభి తంబు నగురథంబున శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గాది దివ్యసాధనసమన్వితుండై మధ్య భాగంబునం బుండరీకాక్షుండును నిలిచిరి. హలముసలమండితబాహుదండుండును నీలాంబరుండును దాళకేతనవిరాజమానరథుండును నగుచు బలియు నగ్రభాగంబునం బన్ని నిజానీకంబులతోడం జేర్చి యెదిర్చి నడచెం. ౯౩.

సీ. శరగరుత్సంభూత ♦ జంఝానిలంబుల, సంక్షోభితంబయ్యె ♦ జగతియెల్ల
భూరిభేరీరవం ♦ బులఁగులాచలగుహా, సంఘాతములు ప్రతి ♦ స్వనములీనెఁ
గంఖాణబృందరిం ♦ ఖాఘట్టనంబుల, క్షోణీతలంబెల్లఁ ♦ జూర్ణమయ్యె
మత్తమాతంగస ♦ మగ్రయానంబుల, ఫణినాయకుఁడుఫణా ♦ పటలిముడిచె
దిక్కులెల్లవివర్ణతా ♦ ధీనమయ్యెఁ, జండభానునికిరణముల్ ♦ సాగవయ్యె
జాతరోషజరాసంధ ♦ చైద్యవృష్ణి, ధారుణీశచమూసము ♦ ద్ధతినపుడు. ౯౪.

క. అడరెడుకినుకనుగన్నులఁ, బొడమెడుసాంద్రారుణాంశు ♦ పుంజమ్ములఁచి
త్కడునవనవాస్త్రధారల, కడుగనితోడవయ్యెబలము ♦ లొక్కటఁగదియన్.

చ. ఖరకరుఁగప్పుచున్ బలయు ♦ గంబునయోధులు క్రోశమాత్రయా
ధరఁజతురంగముల్ చదియ ♦ దారుణబాణములన్ నిగుడ్చుచోఁ
గరితురగాశ్వసద్భటని ♦ కాయముకొండహత్తిన్ నిజారితో
బెరయకమున్నెకూలెసుర ♦ బృందములచ్చెరువందిచూడఁగన్ ౯౫.

క. తమకించిబలములొక్కట, సమరముఖంబుననుగూలు ♦ చతురంగములన్
సముదగ్రోద్రేకించుచును, విమతులపైనడరెఁగ్రోధ ♦ వివశంబులుగన్. ౯౬.

సీ. అరుణలోచనదీప్త ♦ లాత్తగాత్రాసక్తి, సిందూరరుచులతోఁ ♦ జెలిమిసేయ
ఘంటానినాదముల్ ♦ కంఠాంతరోత్థిత, బృంహితధ్వనులతో ♦ బెరసినిగుడఁ
గరవలన్నిగళని ♦ ర్ఝరనీలరోచులు, చలదలిపటలితో ♦ నెలవుకొనఁగ
నిజకేతుపటపట ♦ నినదమాధోరణా, స్ఫాలనధ్వనితోడ ♦ సరసమాడఁ
దోమరాంకుశహతులకుఁ ♦ దూలిపోక, జోదులొక్కటఁగొల్వను ♦ న్మాదవృత్తి
బరబలావలులొండొండ ♦ బడలుపడఁగ, దంతిసంఘంబులడరెను ♦ ద్దండవృత్తిఁ.

మ. ఖురవిక్షుణ్ణధరాపరాగములది ♦ క్కుల్ మిన్నునేకంబుగాఁ
గరయాద్ధత్యముచేతఁబల్లటిలిసం ♦ గ్రామంబుసాలింపుచున్

బరసేనాశ్వికకోటిబెట్టొనుఁగఁ శుం ♦ భద్విక్రమాటోపతన్
బరఁగెన్ సాదిమనోజ్ఞవృత్తములన ♦ శ్వంబుల్ రణక్రీడలన్. ౬౯.

సీ. రత్నధ్వజంబుల ♦ రమణీయకాంతులు, రథికభూషణదీప్తి ♦ రహివహింప
ఘోరనేమిస్వన ♦ బులుశరోత్సర్జన, శింజినీరవములఁ ♦ జెనసిమిగుల
వివిధాయుధంబుల ♦ నవనవదీప్తులు, మాణిక్యమకుటాంశు ♦ మహిమమీఱ
రథ్యఖురాఘాత ♦ రవము సారథిముఖో, ద్భూతంబులగునద ♦ ల్పులుఁజెలంగ
నాత్తసంస్థితయోధశ ♦ రాసనోత్థ, బహుశరాసారములశత్రు ♦ బలము లెల్లఁ
జెల్లగిల్లఁగ నెల్లెడఁ ♦ బృథులరథస, తుములముగఁదేరులడరెను ♦ ధురతనిగుడ.

శా. మోదంబాత్మఁ జెనంగొనన్ రిపుచమూ ♦ ముఖ్యుల్ నిజాస్త్రాహతిన్
ఖేదంబందిధరిత్రిపైఁబడఁగసం ♦ కీర్ణాత్మబాహాబల
క్షోదీభూతశతాంగఘోటకకరి ♦ స్తోమంబుగా నెల్లెడన్
బాదాతంబడరెన్ మహోదధికగా ♦ పారీణసంచారమై. ౭౦.

సీ. చరణఘాతమ్ములఁ ♦ జదిపిరథ్యమ్ములఁ, గరముల నొగలుచి ♦ క్కొకుచేసి
దంతఘట్టనముల ♦ ధరసారథులఁ దూల్చి, పృథుగండనిహతుల ♦ రథులఁగూల్చి
రథములఁద్రుంచితు ♦ రంగంబులను గెంటి, వాలంబులూడిసిదు ♦ ర్వారలీల
సాములతోడర ♦ సాస్థలిఁద్రవేసియు, నంబరంబునకెగ ♦ యంగమీటి
సమయఁజేసిపదాతుల ♦ గములభయద, దారుణోద్భటశృంఖలో ♦ ద్దాత్తవిహర
ణమ్ములంగీటడంచిజ ♦ న్యంబుపలిపెఁ, ద్వరితగతిమీఱసైన్యమా ♦ తంగసమితి. ౭౧.

సీ. నారాచహతులదం ♦ తములెల్లనుగ్గాడి, భల్లంబులనుగర ♦ పజ్క్తిఁదునిమి
యర్ధచంద్రంబుల ♦ నగలించికుంభముల్, క్షురములఁబాదముల్ ♦ నఱికికరుల
భంజించిహయముల ♦ పైఁజనియంజలి, కమ్ములకందముల్ ♦ దుమ్ముచేసి
కూర్చనఖంబులఁ ♦ గుదియించిచంపిరి, రౌతులతోడతు ♦ రగ్రహతుల
వాజులవధించికర్ణవి ♦ పాతపత్స, దంతనాళీకములనుబా ♦ దాతములను
గేరినుగ్గాడిరొండొండ ♦ కెరలియుభయ, సైన్యరథికోత్తములుబాహు ♦ సారమునను.

మ. కరుల్లంగిట్టనిసాదివర్గములతో ♦ ఖండించియుగ్యాక్షకూ
బరసూతధ్వజపాళితో రథములన్ ♦ భంజించినానాయుధో
త్కరసన్నద్ధపదాతివర్గములవీఁ ♦ కం ద్రుంచిరొక్కుమ్మడిం
దురగశ్రేణులనూఁకియాశ్వికవరుల్ ♦ దోర్గర్వమొప్పారఁగన్. ౭౪

సీ. ముసలశక్త్యష్టుల ♦ వెసరథంబులఁగిట్టి, పండిపిచంబుగా ♦ వించువారు
కరవాలశూలము ♦ ద్గరకుఠారంబుల, వారణఘటలను ♦ ద్రవ్వువారు
ప్రాసతోమరకుంత ♦ పట్టిసశ్రేణులఁ, దురగసంఘాతమ్ముఁ ♦ దున్మువారు
చాపనిర్ముక్తోర్థ ♦ చంద్రనాళీకాంజ, లికవిపాంతుర ♦ నికరములను
బఱపియిడియదియనకయే ♦ పౌఁజులైనఁ, జొచ్చి చెండాడిశూరులు ♦ పిచ్చలింప
బాహుబలదర్పములఁజాలఁ ♦ బరఁగువారు, రణ మొనర్చిరియోధవీ ♦ రవ్రజంబు. ౨౫.

ఉ. ఒక్కఁడుపల్వురందొడరి ♦ యొర్చియునొచ్చియుఁబల్వురొక్కనిన్
మిక్కిలిగొంపఁబాతియును ♦ మేకొనినిల్చిసహాయవృత్తిచే
నక్కడనిక్కడందొలుత ♦ నందినకయ్యపువారుగుంపులై
పెక్కుతెఱంగులన్దొడరి ♦ భీకరగర్జలఁబోరిరత్తఱిన్. ౨౬.

చ. కరముఁగరమ్ముతోఁ బెనచి ♦ గాఢరదక్షతఁగుంభమౌక్తికో
త్కరములురాలఁదోమరని ♦ పాతములంబయిమూఁతుల్పర
స్పరమును నొంచుచున్ధరణిఁ ♦ బడ్డనువీడనిరోషవృత్తిచేఁ
గరులు పెనంగెఁదద్బలము ♦ గంబునదారుణవిక్రమంబునన్. ౨౭.

సీ. తను నొవ్వ నేయునా ♦ తనిఁగూడ నొంచుచు, నిరువురుమూర్ఛల ♦ నొరఁగువారు
హయసారథులఁజంపు ♦ నతనినట్లనచేసి, కొంచకధరికులం ♦ ఘించువారు
దారుణాస్త్రాహతిఁ ♦ దమమూర్ఛనొందింప, లేచియట్లనెవాని ♦ నేఁచువారు
ఒకరిచే నొక్కరు ♦ వికలాయుధత్వంబు, చెందినియుద్ధంబు ♦ చేయువారు
చెలులుబంధులుపగరచేఁ ♦ జిక్కువారి, కై పెనంగుచుమరణంబు ♦ గాంచువారు
నైబలద్వయరథికుల ♦ నల్పధైర్య, మెచ్చఁగాఁబోరిరమరులు ♦ పిచ్చలింప. ౨౮.

సీ. కరవాలహతులను ♦ గడికండలుగఁజేసి, రూపుమాపియునతి ♦ క్రూరవృత్తి
డొంకెనవాట్లనా ♦ టోపంబుసడలంగ, సమయించియునుశక్తి ♦ సంహతులను
గుండెలుపగులంగ ♦ గ్రుచ్చియెత్తియుఁదోమ, రమ్ములుపైచిమ్మి ♦ రమ్ముతెడల
గుండెలుపగులంగ ♦ గ్రుచ్చియెత్తియుఁదోమ, రమ్ములువైచిమ్మి ♦ రమ్ముతెడల
గెడపియునబళంబు ♦ లెడనెడఁబరఁగించి, ధరఁబడఁజేసియుఁ ♦ దరతంరబు
కలుపటంపరలేసిన ♦ క్షణకరోరు, కంఠముఖాఙ్గకమ్ములు ♦ తుటముగాఁగఁ
ద్రుంచివైచియునాశ్వికుల్ ♦ రోషమగ్ను, లైచలంబునఁబోరిరి ♦ యందునిందు.

చ. గదగదశక్తిశక్తిపరిఘన్బరి ♦ ఘంబునుగాఁగఁగైదువుల్
పొదువుచునొందుతో నొకట ♦ భూరికృశానుకణంబులొప్పఁగాఁ

జగల మెఱుంగులుప్పతిల ♦ సాంద్రశరాహతి నెత్తురొల్కఁగాఁ
దదపసరంబునన్వడిఁబ ♦ దాతులుపోరిరివిక్రమంబునన్. ౮౦.

సీ. కూలురథంబులు ♦ సోలుసారథులును, బొడియగుచక్రముల్ ♦ కెడనురథులు
వమ్మైనకేతువుల్ ♦ వ్రయ్యలౌకుంభముల్, సమసెడిజోదులు ♦ చచ్చుకరులు
తెగినమేల్వాగెలు ♦ పగిలినమోరలు, సురఁగెడుసాదులు ♦ తొరఁగుహరులు
చిమురుపలాకొల్లు ♦ ఛిన్నంబులౌవ్రేళ్లు, నుగ్గైనకైదువుల్ ♦ మ్రగ్గుధటులు
నయ్యుసైన్యంబులందుసా♦హసముమీఱ, యోధులొండొరుతోఁబోర♦నుగ్రభంగి
రౌద్రబీభత్ససాధ్వస ♦ రసములేక, మైశరీరంబుదాల్చిన ♦ యట్టులుండె. ౮౧.

మ. గురుచాపప్రవిముక్తదారుణశర ♦ క్రూరాహతిన్ద్విట్చ్రమూ
కరపాదోరుశిరఃకపోలకటిము ♦ ఖ్యాంగంబులింతింతలై
నురుమైపోవఁగఁజేయుచున్భుజబలా ♦ నూనప్రభావంబుతోఁ
బరపెన్సాత్యకితేరుచైద్యునిపయిన్ ♦ భ్రామ్యద్గుణారావుఁడై. ౮౨.

లయగ్రాహి.

లాంగలఘనాహతుల ♦ నంగములుప్రీలిరిపు
పుంగవులుధాత్రిఁబడి ♦ త్రుంగమునలంబున్
సంగతముసేయుచున ♦ భంగురగతింగలిసి
సింగపుఁగడంకమెయి ♦ సంగరములోమా
తంగములఁగూల్చియుఁశ ♦ తాంగములరాల్చియదు
రంగములవ్రేల్చియుఁబ ♦ తంగుఁడనదీప్తిన్
బొంగుచునుమాగధుప ♦ యింగవిసరేవతీభు
జంగుఁడెవీరుఁడన ♦ ముంగురియుమీఁకన్. ౮౩.

మ. శితనారాచపరంపరానిహతులన్ ♦ ఛిన్నంబులైశత్రుసం
తతులత్యంతభయంబుతోఁదొలఁగనా ♦ నాహేతిఘోరాహవో
ద్గతబాహావిభవంబుచూపఁజవిం ♦ తల్ సేయఁగా సాత్వపైఁ
గృతవర్మండుగడంగెయాదవచమూ ♦ క్షేమంకరారంభియై. ౮౪.

శా. చక్రోద్యన్నినదంబుగర్జగనా ♦ శాత్రేణులంబర్వని
ర్వక్రోద్యన్మణిదీధితుల్ చదలశం ♦ పాస్తోమతంగాంచఁగా
విక్రాంతిన్శరవృష్టిసంతతినివి ♦ ద్విడ్వాహినీ చల్లాఱఁగా
నక్రూరుండువిదూరుపైనడరెఁగ ♦ ల్పాంతాంబుదాటోపియై. ౮౫.

ఉ. భూరిధనుఃకళావిభవ ♦ భూషితదోఃపరిఘాంతరోద్యమ
ద్దారుణహేతిపాతములఁ ♦ దద్దయులావతిశత్రుసంఘముల్
ధారుణిఁ బ్రాలఁ బాఁడ్రడమనిఁ ♦ డాఁకెఁ దదీయచమూపతుల్ వెఱం
గూరఁగ నుగ్రసేనుఁడున ♦ కుంఠితధైర్యవిలాసధుర్యుఁడై. ౮౬.

మ. మఱియుం జేయఁగలట్టియోధులు రిపు ♦ క్ష్మాపాలసైన్యంబుపైఁ
దఱిమన్ మాగధచైద్యముఖ్యులును ను ♦ ద్యత్క్రోధదీప్తాకృతిన్
శరజాలంబుల యాదవావలికిదో ♦ శ్చండత్వముం జూపుచున్
ధరముల్ కంపము నొందఁగా నదర ♦ ద్వంద్వంబయ్యె యుద్ధంబటన్. ౮౭.

క. కరియును గరియును నరదం,బరదము వాజియును వాజి ♦ యత్తరయమునఁగా
ల్వురుఁ గాల్వురు నొండొరుతో, నరుసుగఁ బోరాడుచుండు ♦ నాసమయమునన్. ౮౮.

ఉ. బంధులకెల్ల హర్షముగ ♦ బాహుబలంబున శత్రువాహినుల్
బంధురమంధరక్షుభిత ♦ వార్ధి తెఱంగున సంచలించఁగా
గంధగజాశ్వసద్భటుని ♦ కాయములన్ బరిమార్చుచున్ జరా
సంధుఁడు దాఁకెనబ్బలుని ♦ జ్యాస్వనవిస్వనదబ్జజాండుఁడై. ౮౯.

ఉ. తాఁకి శరాళిఁ జేరురము ♦ దాకఁగ నేయుచు సీరి కిట్లనున్
వీఁకఁ గడంగి నాయెనుట ♦ వీరులిఁ బోలెనటించె దేనినున్
నీకాలఁదే నెఱుంగనెవ ♦ నీస్థలి నాలను గాచువానితో
నాకెటు సేయనౌను గద ♦ నంబటులైనను గీర్తిగల్గునే. ౯౦.

ఆ. గొల్లపల్లెలోనఁ ♦ గొన్నాళ్లు తిరుగాడు, చుండి పెరిఁగి పిదప ♦ సెంకనిఁ గొలిచి
బ్రతుకు నిన్ను గెల్వ ♦ పసయేమి కీర్తులు, నిండు నెక్కొ యొక్క ♦ నీచునోర్వ. ౯౧.

క. ఐనను గంసునిఁ జంపుట, చే నాశోకమందుచున్న ♦ చిరసంచితరో
షానలము నిన్నుఁ గ్రమ్మించినఁ, గాని యిఁక శమంబు పొంద ♦ దనవినిహాలిజయున్. ౯౨.

శా. ఊరర్జుల్ పనిలేను మాగధత్వాదీ ♦ యేశత్వమున్ గోపతా
ధారంబైన మదీయవృత్తమును నీ ♦ ద్ధక్షోణిలో భూపతుల్
తారీక్షించెదరంచు లాంగలహతిన్ ♦ దత్కేతుయంత్రాశ్వసం
హారంబున్ సమకొల్పియే చెను కడం ♦ బత్యంతచూర్ణంబుగన్. ౯౩.

గీ. విరథుఁడై జరాసంధుఁడు ♦ ద్వికినిదాఁటి, హసితగిరిపారమగుచుర ♦ త్నాభిరామ
కనకపట్టయుతంబగు ♦ గదయమర్చి, పేర్చి యార్చను రిపుకోటి ♦ పిచ్చలింప. ౯౪.

క. హలధరుఁడుఁదాను నెక్కటి, బలుగదఁ జేఁబూని రిపులు ♦ పల్లటిలంగా
నలువొప్ప నార్చి మాగధుఁ, గలనన్ మార్కొనియె బాహు ♦ గర్వంబలరన్. ౯౫.

వ. ఇట్లర్కప్రతాపు లగునయ్యిరువు రొండొరులం దార్కొని పేర్కొనినకడంకఁ జిత్రంబు లగుగదాసారణంబులం గ్రమ్ము రత్నప్రభాసందోహంబులు చండబాహు దండమండితకేయూరమణిగణాగణితవిభావిభాసమానంబు లగుచు నభోభాగంబునం బర్వి సుర్విషహం బగు నింద్రచాపంబు ననుకరింప నితరేతరఘట్టనంబులం బొడము పావకశిఖాకలాపంబులం గదలు విలయసమయసూచకమహోల్కాయుగంబు ననుసరింపఁ బరావృత్తంబును వృత్తంబును నుపరిప్లవంబును నవప్లవంబును దిర్యక్ప్రసరణంబును మొద లగుగదావిశేషంబుల మెఱయుచు నొండొరులయంతరంబులు వేచుచు నాలీఢంబును బ్రత్యాలీఢంబును ననుస్థానవిశేషంబులం జెంది పరస్పరంబును దేమల్పం జాలక జవాతిశయంబునఁ బూర్వభాగంబునం దోఁచి పశ్చాద్దేశంబున నుద్భవించి దక్షిణపార్శ్వంబునం బొడసూపి యుత్తరపుదెసం గనుపట్టి కరిణినిమిత్తంబు దంతమ్ములం గుమ్ములాడు మత్తమాతంగంబుల తెఱంగున ధేనువునకై తీక్ష్ణమ్ము లగుశృంగమ్ములం బొమ్ములాడు వృషభంబులకైవడి నాహారమాంసంబునకుఁ గోఱల సమరంబు సల్పు క్రోల్పులుల చందంబున నేకగుహానివాసజనితామర్షంబుల నఖంబులం జిమ్ములాడు పంచాస్యంబుల భంగిఁ బెనంగు నెడ జరాసంధుండు బలదేవుని దాఁపటం బెట్టి వలపటం జుట్టుకొని వచ్చుచు విచిత్రంబు లగుసారణమ్ముల మెఱుంగు లుప్పతిల్ల గద నూఁచి వేయునవసరంబున హలాయుధుండును దోడన భ్రమరివాఱం దిరిగి విపక్షునిగద నిజగదాఘాతంబునఁ బైకి నుబుక నడచి తిరుగ నతండు సవరించుసమయనఁ బార్శ్వభాగంబున వ్రేసిన వాఁడును బత్తెలపునం దప్పించుకొని ప్రలంబమర్దనునిఫాలభాగంబు బెట్టడిచిన నతండును వామనీకృతగాత్రుం డగుచుఁ దదీయప్రహారంబు నిష్ఫలంబు గావించి సింహనాదంబు సేసిన మాగధుండును ఘోరభీషణాకారుం డగుచు నవికృతప్రహారం బగు నిజగదాదండంబు పుడమిం బడకుండ మగుడ సవరించి నీలాంబరునకుం ద్రోవ యీక పదియడుగులకొలంది వెనుకకు లంఘించి నిలిచినం దోడనె బలుండును గుప్పించి పరిపంథిగద నిజగదతోడం బెనచి ముందఱికిం దిగిచిన నతండు వసుధాతలంబు చిక్కం ద్రొక్కి పెట్టిన దక్కై తీయక తాను నట్లన తిగిచి యిద్దఱు నొండొరులఁ దేమల్పం జాలక యితరేతరసమాకృష్యమాణశుండాదండంబు లగుశుండాలంబుల చందంబున నుండునవసరంబునఁ బ్రతిపక్షునిగదతోడం బెనచి యున్న నిజగదా

దండంబు పెనఁకువం దప్పించి మాధవాగ్రజుండు జరాసంధునిఁ దలంబు వ్రేసిన
యుబ్బలితప్రవ్రేటున మహాసమీరణకంపితం బగు మహీరుహంబుచందంబున సంచ
లించుచు ధైర్యం బవలంబించి నిజగదాదండంబున ముష్టికాంతకునిదక్షిణాంస
ప్రదేశంబుం బెట్టు మోఁదినఁ దద్గదాఘాతంబునం బెట్టువడినకరంబుననుండి పడిన
గద పరవీరునకుం దోఁప కుండ మగుడ నవరించి మించినరోషాతిరేకంబునం
బోవ విచిత్రంబు లగుగదాపరిభ్రమణంబుల జరాసంధునికనుంగవ మిఱు
మిట్లు గొన ఫాలంబును గపోలప్రదేశంబును నంసంబులును హనుభాగంబులును
బక్షంబులును బార్శ్వదేశంబులును బలుప్రవ్రేటుల నొప్పించుటయు నశనిపాతంబులం
జలితం బగుకులాచలంబుచందంబున నతండు పుడమిం బడి మూర్ఛిల్లుటయు
రౌహిణేయుండును మహామేఘంబుచందంబున గర్జిల్లుచు మాగధవాహినీసముద
యంబులం దతిమి జయంబునం బొదలి నిలిచె నంత. ౯౬.

సీ. దంతవక్త్రుండును ♦ జింతానుకుండును, బోరఁ జైద్యుండు ♦ భూరిశక్తి
నయ్యాదవుని నొంప ♦ నతఁడు భల్లంబుల, దంతవక్త్రునికేతు ♦ దండచాప
ములఁ ద్రుంచి నారాచ ♦ ములను వర్మంబులు, నువ్వ నేసినవాఁడు ♦ క్రొవ్వు చెడక
బలుగద వైచినఁ ♦ బ్రదరముల్ నిగుడించి, దానిఖండించియు ♦ దండవృత్తిఁ
జేకితానుండు శాత్రవు ♦ వీకఁ జెడఁగ, సారథినిఁ ద్రుంచ నశ్వముల్ ♦ సంచలించి
చైద్యురథమీఁదు కొంచును ♦ సమరభూమి, వెడలిచనె వృష్ణివీరులు ♦ కడఁగి నవ్వ.

సీ. కృతవర్మ సాళ్వుని ♦ శితశరంబుల నొంప, వాఁడును భోజేశు ♦ వాఁడియంప
వెల్లువ చేయుంప ♦ వివరంబుఁ బొందక, కృతవర్మ శాత్రవు ♦ నకరియమున
మర్మాస్థిబంధముల్ ♦ వర్మంబును గరాళిఁ, ద్రుంచి పేరురమునఁ ♦ దోడనవిశి
ఖమ్ములు పరఁగించి ♦ కడు రయంబునఁ జక్ర, రక్షకులవధించి ♦ రయములోఁదఁ
జాపకేతనసూతులఁ ♦ జక్కుచేసి, రథ్యములమీఁదఁ గ్రూరత ♦ రప్పలేయ
విహ్వలుండైన సాళ్వుతో ♦ వేగరథము, వీటిదెసకేఁ డ్డెనశ్వములు ♦ బెగడుచెంది.

లయగ్రాహి. ధారుణి వడంకఁగని ♦ దూరుఁడరిసేనపయి
బోరున నుదాఁకఁగని ♦ చేసుచును దాన
క్రూరుఁడనివార్యగతి ♦ దారుణశరాహతుల
వైరిమదమెల్లఁ జెడఁ ♦ బారుచును చాపజ్యా
దేరును తురంగములు ♦ సారెము ప్రీతూలినను
జేరుపవనించుతెర ♦ నారి ...

శిరసముతోఁ గొనుచు ♦ రారిపుఁడుగ్రమంచియువి
ఘోరమగుభల్లహతి ♦ గౌరవముగాంచెన్. ౯౯.

చ. నిరుపమశక్తిఁ బౌండ్రకుఁడ ♦ నేకశరంబులనుగ్రసేనునిన్
దరమిడినొంచుచోనతఁడు ♦ దారుణకోపముతోడసూతునిన్
దురగములన్ వధించిబలు ♦ తూపులు పేరురమాడ నేసినన్
వెరపుననోడిపాఱెయను ♦ వీరులు సంతసమందిచూడఁగన్. ౧౦౦.

క. సాత్యకియత్తఱిసమరా, ధృత్యమ్మువితతబాహు ♦ దర్పముసుభట
స్తుత్యమ్ముగమధ్యాహ్న, దిత్యునిక్రియ మెఱసిసాత్వ ♦ తేయునిఁదాఁకెన్. ౧౦౧.

క. శిశుపాలుండునుగ్రోధవి, వశుఁడైతనరథమువృష్ణి ♦ వర్యునిమ్రోలన్
విశదగతినిలిపియార్చుచు, దశదిశలద్రువంగఁజాప ♦ ధరుఁడైయనియెన్. ౧౦౨.

ఉ. నిక్కముబంటువోలెనిటు ♦ నిన్ననునీకులమీవెఱుంగకే
పక్కనఁ జూచువారలును ♦ బాంధవులున్నగునట్టులయ్యయో
యొక్కరికిచ్చినట్టివిక ♦ చోత్పలలోచన బట్టివంత నే
దక్కనెపూనుదన్న విని ♦ ధైర్యఘనుండగువృష్ణివర్యుఁడున్. ౧౦౩.

క. అక్కటనీచాత్మకనీ, వెక్కడభోజేంద్రతనయ ♦ యెక్కడతగునే
నక్కుమ్మృగేంద్రసుందరి, యిక్కావరమెల్లనిపుడ ♦ యేఁగ్రక్కింతున్. ౧౦౪.

సీ. అనితనబలువింట ♦ సునిశితాశుగములు, నూరుసంధించియా ♦ శూరవరుఁడు
శిరమునవురమునఁ ♦ జేతులమూఁపుల, నలికమ్ములందును ♦ గళమునందు
గండభాగమ్ములఁ ♦ గటిమరలందును, బరియసిఁజొనుపన ♦ ప్పగతుఁడార్చి
యన్నిశాణములఁదా ♦ నట్లనెయొనరింప, నలిగియెంతయునుస ♦ త్యకసుతుండు
వాఁడిబలుకోలనొక్కట ♦ వానిరథము, కేతువిలఁగూల నేసినఁ ♦ గినిసియతఁడు
భల్లమొక్కంటనాతని ♦ విల్లుదునిమి, ధరణియద్రువంగసింహనా ♦ దంబుచేసి.

ఉ. చేఱొకవిల్లుగేలఁగొని ♦ వృష్ణికులోద్వహుఁడుగ్రలీలన
వైరిచలింపఁదీక్ష్ణశర ♦ వర్గమనర్గళభంగిఁజేయనా
ఘోరమహాగ్రగణ్యుఁడుడి ♦ వోవనిబంటుతనంబుపెంపునన్
దారుణబాణవర్షమునఁ ♦ దద్దయునొంచెయదుప్రవీరునిన్. ౧౦౫.

గీ. దానమిగులంగనలిగియా ♦ దవవిభుండు, సప్తఘంటనినాదభీ ♦ [illegible]ణతనొప్పు
కుంతమొక్కటిఁబూని ♦ పంతమడర, నే[illegible]శిశుపాలునెదఁదూఱ ♦ నెసకమెసఁగ.

క. ఆఱుశరమ్ములఁ జైద్య, ప్షొరవణుఁడు దానినడుమ ♦ ఖండించియొడల్
దూఱఁగఁబదిశరములయను, వీరుని నొప్పించియార్చె ♦ విస్మయపడంగన్. ౧౦౯.

గీ. పటలు వెతికినఁగినుక నె ♦ సంగుమేటి, సింగమనసాత్యకివిరోధి ♦ భంగపఱుప
నెమ్మదిఁదలంచియొక్కభ ♦ ల్లమ్మువింట, నపుడుసంధించియఱుమంట ♦ లడరనేసె.

చ. అదియువిరోధియూధభయ ♦ దాకృతిమైఁజనిచేదిభూవిభుం
డదరకయేయుసాయకము ♦ లన్నియుఁగీటునఁబుచ్చిమిణ్గురుల్
చదలునఁబర్వ నాతనిభు ♦ జద్వయమధ్యముగాఁడిదుస్సిభూ
రదశకుఁబాలు చేసినధ ♦ రంబడెనాతఁడుమూర్ఛనుస్గుచున్. ౧౧౦.

వ. ఇవ్విధంబున నమ్మహావీరుండు మూర్ఛిల్లి నేలఁ ద్రెళ్లినం జూచి తత్సైనికులు హాహాకారంబులు సేసి రట్టియెడ వానిసారథి రథంబు నవరోహించి మై మఱచియున్న గించిత్తును మొగంబునం దెలివి దప్పక యెప్పటట్లన కలకల నవ్వెడువిధమ్మున నున్న యన్నరవరునిఁ గౌగిటం బొదివి గ్రుచ్చి యెత్తి యెప్పటియట్ల స్యందనంబున నిడుకొని సంగ్రామరంగంబునకుం దొలంగం గొనిపోయె. సత్యకతనూభవుండునుం గెలుపు గొనినయాటోపంబున రోదసీకుహరంబు భేదిల్ల సింహనాదంబు గావించుచు బలు దెరంగులతూర్యస్వనంబులు చెలంగ నిజభటానీకమ్ములనిబిడకోలాహలమ్ములు నింగి బగులఁ దన్ను నన్నయగుబలభద్రుం డున్నచాయకు నడచి యతని మన్ననం బడసి సకలసైన్యంబుతోడ నుత్సాహదోహలుం డై యున్నసమయంబున. ౧౧౧.

గీ. పసిఁడినీఁటిద్రాత ♦ పనిమించుహొంబట్టు, హరువుతెరఁబొసంగు ♦ నందలమున
భోజకన్యనునిచి ♦ పురమునకనిచియా, శౌరిసమరభూమిఁ ♦ జేరవచ్చె. ౧౧౨.

క. వచ్చిబలరాముజయమున్, మెచ్చుచుసాత్యకినిఁగాంచి ♦ మిగులంగూర్మిన్
గ్రుచ్చికవుంగిటఁబొదువుచు, నచ్చక్రధరుండువారి ♦ నలరించెఁగడున్. ౧౧౩.

క. ఆలోనరుక్మియునుశిశు, పాలజరాసంధులట్లు ♦ బవరములోనన్
జాలుపడంగనుఁగొనియు, ద్వేలక్రోధుండయిసమర ♦ ధీరతదోఁపన్. ౧౧౪.

గీ. నడచిమురవైరియొక్కఁడె ♦ క్కడనటంచు, నాత్మభటమంత్రిజనముల ♦ నడిగికొంచు
రథ సమునఁదాఁకుట యునప్పు ♦ డుభయసైన్య, ములునుదారసమయ్యెభూభువనమదర

క. తేరులుఁదేరులు నొక్కట, వారణములువారణములు ♦ వాజులువాజుల్
వీరులువీరులుఁదలపడి, పోరఁగనమ్భుతరసంబు ♦ పొంగెన్మిగులన్. ౧౧౬.

సీ. ఒండొంటితోఁదాఁకు ♦ నుద్ధతిబద్ధలై, పగులువేదండకుం ♦ భములతోడఁ
గొమ్ముకత్తులబిట్టు ♦ గ్రుమ్ములాడెడువీఁకఁ, జెక్కలౌనెమ్మేని ♦ సిరులతోడ

బల్లెంపుఁబోటుల ♦ జల్లెడకంతల, ట్లమరిననిడుదత్రాం ♦ డములతోడ
నీటెబల్లెంటుల ♦ నెగడొందునెత్తురుల్, దటుగకకురియుసా ♦ నములతోడ
రథికకార్ముకనిర్ముక్త ♦ పృథులబాణ, వర్షనీరంధ్రమగ్నసు ♦ ర్వారరుధిర
పూరములతోడనింతేని ♦ భీరువోక, భటులుగొనియాడమాతంగ ♦ ఘటలుపోరె.

క. ఏమనఁగవచ్చుఁదాదృశ, సామజసంగ్రామమునను ♦ జాల్కొనురుధిరో
ద్దామప్రవాహములలో, వేమఱుఁదేలెఁ శతాంగ ♦ విపులప్లవముల్. ౧౧౭.

ఉ. ఘోటకముల్ కరీంద్రముల ♦ కొమ్ములకై యెగఁబ్రాకిపాదిచే
యీటెలపోటులఁ దనువు ♦ లెల్లకడంపునయంగమాపుతుల్
ల్లాటికిఁగాలునట్టులుగ ♦ లావునుజేవయుఁజూపఁజూపఱుల్
నూటికొకండెవచ్చుపలు ♦ నోళ్లనుతించిరిమించివేడుకఁ. ౧౧౮.

సీ. అరదంబులరదంబు ♦ లడరనడ్డముదాఁకి, కుంజరమ్ములు నేలఁ ♦ గూల్చునెడలుఁ
గరులుఁగరుల్ దాఁకఁ ♦ గడఁగిబల్ తేజులు, నూరారువెడఁదాఁకి ♦ బోరునెడలుఁ
దేజులుఁదేజులే ♦ తీర్చిపోరఁగఁదాఁకి, వడిఁగుంతములభటుల్ ♦ వ్రచ్చునెడలు
ఘటులుఘటుల్ పోరఁ ♦ బటురథాంగతురంగ, గజములుఁగ్రుంగఁగాఁ ♦ గవియునెడలుఁ
గలిగిసమరాంగణమ్మురక్త ♦ ప్రవాహ, కేళికాలోలభేతాళ ♦ బాలికావి
హారరమణీయమయియునా ♦ శిరముఖసు, పర్వులకుఁజూడలోచన ♦ పర్వమయ్యె.

వ. అట్టియెడ నవ్విదర్భరాజనందనుండు రెండవఖండపరశునిమాడ్కిఁ బ్రళయకాలం
బునం దోఁచునంతకునిపోలికఁ బౌలస్త్యమూలబలసంహారంబునకుంగడంగు రఘు
పుంగవుని తెఱంగున మహార్ణవంబుఁజొచ్చి కలంచి యాడెడుతిమింగిలంబుచందంబున
భండనక్రియావిజృంభణంబు నెరపుచు వేదండతండంబులబృంహితధ్వానములును
ఘంటానినాదంబులును శతాంగసంఘంబుల నేమీస్వనంబును గేతనకింకిణీసంకులక్వ
ణనంబులును రథికవరులవిజయశంఖధ్వానంబులును ధనుర్గుణారావంబులును మరం
గమంబులహేషాఘోషంబులు ఖురవిఘట్టనసముద్భూతకఠోరనిర్హ్రాదంబులును వీర
భటులచటులతరభుజాస్ఫాలనజనితనిర్ఘోషంబులును హాలాహలసన్నిభంబు లగు
కోలాహలంబులు నెక్కుమ్మడిం గడంగ నిఖిలదిక్కులఁ దనరథంబుఁబరపి కొఱవిఁ
ద్రిప్పిన తెఱంగునఁ బరిభ్రమింపుచుఁ దూర్పునం దోఁచి పడమట నురవణింపుచు నుత్త
రంబునఁ దోఁచి దక్షిణంబున నక్షీణపరాక్రమంబు మెఱయింపుచుమహాతాళసన్నిభం
బగుధనువు సారింపుచు భల్లార్ధచంద్ర నారాచక్షురప్రకంకపత్రప్రముఖంబు లగుశిలీ
ముఖంబులు పుంఖానుపుంఖంబులుగా నిగుడ్చుచు నగ్గలికమీఱ విడివడినదిగ్గజంబు

చందంబునఁ బెంపు దీపింప సాత్యకిప్రముఖయదుకుమారుల మిగుల నొప్పించి నేలకుం గోలకుం దెచ్చినఁ గని బలంబులు చెదరి బెదరి నలుగడలఁ బాఱుచుట యుంగనుంగొని యప్పుండరీకాక్షుండు మందస్మితంబు వదనారవిందంబునం గందళింపఁ బాంచజన్యంబు పూరించి యెల్లవారల నుల్లసితకుతూహలంబున మగలునట్లు గావింపుచు సారథి యగుదారకుం గనుంగొని యిట్లనియె. ౧౨౧.

చ. అదెకనుఁగొంటె భోజతన ♦ యాగ్రజు తేరుసితాశ్వయుక్తమై
విదితపతాకమై సమర ♦ వీధి వెలిం గెడువానిఁ దాఁకి దు
ర్మదమడగింపఁ గావలయు ♦ రథ్యములన్ వడిమీఱఁ బోవని
మ్ముదితమదీయబాహుయుగ ♦ ళోగ్రతవేల్పులు మెచ్చఁ జూపెదన్. ౧౨౨.

ఉ. ఈతఁడునన్నొకించుకయు ♦ నెంచఁడు నిక్కము బంటు వోలె దు
ర్నీతిపరుండు గాఁగ భగి ♦ నీహరణస్ఫుటరోషదారుణా
న్వీతమనస్కుఁ డైమిగుల ♦ నిచ్చట వచ్చుచునున్న వాఁడు నా
చేతుల లావుఁ జూడు మికఁ ♦ జిక్కులఁ బెట్టెద వీని దారుకా. ౧౨౩.

క. అనుట యునుదారుకుండ, ట్లనతనరథము న్రయంబ ♦ లరభోజన్యపా
లునితనయు నెదుట నిలుపఁగ, వనజాతాక్షుండు నెఱ్ఱ ♦ వాఁ డెడు చూడ్కిన్. ౧౨౪.

గీ. రుక్మిఁ గనుఁగొని తనయుకా ♦ ర్ముకమునందు, తూపులోకనూఱునిన్నాఱుఁ దొడిగియేయ
నావిదర్భేంద్రతనయుండు ♦ నన్నిశరము, లన్నిశరములవారించి ♦ యాగ్రహమున.

క. మూడుశరమ్ములు కృష్ణుని, పోఁడిమి సెడ నేసికినుక ♦ పొంగఁగఁ గడిమిన్
వాఁడిబలు తూపులొక్కట, నేడింటను మఱియు నేసె ♦ నీశులు మెచ్చన్. ౧౨౬.

గీ. అంతఁ బోక విదర్భభూ ♦ కాంతసుతుఁడు, మేటి కరలాఘవంబున ♦ మెఱసి మిగుల
చిత్రశరముల నాతనిఁ ♦ జిక్కుపఱచి, యనియె దరహాసభాసురా ♦ ననముతోడ. ౧౨౭.

ఉ. గొల్లలు నీవుమెందుకొని ♦ కోడిగపున్ వగలుల్లసిల్ల ద్రే
పల్లెలలోన వెన్నలును ♦ బాలును దొంగిలి తిన్నయట్లయో
బల్లిదులైన రాసుతుల ♦ బల్మియెఱుంగక యిట్లు తెన్ని నా
చెల్లెలి కాససేసితివి ♦ సీయని వవ్వరె నిన్ను భూజనుల్. ౧౨౮.

చ. తెలియవు గాక రుక్మి సము ♦ దీర్ణపరాక్రమలీల నీవకా
దలహరుఁ డైన నిల్వఁగలఁ ♦ డావికటించి యిఁకేల కేల నే
విలుధరియించి నిల్తునఁట ♦ వేలుపులెందఱు గూడి గొనైన మా
లలన గ్రహించి పోవఁగఁద ♦ లంచెని జంబలశూలి కైనియున్. ౧౨౯.

క. ప్రాణమ్మునీకువలసిన, నేణాక్షినిమగుడఁదెచ్చి ◆ యిమ్మునిలింప
స్త్రైణంబునీకువలసిన, నేణాక్షినిమగుడఁదెచ్చి ◆ యీకుముకుందా. ౧౩౦.

చ. కులమునసోఁగుణమ్ములనె ◆ కోరిను[illegible]ంపఁదనర్చుకల్మినో
బలిమినొ రూపసంపదనొ ◆ భవ్యవిభాసముదీర్ణవృత్తినో
తెలియవుగాకమామదవ ◆ తీమణికేమిటఁబోలుదీవునీ
కలవడునెట్టులాగుణము ◆ లంబుజలోచనీకునబ్బునే. ౧౩౧.

చ. అనవినిశౌరివీనిద్దుర ◆ హంకృతిమానిచికొనియుత్తరం
బనువుగనీయరాదనుచు ◆ హస్తమునంగలదివ్యకౌర్ముకం
బునఁగడువాఁడితూపులను ◆ బూన్చిరయంబుననేయవానిపైఁ
గనకతనుత్రమంతయును ◆ కొవకలయ్యెమహాద్భుతంబుగన్. ౧౩౨.

క. హరిశరములనాతనిమై, మఱుఁవప్పుడుదెగుటనడుమ ◆ మఱివేఱొకమై
మఱువుంగ్రమ్మఱఁదొడువుట, యెఱుఁగంబడదయ్యెజనుల ◆ కెవ్వారలకున్. ౧౩౩.

చ. బరవసమొప్పభోజనర ◆ పాలతనూజుఁడుచిత్రసాయక
స్ఫురణమునన్సురారినల ◆ సూతునిఁదద్రథఘోటకమ్ములన్
విరవిరఁబోవనేయుటయు ◆ నీరజనేత్రుఁడుపి[illegible]నవ్వుతో
మెఱయుచునాల్గుతూపులన ◆ మిజ్జయసిద్ధికివింటఁగూర్చుచున్. ౧౩౪.

క. సురలచ్చెరువునఁజూడన్, నరనాథునిమీఁదనేసి ◆ ననునవిసూతుం
నురగములఁజంపెరుక్మిన్, విరథుంగావించెనతఁడు ◆ నిలిచెంబుడమిన్. ౧౩౫.

చ. పలుకయువాలుఁగేలఁగొని ◆ బాహుబలంబడరంగసింగముం
బలెనలరుక్మిచెంగునన ◆ భంగురలీలఁజెలంగురోసమ
గ్గలముగశౌరితేరికిని ◆ గ్రక్కునదాఁటిననజ్జనార్దనుం
డలుకచెలంగనందకము ◆ హస్తమునంగొనివానిడాయుచున్. ౧౩౬.

గీ. పరునికేలనున్న ◆ పలుకయువాలును, జిద్రుపలగుచుధరణిఁ ◆ జెదరనఱకి
వానిశిరముఁద్రుంపఁ ◆ బూనినయురుక్మిణిఁ, దలచిచంపకుడిగె ◆ దైత్యవైరి. ౧౩౭.

క. తొడిబడిచంపఁగరాదని, యుడిగియురారాత్రవింట ◆ నొప్పెడుశార్ఙ్గం
జెడకేలుగట్టిచంపన్, జడియకుజడియకుమటంచు ◆ సరసోక్తులతోన్. ౧౩౮.

క. నీవఱచినయఱపులుమఱి, నీవేయెఱుఁగుదువుతెలుప ◆ నీతోడుసుమీ
బావాయనితలగడ్డిము, రేవులువాఱంగవడిగొ ◆ రిగివిడిపించెన్. ౧౩౯.

క. కురిసెంబువ్వులవానలు, నెరసెందివియెల్లఁదూర్య ♦ నిబిడస్వనముల్
దొరసెన్ వంది స్తవములు, విరిసెన్ మునిమానసార ♦ విందము లంతన్. ౧౪౦.

గీ. ఇట్లుజయలక్ష్మిఁ గైకొని ♦ కృష్ణుఁడప్పు, డన్నబలరాముఁడెంతయు ♦ నాదరింప
సాత్యకిసమగ్రభక్తిమై ♦ సాఁగిమ్రొక్క, నలవుబలిమియుమెఱయసై ♦ న్యములుగొలువ

క. పూరించెఁబాంచజన్యము, వైరించిన్మిగులఁదనిపి ♦ వైరముడిపియున్
భైరవభేరీరవములు, బోరుకలఁగఁదనదుసైన్య ♦ ములనడిపించెన్. ౧౪౨.

వ. అంతనక్కడ. ౧౪౩.

క. చావునకుఁదప్పిమగుడం, జీవితులైనట్టిముగధ ♦ శిశుపాలన్నృపుల్
త్రోవజతఁగూడిచనిరిని, జావాసమ్ములకునాన ♦ నానతముఖులై. ౧౪౪.

క. అలరుక్మిగుక్కవసముఁడు, తలయునుమూపియునుగొర్గి ♦ తనువిడుచుటకున్
విలపించుచునేవగను, న్నెలుతున్ శౌరిననియందె ♦ నెలకొనియుండెన్. ౧౪౫.

క. అద్దనుజదమనుఁడంతట, నుద్దవిడిన్ నడచినడచి ♦ యుత్సాహముతో
నద్దంపుబిల్లకైవడిఁ, బొద్దాకబారెంటనున్న ♦ పోలికఁదోఁచన్. ౧౪౬.

మ. బలదేవున్ గరిమీరుసాత్యకియుఁ శుం ♦ భన్మత్తమాతంగపు
ష్కలగంధర్వశతాంగవీరభటసం ♦ ఘాతంబుతోనొప్పనీ
విలసత్సైన్యముభక్తిమైఁగొలువఁగా ♦ విచ్చేసితద్ద్వారకా
నిలయంబెల్లనలంకరింపుఁడుశుభా ♦ న్వితక్రియాచాతురిన్. ౧౪౭.

క. ఈవేళకురైవతక, గ్రావంబుననిల్చిరేప ♦ కడనరుదెంతున్
నావినియట్లనకొకని, రేవతిరమణుంపుచనిపు ♦ రిన్ నివసించెన్. ౧౪౮.

క. అనుటయునభిమన్యుసుతుం, డనఘాత్మకభోజకన్య ♦ హరిపరిణయమై
తనిపినకథయాద్యంతము, వినవేడుకయయ్యెఁదెలుప ♦ వేయునియనుగన్. ౧౪౯.

శా. శ్రీవత్సాంకితవక్షయాదవపురీ ♦ సింహాసనాధ్యక్షుల
క్ష్మీవరిష్ణుకటాక్షరాత్రించరకుం ♦ భీవ్రాతహార్యక్షనా
నావాచంయమిలక్షభక్తజనతా ♦ నందక్రియాదక్షరా
జీవశ్రీకలితాక్షభూరికరుణా ♦ సిక్తస్ఫురద్వీక్షణా. ౧౫౦.

క. కృష్ణావ్యసనవికర్శన, తృష్ణాసంతానదంతు ♦ రితహృత్కమలా
కృష్ణాహిసమభుజాయుగ, కృష్ణాహ్వాయమోచితప్ర ♦ కృష్ణాఘఘనా. ౧౫౧.

ఉపజాతి. దానవృపాలాగమనవిలోలా ♦ తతభుజకలితసుదర్శనలీలా
ఆనతకోలాహలపరిశీలా ♦ యతపదకటకమహోదవఖేలా

భానుసమానాభరణవితానా ♦ పరమపదమథనప్రకటోద్యానా
హీనవిధానాధికరుచినిచయా ♦ ధీనఖగేనాదివిజవిధానా. ౧౫౨.

గద్యము.

ఇది శ్రీమన్మదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణావాప్తచతురసాహితీవైభవ
వక్రపాటామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మా
ర్గణవిశ్రాణితమహాఫలకోవిదనుతభాగధేయ కోటీశ్వర
నామధేయ ప్రణీతం బైన భోజకన్యాపరిణయం
బను మహాప్రబంధంబునందు

చతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము.

క. శ్రీవసుదేవమహాన్వయ, పావననిజచరణచిహ్న ♦ పరిశోభితబృం
దావనసఫలీకృతపద, సేవకకరుణావిశాల ♦ శ్రీగోపాలా. ౧.

వ. అవధరింపుము పరీక్షిన్నృపాలునకు శుకమహాయోగి యిట్లనియె. అట్లు గోపాల
దేవుండు కామపాలు వెంబడి నిజసైన్యంబుల ద్వారకాపురంబునకుఁ బనిచి తనుపాం
తంబునం దనరురైవతకధరాధరసమీపోద్యానానవద్యనిష్కుటతటంబునం గనుపట్టు
పున్నాగకాననంబున నివసితస్కందావారుం డగుచుఁ బచ్చనూరెపుటంపుఁబటకుటీ
రంబునఁ గతిపయపరిజనంబులు గొల్వఁ జైద్యమాగధభోజనందనులపరాభవంబును
దమవిజయంబులును బహుప్రకారంబుల యనుకుమారులు వేర్వేఱఁ గీర్తింప నిష్టా
లాపంబులఁ బ్రవర్తిల్లుచున్న సమయంబున. ౨.

చ. మనుజతనున్న తావకను ♦ మారిమనోరథమెల్ల సార్థమై
తనరెడునట్లు బాహుబల ♦ దర్పమెలర్పఁగఁగంసవైరిదు
ర్జనులఁదృణీకరించిస్వవ ♦ శంవదగానొనరించెనంచుఁదో
యనిధికిఁదెల్పనోయనఁగ ♦ నబ్జహితుండుప్రతీచికింజనెన్. ౩.

మ. స్వకవిద్యోతవసువ్రజంబడరస ♦ ర్వంబున్ బరక్షోణిభృ
న్నికటోద్యత్కటకంబుఁ జెందియుఘనా ♦ నీకానురాగాదియై
సకలోర్వీజనసేవ్యుఁడయ్యెనినుఁడెం ♦ చన్ భూరితేజుండు శ
త్రుకులాంతస్థితుఁడయ్యుఁబూజ్యుఁడెకదా ♦ రూపింపనెవ్వారికిన్. ౪.

చ. రమణుఁడుత్వరాప్తివన ♦ రాశినివేగము చెందనేగు గో
సనుముగ నేగలేకవెను ♦ చక్కనిఁజిక్కుచుఁజాయ, వచ్చుమా
ర్గమునకుఁజుట్టిరానభిము ♦ ఖంబుగఁబోయెదనన్న మాడ్కిఁబ
శ్చిమదెసమానితూర్పునకుఁ ♦ జేరెనుదంచితదీర్ఘరూపతన్. ౫.

చ. అలవనమాలిరూపమున ♦ నంబుజమిత్రుఁడు తానుబశ్చిమా
చలముననిల్వఁదత్కులము ♦ సాములు చాలఁదదీయభాగ్యపు
ష్కలతకుసంతసిల్లిపాడ ♦ గానఁగఁదెచ్చినహాటకాంబర
మ్ములకరణిన్ నగాగ్రములఁ ♦ బొల్చెజరత్కిరణప్రకాండముల్. ౬.

మ. అతిసంధ్యారుణితాంబరోల్లసదుదా ◆ రాబ్ధీశదిక్కామినీ
గతుఁడైయేఁగెఁద్రయీతనుండునిజప ◆ క్షస్థద్విజవ్రాతముల్
వెతచెందంగనుదేజముందొరఁగియు ◆ ద్వేలానుబంధంబుతో
డుతపాత్రిత్యముగాంచెసత్పథముపాం ◆ థుల్మానియంతంతకున్. ౭.

మ. *అరిస్త్రీవ్యూండగుప్రాణభర్తసమయా ◆ యత్తుండుగానన్బ్రకా
శరమల్ప్పెఁబరవాహినీపతిభజిం ◆ చన్జూచిపత్త్రస్రవ
ద్గురుమాధ్వీకరసాస్రుపూరయగుచున్ ◆ దోడ్త్రోవికాసత్వమున్
దొరఁగెన్బద్మినిసారసాస్యవిగళ ◆ ద్రోలంబనిశ్వాసయై. ౮.

గీ. కరములాకవేయుగలిగియుఁ ◆ దరణిదైవ
వశతమున్నీటమునిఁగిన ◆ వార్తశకుని
వితతిదెలుపంగఁబద్మినుల్ ◆ వినిమొగమ్ము
ముడిచెనననీటఁగలపద్మ ◆ ములుమునింగె. ౯.

మ. కరుణన్బ్రోచినమిత్రుఁడేగెనుగళం ◆ కంబూనుచెల్లప్పుడున్
గురువిద్వేషినిశాచరుండనుచులో ◆ కుల్నిందగావించుని
ష్ఠురభావుండరుదేరఁగీడ్పలచునం ◆ చున్విచ్చుమొగ్గచెన్
జరితార్థాత్మకళత్రవృత్తమగుచున్ ◆ జక్రద్విజవ్రాతముల్. ౧౦.

మ. సమయత్క్ష్మాతలభర్తపశ్చిమదిశా ◆ శైలేంద్రమున్లోహనా
శమునూత్నంబుగసంఘుంటించిదృఢతన్ ◆ లక్షింపఁబద్మాప్తబిం
బముపేరందగుగుండుఁబూన్చినిగుడిం ◆ పందన్మహాపాతసం
భ్రమభీతింబలెజోడువీడుచునుజ ◆ క్రంబుల్చనెన్దిక్కులన్. ౧౧.

సీ. ఉదధిరాజన్యుని ◆ యొడ్డోలముగనంటుఁ, బట్టినదీపికా ◆ పాళియనఁగ
నంజనద్వీపరదా ◆ గ్రాఘాతనిర్ధూత, పరమహీంధరధాతు ◆ పటలమనఁగఁ
ద్వరనేగురవిఁగూడి ◆ యరుగఁజాలకవెన్క, నిలిచినజరదంశు ◆ నికరమనఁగ
సమయనిదాఘకా ◆ లమునసొక్కటఁదోఁచు, వనధనంజయమహో ◆ జ్వాలలనఁగ
మందమందేహదేహని ◆ ష్యందిబహుళ, వర్ధితోదారరుధిరస్ర ◆ వంతులనఁగ
నపరజలనిధిగర్భర ◆ త్నాంశుతతికి, దాయయోయనసంజకెం ◆ జాయదోఁచె. ౧౨

---

* అరి=చక్రవాకము, శత్రువు.

చ. ఇనుఁడపరాద్రిఁగానఁజరి ♦ యించుచుఁజీఁకటివేఁటలాడఁగాఁ
జనుటయుఁదన్మహాగహన ♦ చారిజనమ్ములునూకరాదికో
సనమృగపాళికంగలఁప ♦ నల్గడలందవిలించినట్టియ
య్యనలమనంగసంజరుచి ♦ యద్దెసనుద్దవిడింగనంబడెన్. ౧౩

మ. దివసగ్రీష్మదురంతదుర్దశవెసం ♦ దీఱంగరంగద్రథాం
గవిహంగాహ్వయహంసము ల్దెసలుద్రావ ♦ కన్ బాంధవ్యత్పద్మయుల్
దివురొందన్ వడిఁగ్రమ్ముమేఘతతిరీ ♦ తిన్ గాఢదీవ్యత్తమో
నివహంబొక్కటనాక్రమించెయమునా ♦ నిర్యత్ప్రభాధోరణిన్. ౧౪.

సీ. ప్రకటీకృతగుహాంత ♦ రంగికత్వంబయ్యె, నుపచితబహుతార ♦ కోదయంబు
దూరితశకునివి ♦ హారాత్తశయమయ్యె, గర్వభ్రమదులూక ♦ కలకలంబు
వినిహితప్రజ్ఞాన ♦ యనభోజనమ్మయ్యె, జహదబ్జబాంధవ ♦ జాతవృత్తి
మాపాదితశ్యామ ♦ లానుభావంబయ్యెఁ, బరిభూతమాతంగ ♦ వైభవంబు
నగుచుఁగనుపట్టెవెసనంజ ♦ నాభ్రవిభ్ర, మభ్రమరవారసారస ♦ మగ్రజాగ్ర
దక్షసారమసారవి ♦ హారహారి, ఘోరసంతమసప్రభా ♦ భూతమహిమ. ౧౫.

మ. మొనసెన్ లోకములోననెల్లెడలసం ♦ పూర్ణంబుగానంగజా
తునితేజోమయవహ్నియన్మతికిగు ♦ ర్తుల్గానిరుల్ ధూమమై
యునికింజెందెనుగాకతక్కొననుయో ♦ యోధూమవాన్సోగ్నిమా
ననుతర్కానుగతోక్తిసద్విబుధలో ♦ కారాధ్యమైయొప్పెనే. ౧౬.

చ. వనజదళేక్షణుండగుచు ♦ వర్తిలుభానుఁడుయోగనిద్రకై
వనధిఁజొరంగమున్ గుహల ♦ వారనిభీతినడంగియున్నయ
ద్దనుజకులమ్మునల్గడల ♦ దర్పవిలాసములుప్పతిల్లఁబై
కొనియెననంగఁగప్పడియె ♦ ఘోరతమోవిభవంబపారమై. ౧౭.

గీ. యమునజాహ్నవిమీఁదిరో ♦ సమునని గిడి
మించిముల్లోకములనాక్ర ♦ మింతుననుచుఁ
బెరిఁగెనోయనదట్టమై ♦ యిరులుగవిసె
మెండుకొనియుండుకాటుక ♦ కొండయనఁగ. ౧౮.

సీ. కేరాయనికిఁబొక్కు ♦ తారావఘామణి, కటిచాయనునుబట్టు ♦ గాఢరింప
వేయుకన్నులవాని ♦ దాయనెంచునహల్య, నీలాలసరులంచు ♦ బాళిఁదాల్ప

దహనునాత్మఁ దలంచు ♦ తపసి రాయిల్లాంద్రుఁ, గప్పు కుప్పసములు ♦ గా ఘటింప
శివుని మరులొల్కు కన్ను ♦ వివిధ తాపస కాంత, లిందీవరములు గా ♦ నెంచి ముడువ
నిగిడె జగములఁ గలకంఠ ♦ నీలకంఠ, కంఠ కాదంబకరదంభ ♦ ఖంజనాభ
కజ్జలద్యుతిహారి నీల ♦ ఘనతమాల, ఘోరరుచిపూరమగు వంధ ♦ కారమపుడు. ౧౯.

చ. సమయమహావణిగ్వరుఁడు ♦ సాంద్రమయూఖగుణప్రసక్తిచే
నమరిన మండలాఖ్యమగు ♦ నట్టికటాహమునన్ ఘటించియ
క్కమలహితున్ వరార్ణవము ♦ ఖంబున డించమునింగియాతఁడో
క్క మొగి వెలార్చు ముత్తెముల ♦ కైవడిఁ దారలె సంగెబోరునన్. ౨౦.

క. రవిమండలగండోపల, మవలన్ జరమాద్రినుండి ♦ నంబుధిఁ ద్రెళ్లన్
గవ నెగసిన జలకణముల, హవణునఁ దారకలు మింట ♦ నంతటఁ దోఁచెన్. ౨౧.

మహాస్రగ్ధర.

కువలాధీశత్రియామల్ ♦ కుతుకపరిణతిన్ ♦ గూడు పెండ్లిన్ దిశాళుల్
రవితేజస్తప్తనక్షు ♦ త్రపథకగగన ♦ భ్రాష్ట్రి మందంచి వేఁచన్
యువతీమానాఖ్యధాన్యం ♦ బుఱక పెటులు గో ♦ నుద్భవల్లాజలో నా
దివిఁ దారాస్తోమ మొప్పెన్ ♦ ధృఢనిజమహిమన్ ♦ ధిక్కృతాధ్వన్యమాచున్.

సీ. సంధ్యాభుజంగి కా ♦ సంజనితాండముల్, తారాధ్వపున్నాగ ♦ కోరకములు
పద్మాప్తహయముఖో ♦ త్పతితడిండీరముల్ ♦ ‡ దిష్టశగత్సమా ♦ కృష్టహంస
లధివిష్ణుపదసము ♦ ద్యత్పునర్భవములు, రాజాగమవికీర్ణ ♦ లాజచయము
లభ్రమహార్ణవో ♦ ద్యద్బుద్బుదమ్ములు, రవికరతప్తాంబ ♦ రభ్రమాంబు
లధికనృత్యద్గిరీశో ♦ త్త ♦ మాంగవిభ్ర, మద్దివిజలోకవాహినీ ♦ మహదభ్ర
వీచికాన్యోన్యఘట్టనా ♦ విదళితాబ్ధి, శీకరములొప్పెఁ ♦ దారకములు. ౨౩.

ఉ. ఉరవడి నొక్కమొత్తముగ ♦ నుర్వియు నాకసమావరించి భా
స్కరుఁడపరాబ్ధిఁ ద్రెళ్లునెడఁ ♦ గ్రక్కునఁ దోఁచి మహాంధకారమ
త్తరణిమయూఖసంతతుల ♦ త్రాళ్లను వ్రేలఁగఁ గట్టినట్లు మం
దిరముల కజ్జలాంక నవ ♦ దీపకలాపములొప్పె నయ్యెడన్. ౨౪.

మ. సముదాహాంకృతి నున్న సంతమసవ ♦ ర్షాకాలమున్ బోవవి
క్రమలీలన్ గుముదాంబుజన్ములలరం ♦ గాఁగా శసంఘప్రసూ

‡ దిష్టము = కాలము.

నములై చుక్కలు పర్వఁ జూచితనయం ♦ తం జేరు హంసాళి వా
నము రేఁ దూర్పునఁ దెల్పు ప్రాక్కుపటకాం ♦ తానందహాసంబునన్. ౨౫.

శా. జీవంజీవకులాన్న రాశిరజనీ ♦ శీతప్రభోద్వాహ వే
ళా వేల్లత్ప్రతిశీరసంతమసవ ♦ ర్ణాపశ్చిమద్యోతక
ప్రావీణ్యోదయసప్తపర్ణసుమనః ♦ పాంసూత్కరంబో యనన్
భావింపందగె శుభ్రదీధితిసుప ♦ ర్వశ్రేష్ఠదిగ్వీధికన్. ౨౬.

క. ఆకాశసింధుమధ్యత, లాకల్పితచంద్రమండ ♦ లాభిధవిలస
ద్వ్యాకోచపుండరీక, వ్యాకీర్ణపరాగములన ♦ నలరెను దీప్తుల్. ౨౭.

వ. వెండియు నప్పండు వెన్నెలలు పథికజనదండనమ్మునకు దండు వెడలెడు పుండరీక
కోదండుని యఖండితజయసమృద్ధిం గోరి యతని యండ జగమున మెండుకొను కుతూ
హలంబున నిండారం జల్లెడు బొండుమల్లియలతండంబు లనియెడు సేసవెల్లువల
తోఁడి హల్లీసకవిలాసమ్ముల నుల్లసిల్లుచు దివససమయంబున తృష్ణాపాసలవలన
నగు నాయాసంబు సైరించి కించిన్మీలితమ్ము లగు నయనంబులతోడఁ బరితాప
ముస్నహామహోగహానదహనమధ్యంబున సకుటుంబంబుగఁ దపంబు సవరించుచున్న
తమకు దైవవశంబునం దపఃఫలంబుచందంబునం బొడకట్టిన బృందారకబృందకీర
సందోహబింబం బగు నిందుబింబంబు లోచనానందంబు సంధిల్ల నాలోకించి బంధు
గులకెల్ల విందు సేయం బూని సితకైరవపరాగశర్కరాసారంబును నాలబ్ధముగ్ధ
హిమకరపరిణతకిరణదుగ్ధంబును నాముక్తనక్తంకరశిలాప్రసవదచ్ఛసలిలంబునుంగా
నామెతకుఁ జేరిన యనుంగులుం దాము బంతులు దీరి క్రొత్తవెన్నెలలఁ గుత్తుకల
బంటిగా మెక్కి తమతమ చక్కెరబొమ్మలం గలసి ముక్కుముక్కునం గదియ
నొక్కుచు నెక్కెక్కలం గదియ నక్కునం జేర్చి మిక్కుటం బగుతమిం
జొక్కుచుఁ గడుపు నిండినం ద్రోచుటకునుంబలె మెడలు నిక్కించి యెల్లదిక్కులం
గనుంగొను మదచకోరవారంబులతోరంబు లగు నానందరసపూరంబులం గలసి
యినుమడించెనో యనం దులకించుచు నంబురుహామిత్రుం డస్తశిఖరిశిరంబున
కరిగినది మొదలు నాత్మవల్లభులం బాసి యాయల్లకాతిరేకంబునం బొరలుజక్కవ
జవ్వనులమిక్కుటం బగు నెవ్వగలం గనుంగొనం జాలక పరితపించుచుఁ గమలా
కరాధిదేవత కన్నుమొగిడ్చెనో యన ముడింగెడు నెత్తమ్ములం దొరంగి యంగజ
బిరుదకాహళస్వనంబులం బోని నిజస్వనంబు లనియెడు మేలుకొలుపుపదమ్ముల
మేలుకొను నిందీవరంబుల కరిగి యందు నలుగడలం జిందు మకరందబిందువుల

సందడిం గ్రందుకొనునిందిందిరమ్ముల నసితోత్పలంబులం దీర్చిన యచ్చనగండులని
పట్టి యాడం బోయి యవియునుం దవుల కవలఁ జనం జూచి నవ్వెడు కామినుల
హాసంబుల కనుప్రాసం బై ప్రాణవల్లభులతోడ నపరంజిగిన్నియల నించినమధుర
మధురసంబులు మఱియుమఱియును బర్వంబునం ద్రావు పుష్పంబోణుల తార
ప్రహారభా పూరంబులచే రాజిల్లుచుఁ బ్రసవచాపప్రతాప దావానలంబున రజతా
చలంబును నీరుగాఁగఱంగిన సరసిజభవాండకుహరంబున వెల్లివిరిసెనోయన భువన
త్రయంబును నాక్రమించిన పంచబాణజనకుని పాదారవిందంబునం బొడమిన కారణ
గుణంబున భాగీరథీదేవి తానును లోకత్రయంబు నెల్లెడ నావరించం గడంగెనో
యన విష్ణుపదంబగు వియత్పదంబునకుం గలవిస్తీర్ణత్వంబు తనకులేకుంట కారణం
బేమియని విష్ణుపదంబ యగుకలశవారాశి వలన నంతయుం బెరిఁగివచ్చెనోయనం
జూపట్టె. అట్టియెడ యనువీరుండు పటకుటీరాంతరంబుననుండి యక్కుండినపు
రాధిపతికూఁతుం దలంచి మదనమాధవ మలయమారుత మధుకరనికర మత్తపర
భృత మరాళప్రముఖంబులగు మానసోద్దీపకంబులకు మఱియు మఱియునుం దల్ల
డిల్లుచు హల్లకరచితసముల్లసితపర్యంకభాగంబున మేను చేర్చి విరహాతాపంబునం
బొరలుచుం దనమనంబున. ౨౮.

శా. ఆమోమాతలిరాకనందగినకే ♦ లాచిన్నిచెక్కిళ్లడా
లాముద్దుల్ వెదచల్లుమోవిజిగియా ♦ యందంపుఁగన్దోయితీ
రామాయంపుమెఱుంగుఁగౌనుభళిరా ♦ యజ్ఞాత్ములందెందులే
దేమోమన్మథుఁడిట్టివస్తువునుదా ♦ సృష్టించెబల్ నేర్పునన్. ౨౯.

క. అనుచుంబలువిధములన, వ్వనజేక్షణఁదలఁచితలఁచి ♦ వసరుచురాఁడో
యినుఁడుదయశిఖరికనుచున్, ననుచుందమితోడవృష్ణి ♦ నాథుండుండన్. ౩౦

గీ. ఉడుపథంబనుకడలినె ♦ ల్లెడలఁబరఁగు, ఫేననికరంబుతత్ప్రభా ♦ యానిలంబు
కడఁగియొకమూలఁద్రోచెనాఁ ♦ గనఁగనయ్యె, నస్తగిరిఁదేజమెడలియ ♦ య్యమృత [కరుఁడు

మ. మదభృత్కోకిలకాకలీనినదశుం ♦ భజ్జన్యసంరంభపూ
ర్వదశాసూచకకాహళోగ్రరవమై ♦ వర్తిల్లుసైన్యంబుతో
నదయుండైమరుఁడాప్రభాతమునుబాం ♦ థానీకమున్నొంచినొం
చిదయన్ధర్మపువారవట్టెననమ్రో ♦ సెన్దాద్రుమచూడౌఘముల్. ౩౧

మ. అరవిందాప్తుఁడుపశ్చిమాచలతటిం ♦ బ్రాపించునవ్వేళనా
త్తరుచుల్ పాణునందుఁదాఁచుటమదిం ♦ దర్కించిచంద్రుండునా

త్తరుచుల్ పావకనందుడాఁచెసొయనన్ ◆ దర్శింపఁగానయ్యెమం
దిరదీపంబులు పాండురప్రకటదీ ◆ ప్తప్రక్రియాధుర్యతన్. ౩౩.

చ. కరములు చల్లఁజేసిజన ◆ కాండములన్ గుముదాప్తిఁగూడఁగా
నరసినరాజు నిట్టులప ◆ రాగతఖేదము చెందవచ్చునా
ఖరకరుఁడాత్మనీనవసు ◆ ఘాతకుడన్ భయమట్టెలోపలన్
బెరసియదృశ్యులైరటుగ ◆ ణింపఁగనయ్యెడు చక్రసైనికుల్. ౩౪.

ఉ. మేలుగఁబత్తినీస్థలిని ◆ మిక్కుటమౌతమినుండినాథుఁడా
హేళివివృద్ధరశ్ములర ◆ హింజనుదేరఁదదీయవర్ణకో
ద్వేలరుచుల్ నిజాంగమున ◆ వింతయికన్పడుచుండవెల్వడెన్
లోలగరున్నవాంశుకమ ◆ నోహరమైభ్రమరంబు గ్రక్కునన్. ౩౫.

శా. కాలంబోనిజధామమిత్రతతపో ◆ కంగుందురేరాజు పెం
పాలంబొందకభీమలక్షణగదా ◆ వాప్తిన్ గళత్ప్రాణుఁడై
దీలంఖుస్థలిఁ ద్రాలఁజూచిప్రమదో ◆ దీర్ణాస్యతన్ భాస్కర
శ్రీలెల్లన్ విలసిల్లలోకమునసం ◆ జీభూతదిక్చక్రమై. ౩౬.

ఉ. మీఱుపరాశఁజెందితన ◆ మీఁదిరుచిన్ విడనాడిపోవఁగాఁ
గైరవిణీవధూటిపత్రిఁ ◆ గన్గొనరోసిగళాంతనిర్గళ
దూర్ఖరిహిమాంబు నేత్రజల ◆ పూరముపత్రగణంబులందు వే
మాఱునుజింనువందవుచు ◆ మానకరాక మొగిడ్చెఁగన్నులన్. ౩౭.

సీ. ఉదయసౌధము చేరు ◆ సుగ్రభానునిబ్రోల, వలలు చెంగావిపా ◆ వడలనంగఁ
బతిరామికెదభీతి ◆ పరఁగమేలక్కనియున్న, శచిద్రిగంచలమున ◆ చాఛ్ఛయనంగ
నినురాకవినినంత ◆ నెనురేగునలరథాం, గములమనోద్ధరా ◆ గంబనంగఁ
బ్రాజ్ఞగహాళిక ◆ ప్రవరుండుదాల్చిన, సరిగంచుతోపుప ◆ చ్చడమనంగ
వైజయంతమహాహర్మ్య ◆ వర్ణనీయ, తప్తహాటకమయకుంభ ◆ ధామమనఁగ
నడరెనంతంతఁదోలుచక్కి ◆ నాక్రమించి, పూరితజగజ్జనానంధ్య ◆ పూర్వసంధ్య.

సీ. చక్రపాలనవృత్తి ◆ పవురుగాంచినమేటి, తమ్ములకెల్లమో ◆ దంబువాఁడు
గతవసువులుమర్లఁ ◆ గనినట్టిగుణశాలి, కర్మకోటులనెల్లఁ ◆ గనినవాఁడు
దోషోన్నతినిబాయఁ ◆ ద్రోచినతేజస్వి, యామ్నాయపూర్ణదే ◆ హంబువాఁడు
తన్నుఁజెందినరాజుఁ ◆ దన్పుపూర్ణగుణుండు, జడగతినిరసించు ◆ కడిమివాఁడు

దనరెఁబూర్వధరాధినా ♦ థప్రశస్తి, సేవ్యమానసింహాసన ♦ శిఖరమందు
మహితధాత్రీసురాఘన ♦ మంత్రసక్తి, ఖండితాత్మీయదుర్వ్యధ ♦ కాండుఁడగుచు.

వ. ఇట్లేఁగునఁ బ్రభాతసమయంబగుటయు నయ్యదుకులాధ్యక్షుండు తుంబురునారద
ప్రముఖులగుదివ్యగాయకులు ప్రాభాతికగానసంపద మేలుకొలుపులు వినిపింప
నిదుర మేలుకని సుఖశయనంబు నుడుగునుద్ధవాదుల నాదరావలోకనంబుల
నాదరింపుచుఁ గాల్యకరణీయంబులు దీర్చి వివిధమణిగణస్యూతవిచిత్రతర సభా
భవనసదృశంబుగా సంఘటించినపటకుటీరసభాంగణంబునఁ దద్దయునమర్చిన
యుదిరకెంబట్టుగద్దియ నధివసించి బిరుదపదకటకచటులరుచిపుంజరంజిత
చరణకంజాతయుగళుండును హిమసలిలసేకసమ్మిళితగంధసారకస్తూరికావిరచితని
జాంగరాగతరంగితసౌరభాభోగసంవాసితభూనభోంతరుండును హారకేయూరకం
కణాంగుళీయకమకరకుండలకిరీటాదిదివ్యభూషణభూషితుండును హిమసలిలసేక
సమ్మిళితగంధసారకస్తూరికాది నిఖిలజనమనోహరమాల్యకనకవసనాలంకృతుండును
నగుచు మంత్రిజనబుధకవీంద్రవైణికవారకాంతామణులు సముచితప్రకారంబునం
గొలువ నిలువుటద్దంబున నిజరూపసౌష్టవంబాలోకించి యంగవంగనృపాలపుంగ
వుల కుమారులు వింజామరలును మాళవుండు తాళవృంతంబును గుకురునరపతి
ముకురంబును గాశ్మీరుండు కాళాంజియును గళింగుం డడపంబును సౌరాష్ట్ర
మండలాధిపతి గిండియును బూని తమతమ యవసరంబు లెఱింగి తరంగితభక్తిం
గొలువ వేత్రధరసహస్రసాహోనినాదంబుల మేదిని యదర ధరగహ్వరంబులం బ్రతి
ధ్వానంబులు నిగుడ బహువిధోపాయనపురస్సరాయాతనూతనభూతలాధీశ్వరప్రణా
మంబులు కటాక్షవీక్షణంబుల నంగీకరించుచు నుదంచితవైభవంబుననుండి సైన్య
సుగ్రీవమేఘపుష్పవలాహకతురంగమసంగతంబును గింకిణీశతసంకులంబును ననర్ఘ
మణివిభూషితస్తంభసంభృతవైనతేయచిత్రకేతనవిభూషితంబును నగుశతాంగం
బు నధిరోహించి ద్వారకానగరంబున కనుగందలంచి కదలి రైవతగిరిసమీపంబు
చేరి తదీయశిఖరసౌభాగ్యంబులు కనుంగొన నవధరించుసమయంబున. ౪౦.

కం. దారకుఁడపుడిట్లనియెన్, శౌరికి రైవతకశిఖర ♦ సాలవిశాల
శ్రీరుచిరతావలోకన, హారికి మృదుమధురసముచి ♦ తాలాపములన్. ౪౧.

సీ. శిఖరసంశ్రయణావి ♦ ష్కృతదిత్యపత్యరా, డత్యాహితాదిత్య ♦ పత్యనీక
మవిరళకటకఘూ ♦ సవిలోలగవిరధ్య, దీర్ఘీకృతతుషార ♦ దివసచయము.

సానుపతజ్ఝరీ ♦ జలకణవ్యాక్లిప్త, ఋక్షసమ్మిళితాంత ♦ రిక్షపదము
నైకగైరికవిభా ♦ నవకోరకచ్ఛటా, సురుచిరకింశుకా ♦ శోకభూజ
మిందెకనుఁగొంటెకిన్నరీ ♦ మృదులగాన, తానమానవితానైక ♦ తానభుజగ
రాజఫణరత్నసతతనీ ♦ రాజనోప, చారశుభహారియీనగ ♦ స్వామిశౌరి. ౪౨.

ఉ. కంజభవాదిదేవతలుఁ ♦ గానని దేవరరాక కెంతయున్
రంజిలియీనగాధరము ♦ గ్రక్కునఁబూవులదోయిలిచ్చెనా
మంజుగతింజెలంగెడుప ♦ మద్గనితంబతటీగళద్ఝరీ
సంజనితాంబులేశవిల ♦ సన్నవమౌక్తికపాళి నెల్లెడన్. ౪౩.

ఉ. ఎన్నఁగరోహణాచలము ♦ హేమనగేంద్రమురూప్యభూధరం
బున్నిజసంపదన్ సకల ♦ ముత్భవదర్థముదెచ్చియీగిరిం
బన్నుటఁజేసియోయనఁగ ♦ భాసురరత్నసువర్ణరూప్యమై
మిన్నులుముట్టుచున్నయది ♦ మించినవేడ్కఁగనుంగొనందగున్. ౪౪.

సీ. కమలాకరానేక ♦ విమలాంబుజానీక, కమలావిభూషితా ♦ గ్రస్థలంబు
మలయానిలస్ఫుర ♦ ద్వలయావృతనికుంజ, నిలయామరీగాన ♦ నిబిడతరము
మణిలసన్మేఖలా ♦ ఘృణిగణభూతత, రణికిరణోచ్ఛటా ♦ రంజితంబు
కేసరాళిపరాగ ♦ ధూసరాళినినాద, మాసరాక్రీడన ♦ మంచితంబు
కిసలవిసరఫలాస్వాద ♦ మసృణనినద, పికశుకవ్రాతసంతత ♦ భీతపథిక
నిబిడసహకారతరువాస♦నిత్యసుఖిత, గరుడగంధర్వయక్షమీ ♦ గిరివరంబు. ౪౫.

సీ. శిఖరచరత్స్వర ♦ స్త్రీదర్పణీనూత, మసృణపార్శ్వకచంద్ర ♦ మండలంబు
సంతతాకృష్టకీ ♦ చకికాగ్రవిచ్ఛిన్న, కరకాద్వియుక్తన ♦ క్షత్రకంబు
కనకవప్రాంభోజ ♦ గర్భసంవ్యానిత, నిర్మలమందాకి ♦ నీఝరంబు
బాహుప్రతాపప్ర ♦ భావవిభ్రాజిత, వీతగైరికరజో ♦ విస్తృతంబు
వకుళవన్యాసముల్లస ♦ న్ముకుళగంధ, లోలవాచాలమధుకరీ ♦ జాలనినద
సంతతాకృష్టసంతాన ♦ సతతసక్త, మధుపనికరంబుకంటెయి ♦ మ్మహీధరంబు.

క. అనిదారుకుండుతనతో, వినుతోక్తులఁ దెలుపవృష్ణి ♦ వీరుఁడుమిగుల
న్మనమునదలరుచునగ్గిరిఁ, గనుఁగొనుచుంజనియెనుచిత ♦ గతులంబురికిన్. ౪౭

ఉ. పౌరులతోడవేడ్కబల ♦ భద్రుఁడుసాత్యకితోడ నగ్రకన్
భేరులుఁదూర్యముల్మొఱయ ♦ బృంహితహేషితసింహనాదముల్
బోరుగలంగుచుండయదు ♦ పుంగవుఁడప్పురిరాజవీధులన్

శారవిలాసినులనఁగ ♦ వచ్చెవియచ్చరలిచ్చ మెచ్చఁగన్. ౪౮.

క. ఈరీతివచ్చి శౌరిహ, జారమ్మునవిలిచియనిచి ♦ జనపతులనిజా
గారములకుబహుకక్ష్య, పారంపరిఁగడచిచేరి ♦ బంగరుమేడన్. ౪౯.

క. మన్ననలరెడియుడిగఁపుఁ, గన్నెలునీరాజనములు ♦ కడుభక్తినొసం
గన్నలినాక్షుఁడు గైకొని, యున్నతసౌఖ్యమునవలరు ♦ చుండెడినంతన్. ౫౦.

గీ. అపుడుబలభద్రునావన ♦ నిపుణులైన, దండనాథులుగుమిగూడి ♦ తగువితానఁ
బురముకైసేయఁబనిచినఁ ♦ బరిజనములు, మహితశోభనవస్తుసా ♦ మగ్రిమెఱయ.

సీ. మేరువుల్ ఘటియించి ♦ రారూఢసురవర, ప్రతిమావిశేష సం ♦ పదలతోడఁ
గ్రముకముల్ నాటించి ♦ రమితఫలావళి, భరనమత్కదళికా ♦ తరులతోడఁ
గట్టిరితోరణాల్ ♦ కమనీయసహకార, పల్లవచామర ♦ ప్రతతితోడఁ
బరిమళంబులునించి ♦ రురుతరాగరుధూప, హిమసలిలావనే ♦ కములతోడ
హరువుపఱచిరిపందిరుల్ ♦ గురువిచిత్ర, సమధికాంశుకకాయమా ♦ నములతోడ
నలవఱిచిరెందుఁబచ్చల ♦ యరుగులందు, రంగవల్లులునవరత్న ♦ రాజితోడ. ౫౧.

చ. రహిదళుకొత్తువింతయప ♦ రంజిసురుంజులనాడుసూత్రపున్
బహుతరచిత్రభామినుల ♦ పైసురవర్యులుచల్లినట్టిప
స్సహితసురేంద్రభూరుహసు ♦ మప్రకరమ్ములమాడ్కిఁగౌతుకా
వహముగుచుంజెలంగెఁబురి ♦ వాడలముత్తెపుమ్రుగ్గులెల్లెడన్. ౫౩.

సీ. కలయనెల్లెడఁజల్లు ♦ తెలితేటపన్నీటి, కాల్వలఁదగజల ♦ కంబులాడి
చకచకత్కనకవ ♦ స్త్రచ్ఛటాచరణంబు, చందనకాశ్మీర ♦ చర్చగాంచి
వివిధప్రసూనమా ♦ ల్యవితానమునమించి, వరధూపవాసనఁ ♦ బరఢవిల్లి
సముచితాలంకార ♦ సరణిచేఁదనరారి, తౌర్యత్రికస్ఫూర్తి ♦ దగవహించి
యపుడునగరాధిదేవత ♦ హరివివాహ, శోభనారంభసముచిత ♦ వైభవమున
బహుపురంధ్రజనమ్ముల ♦ పగిదిఁదాను, నమితశృంగారవిస్ఫూర్తి ♦ నతిశయిల్లె. ౫౪.

సీ. ఏచాయఁజూచిన ♦ మోచామహీరుహ, పూగావృతరసాల ♦ పూర్ణగృహము
లేవంకఁజూచిన ♦ నిందీవరేక్షణా, నుక్షణాచరితగీ ♦ తెక్షణంబు
లేకోటఁజూచిన ♦ వాచాటమధుకరీ, వారభృత్సుమదామ ♦ వైభవంబు
లేవీధిఁజూచిన ♦ హితసమీహితవాద్య, హృద్యతాండవితబ ♦ ర్హిణగణంబు
లెచటఁజూచినబహురత్న ♦ ఖచితరచిత, చిత్రనవభిత్తికావేది ♦ చిత్రతంబు
నగుచునలకాపురంబుతా ♦ నగుచుశ్రీకిఁ, గాపురంబయ్యెనలద్వార ♦ కాపురంబు

వ. అట్టిసమయంబున విదర్భదేశాధీశ్వరుం డగుభోజనరపాలుండు కృష్ణుండు స్వయంవరోత్సవసమయంబున రాక్షసవివాహంబున శిశుపాలప్రముఖు లగునృపాలురం బరిభవంబు నొందించి తనతనూభవ నపహరించుటయు నది సహింపక నిజతనూజుం డగురుక్మి యెదిరి కదనంబునఁ బరాజితుం డగుటయును సప్రకారంబుగాఁ దెలిసి తత్క్షణంబునఁ బత్నీపరిజనసమేతంబుగాఁ గదలి ద్వారకానగరసమీపంబునకు వచ్చి తనరాక వసుదేవబలదేవుల కెఱుంగఁ జెప్పి పంచిన వారును దదాగమనంబునకు నెంతేని సంతసిల్లుచుఁ గృష్ణసమేతులై యతని నెదురుకొని తగువిధంబునఁ బూజించి పురంబునకుం దోడి తెచ్చి యుచ్చతరహర్మ్యశోభితంబును నుచ్చావచసువర్ణవితానమాననీయంబును నుపమానరహితసమస్తవస్తుసమన్వితంబును నగు నొక్క భవనరాజంబున విడియించి నాఁటి రేయి వివాహముహూర్తంబనియునుం దెలిపి రుక్మిణీదేవిని దదావాసంబునకనిచి పరిణయాలంకృతం జేయింపుఁడని స్వకీయకార్యంబులు నిర్వహించుచుండి రంత. ౫౬.

క. ఇభరాజవరదు పెండ్లికి, రభసంబున మీరలిపుడు ♦ రావలెననుచున్
శుభపత్రికలంపించిరి, బుధవిభులకుఁ బుడమిగలధ ♦ రిత్రీశులకున్. ౫౭.

సీ. వచ్చిరి హరిదధీ ♦ శ్వరు లెల్లఁ బదినూరు, కన్నులమన్నీఁడు ♦ మున్నుగాఁగఁ
జనుదెంచి రవనిభృ ♦ త్స్వాములు పదియారు, వన్నెగుబ్బలిరాజు ♦ మున్నుగాఁగఁ
బొడసూపిరి భుజంగ ♦ పుంగవుల్ రహిమించు, వెన్నునిబలు సెజ్జ ♦ మున్నుగాఁగఁ
గనుపట్టి రప్సరో ♦ వనితలు కరివేల్పు, గన్నయన్నులమిన్న ♦ మున్నుగాఁగఁ
దోఁచి రప్పుడు సప్తర్షి ♦ తుల్ మరీచి, మునికులధురంధరుండటు ♦ మున్నుగాఁగ
భువనకమనీయపరిణయో ♦ త్సవవిభాస్వ, దంబురుహనాభసందర్శ ♦ నార్థులగుచు.

క. చనుదెంచిరి వలుదిక్కుల, జనపాలకు లపుడు తురగ ♦ సామజరథకాం
చనవసనరత్ననివహం, బునుగానికగాఁ గఁగొనుచు ♦ మురహరుపురికిన్. ౫౯.

గీ. యాదవేంద్రపురోహితుఁ ♦ డైనగర్గ, మునివరుఁడు గీష్పతియుఁ దాను ♦ ముదముదవర
దేవతాధీశ బలవసు ♦ దేవముఖ్యు, లైన పెద్దలయనుమతి ♦ నపుడు గాంచి. ౬౦.

క. హరికిన్ విదర్భశాతో, దరికిం గల్యాణసముచి ♦ తక్రియలనలం
కరణములు సేయ వేలుపుఁ, దరుణులనైదువులఁ బనిచె ♦ తగుశుభవేళన్. ౬౧.

చ. సురవరదత్తమండనవి ♦ శోభితుఁడై హరియిట్లు రుక్మిణీ
పరిణయకాంక్షనుండుటయు ♦ భానుఁడు గన్గొని తాను నట్లయా

హారికినవర్ణరత్నముల ♦ నర్పణసేయఁదలంచియోయనన్
బరువడిఁబశ్చిమాంబునిధి ♦ పారమునన్ నిలిచెన్ ద్యురాధ్యతన్. ౬౨

ఉ. ద్వారవతీమహోత్సవవి ♦ ధానవిజృంభితదివ్యచందన
శ్రీరుచిరోరుధూపములు ♦ రిక్కలజాడల నెల్లదిక్కుల
న్దోరములైకనంబడియె ♦ నోయన నిక్కటనాక్రమించె మా
యూరశిరోధినీలరుచి ♦ నుర్వినునింగియునంధకారముల్. ౬౩

ఉ. అప్పురుషోత్తముండు ప్రమ ♦ దాతిశయంబునఁ బెండ్లియాడున
య్యొప్పిదముంగనుంగొనఁగ ♦ నూర్జితవైభవలీలవచ్చున
మ్మప్పుడమూఁడుకోట్లసుర ♦ ముఖ్యులముంగలిదివ్వటీలనన్
జొప్పడెఁజొక్కపుంరుచులఁ ♦ జుక్కలుదిక్కులజాడలేర్పడన్. ౬౪

క. తోఁచెనలచంద్రబింబము, ప్రాచిన్ సురగజము నెక్కి ♦ పద్మాక్షుఁడురా
నౌచితిఁబట్టఁగఁదెచ్చిన, భూచక్రపుగొడుగనంగఁ ♦ బూర్ణద్యుతులన్. ౬౫

గీ. అఖిలభువనాధిపతియైన ♦ యబ్జనయను, పరిణయార్థమ్ముగ విరించి ♦ పద్మజాండ
మునసుధాలేపమొనరించె ♦ ననఁగఁదనరెఁ, బండువెన్నెలకన్నుల ♦ పండువగుచు.

గీ. అపుడువసుదేవబలదేవు ♦ లాదిగైన, యాదవేంద్రులువృష్ణ్యంధ ♦ కాదులైన
బంధుజనములుఁగూడిత ♦ త్పద్మనయనుఁ, జేరిశుభలగ్నమెదిరికాం ♦ క్షింపుచుండ.

శా. చేరెన్ లగ్నమటంచుగర్గమునిసూ ♦ చింపంగఁదానున్ సునా
సీరుండట్లన హెచ్చరింపనపుడా ♦ శ్రీకృష్ణుఁడైరావత
స్ఫారోన్నద్ధతలాధిరూఢుఁడగుచున్ ♦ బంధుప్రియంభావుకో
దారశ్రీవిభవంబునన్ వెడలెభో ♦ జావాసమున్ జేరఁగన్. ౬౮

వ. ఇవ్విధంబున నవ్వసుదేవనందనుండు విబుధవరవేదండాధిరూఢుం డగుచు నిమహాస్వమూహాధవళితం బగుపూర్వనగశృంగభాగంబునం బొదలుకుముదవనబాధవునిచందంబున విమలతరపృథులముక్తాఫలలలితధవళాతపత్రసహస్రంబు లయొడుతారకానిలయంబులనడుమ విలసిల్లుచు నుచ్చైశ్శ్రవంబు నెక్కి యగ్రప్రశంబున వివిధరత్నవిచిత్రితం బగువేత్రంబు కేలం బూని సందడి దొలంగఁ జేయుచునుచుఁ జనుపురందరునిహస్తప్రకరణంబునం బొడమినకారణగుణంబునంబలె నుచ్చావచవాద్యధ్వనుల తమ్మటపటహభేరిభాంకారంబు లంబరతలంబున నిగుడుదివిజమురరావమ్ములతోడంగలసి నికటతటరైవతకశైలవిశాలగుహాగేహాసందోహావిదళనటోపంబు నాపాదింప సకలజనహృదయకుహరంబుల సమధికప్రవీణతంజేసి నాన

విధంబు లగురూపంబుల మెలంగుచాతుర్యంబు నిజప్రసాదంబునం గన్నవైశ్వాన
రుండు విశ్వనియంతయయి తనపురోభాగంబున ననేకరూపంబుల నాశ్రయించి
సేవించుచున్నవాఁడో యన సద్యోఘృతప్రదీపితజ్వాలాయుతంబు లగుకరదీపికా
యుతంబులును సాంద్రప్రభాన్వితంబు లగుచంద్రజ్యోతులును నగ్నియంత్రంబులును
విశ్వంభరావలయంబునం గలయం బర్వి పట్టపగలు గావింపఁ గందర్పసుందరీసం
దోహంబులు వేనవేలుగూడిన నివ్విదర్భరాజకన్యారత్నంబు గాలిగోరునకుం
బోలం జాలరిదికనుంగొనుమని యరవిందసంభవుండు యాచకులధురంధరున కెఱుంగఁ
జేసి మెచ్చువడయుటకును దెచ్చెనో యనం గరకిసలయమ్ముల నిక్షుఖండంబులుం
దాల్చి యనన్యకన్యాసామాన్య రూపలావణ్యభాజనంబు లగువేశ్యాజనంబులు ముం
గల న్నడువ మాధవోత్సవసమయంబు గావున మాకందమాధవీమల్లికాదిలతావితా
నంబులు మానినీరూపంబులు దాల్చి కిసలయకుసుమఫలప్రముఖంబు లగుకానుకలం
బూని చనుదెంచెనో యనం గొంద ఱరవిందగంధులు క్రంతలు దీరి హరివాణమ్ముల
మాంగలికవస్తుసామగ్రిం బూని యంగభవసామ్రాజ్యాధిదేవతలతెఱంగున ముం
గలం జనుదేర నవక్రతరమహాచక్రవైభవంబున విరోధిచక్రంబులం దునుముని మ్మహా
మహుని సూనసాయకంబుల సాధింపనలవి యగునే యని కుసుమకోదండుండు
పుండరీకాక్షుమీఁద నడరింప నిజమాయాప్రభావంబున సృజించినచంచలేక్షణా
రూపచక్రనియుతంబులతెఱంగునం గ్రాలు జనవినిర్మితంబు లగుయంత్రచక్రంబుల
సవ్యాపసవ్యమార్గంబులం బరిభ్రమించు మించుబోణుల విలోకించుజనలోచనాసే
చనకభావం బంగీకరింప యదువంశభూషణ భవదీయపరిణయమహోత్సవంబు నవ
లోకింపఁ గింపురుషగంధర్వప్రముఖబర్హిర్ముఖులు గగనాంగణంబునం బట్టుచాలక
నెట్టుకొని యున్నవారు వీరిం గనుంగొనుమని సారెసారెకుం జేతు లెత్తి చూపు
గతి వందిమాగధు లున్నమితహస్తులై నిజబిరుదగాథాకథనప్రవీణతం దనరి నప
రిమితభక్తిభావంబునఁ బాదచారులై వచ్చునంగవంగకళింగకాశ్మీరలాట భో
టాదిభూపతులచరణపల్లవంబులు మేదినీతలన్యాసంబునకుం దాళఁ జాలునే యని
తదీయభాగ్యాధిదేవతలు సవరించిపఱచినవెలిపట్టుపావడలపడువున జానుదఘ్నం
బుగా నిగుడఁ బణ్యపుణ్యాంగనాజనపరితఃప్రకీర్యమాణకుందమందారమల్లికాప్ర
ముఖకుసుమవిసరంబులు తారాపథంబున కడరి హరిచందనకుసుమలగ్నంబు లగు
భృంగంబుల ధరాతలంబునకు నాకర్షింప నట్లనన్యనృపసామాన్యవైభవంబున భో
జవరపాలకబిడౌజుని నగరిహజారంబుఁ జేరం జనుసమయంబున.

శా. భోజక్ష్మావరుఁ డాప్తబంధువులతోఁ ♦ బుణ్యాంగనాశ్రేణితో
లాజల్ పూవు లనక్షతంబులు నుమో ♦ లంజల్లుచున్ వేడ్కమై
రాజీవాక్షు నెదుర్కొనంగ నతఁడుం ♦ బ్రాలేయశైలోన్నత
శ్రీఁ జూపట్టు గజంబు డిగ్గె బహువే ♦ దధ్వానముల్ మీఱఁగన్. ౬౯.

గీ. ఇటుల నైరావతము డిగ్గి ♦ కృష్ణుఁ డపుడు, సాత్యకికరంబుఁ గరమున ♦ సంఘటించి
నృపతిమంత్రిజనప్రద ♦ ర్శితసమగ్ర, మార్గమున మామనగరు ప్రే ♦ మమునఁ జొచ్చి.

క. భోజనరపాలు పనుపున, రాజీవాక్షుండు పద్మ ♦ రాగశిలాసం
యోజితవితర్దికాస్థలి, శ్రీఁ జెలఁగెడు పెండ్లిపీటఁ ♦ జేరె ముదమునన్. ౭౧.

క. కొనలుత్తరముగఁ బఱచిన, కనకపుఁ జేలమున సిరులు ♦ కన్పడు లీలన్
నును పెండ్లిపీట నెలకొనెఁ, గనకాంబరుఁ డపుడు ప్రేమ ♦ గడలుకొనంగన్. ౭౨.

క. మధుపర్కమొసఁగె భోజుఁడు, మధువైరికి విహితగతిస ♦ మగ్రపుభక్తిన్
బుధవర్ణ్యానీతంబగు, సుధచే నడుగుల నుగడిగి ♦ శోభనలీలన్. ౭౩.

ఉ. బంగరుగిండి వంచి తన ♦ భామిని తోయము వోయ భోజరా
ట్పుంగవుఁ డప్పురుక్షిణివి ♦ భూషితహస్తముఁ గేలఁ బట్టి య
య్యంగజకోటిసన్నిభున ♦ కర్థిలి మీఱఁగ ధారవోసెను
త్తుంగమృదంగవాద్యముల ♦ తో సురదుందుభు లంటి మ్రోయఁగన్. ౭౪.

గీ. కాంచనాద్రివిచిత్రసం ♦ గతవిచిత్ర, బహుళరత్నపరిస్ఫూర్తి ♦ సహితముగుచుఁ
దనరు తెరవంచి రైదువల్ ♦ దగుచు హర్షాత్మ, సమయమిది చేరెనని బృహ ♦ స్పతి వచింప.

క. గుడజీరకంబు లర్థిలిఁ, బడఁతుక శిరమున ఘటించెఁ ♦ బద్మాక్షుం డ
ప్పడఁతుకయు విభుని యౌదల, నిడియెన్ గుడజీరకము స ♦ మాహితరీతిన్. ౭౬.

చ. అతులితభక్తి మైఁ బ్రియవ ♦ యస్యలు నెన్నడుమంటి పట్టి యు
న్నతముగ నెత్తముత్తెములు ♦ నాతి నుదోయిట నుంచి పట్టియ
చ్యుతుతలఁ బ్రాలువోసె మధు ♦ సూదనుఁ డుందలఁ బ్రాలువోసె న
య్యతివ కనమ్మహోత్సవము ♦ నందఱుఁ గన్గొని రంత వేడుకన్. ౭౭.

క. గళమునఁ గట్టెన్ హరి మం, గళసూత్రము సతికి విప్ర ♦ కాంతలు జయమం
గళముల్ పాడంగ నన, గ్గళభేరీధ్వనులఁ బుడమి ♦ కడు నదరంగన్. ౭౮.

గీ. శ్రీజయమ్ములు మీఱెంచు ♦ సిద్ధమనుచు, తెలుపు లీలఁ బ్రదక్షిణా ♦ ర్చులఁ జెలంగు
పావకునకు జగత్ప్రియుం ♦ భావుకునకు, లాజలిప్పించె శౌరియా ♦ లలనవలన. ౭౯

మ. అలరుం గ్రొన్ననపుజోదుకయ్యమునమా ♦ యబ్జాక్షిపాదాంబుజ
మ్ములనీవంటుటయేమగర్భనముమే ♦ మంజూడ నేదీపద
మ్ములనంటన్వలెనంచుఁదత్సఖులుగుం ♦ ఫుల్ గూడియాడన్ సతీ
తిలకంబంబ్రమితలంబునన్నెకలుహ ♦ ంచెన్ విభుండంతటన్. ౮౦.

గీ. కొంగుముళ్లతోడ ♦ నంగజజనకుండు, ప్రీతినాచరించెఁ ♦ బ్రియయుఁదాను
నాగమోక్తవిధుల ♦ ననలప్రదక్షిణ, మ్బుషివరాంగనాసి ♦ రిక్షణములు. ౮౧.

క. ధ్రువపదముఁ జెందిమనుమని, వివిధముతొదీవెనలును ♦ వేడ్కమెసంగన్
ధ్రువపదముఁగాంచెనయ్యా, దవముఖ్యుఁడులలనతోడఁ ♦ దద్దయుఁబ్రీతిన్. ౮౨.

ఉ. శ్రీరతిభారతీసతుల ♦ చెల్వముగెల్వఁగనోపునీమహో
దారచరిత్ర్నుగానెదన ♦ హర్నిశముల్ వసియింపగెల్వమీ
దోరతివైభవస్ఫురణ ♦ మాస్త్రులనంచుబుధుల్ వచింపఁగా
నారతియిచ్చిరప్పుడమ ♦ రాంగనలారతిఁ జెనితంద్రికిన్. ౮౩.

సీ. నడలకైఁపులమెప్పు ♦ నగములాయివియంచు, జనులెంచఁదగుమత్త ♦ సామజములు
పగదీర్పగాడ్పుక్రిం ♦ దుగఁజేసినమ్మగాళి, పాటింపఁదగుమేటి ♦ ఘోటకములు
మేరుశృంగములెట్లు ♦ మెలఁగనేర్చెనుయంచుఁ, గనఁదగుఘనశతాం ♦ గములగములు
సౌదామినులకెట్లు ♦ చపలతదొలఁగెనో, యనమించుచున్నక ♦ న్యాజనమ్ము
లపరిమితరత్నరాసులు ♦ నమితకనక, భూషణనికరములునున ♦ పూర్వగంధ
బంధురద్రవ్యములునుఎ ♦ ద్భక్తిమెఱయ, నల్లునకునిచ్చెభోజభూ ♦ వల్లభుండు.

క. సురమణులుతమకుఁగలభా, సురమణులన్వీడుచుదువఁ ♦ జూచిన్రపాలు
ర్వరుస మెసంగిరితమతమ, కరిరథహయరత్నరుచిర ♦ కనకాంశుకముల్. ౮౪.

గీ. శేషహోమాంతముగనిట్లు ♦ శ్రీసఖుండు, భోజకన్యావివాహంబు ♦ పూర్ణపరణిఁ
బ్రీతినెరవేర్చియుచితమా ♦ రీతినరిచె, నింద్రముఖులైనసకలబ ♦ ర్హిర్ముఖులను. ౮౫.

క. నానాదేశాగతులగు, భూనాయకులెల్లఁజనిరి ♦ పురములుచేరన్
శ్రీనాథునిచేతనుస, న్మానంబులువడసిభటుల ♦ మాత్యులుగొలువన్. ౮౬.

శా. సింధుఘ్వాంశముహానముల్ చెలఁగెగం ♦ జిల్లెన్ద్రుమంబుల్లస
ద్గంధంబుల్ విసరెన్ సమీరములువే ♦ డ్క్ నైశముల్గూడుచున్

గంధర్వుల్దివిఁబాడియాడిరిమరు ♦ త్కంజాతపత్రేక్షణల్
ధింధింధిక్కిటధిమిక్కిటధి త్తికధితోం ♦ ధీయన్నినాదమ్ములన్. ౮౭.

వ. ఇట్లు సకలలోకేశ్వరుండును సనకసనందనాదిమహాయోగిజనసంస్తూయమానసాంద్రతరవిభవుండును నగునయ్యాదికులేశ్వరుండు భోజకన్యావివాహంబు విహితప్రకారంబున నంగీకరించి యయ్యరవిందగంధితోడ నిజమందిరప్రవేశంబు గావించి గురుబుధసమాజంబు నుచితంబగుతెరంగున నంబూజించి బంధుజనంబు లగునందకుకురముఖవసుంధరాధురంధరులకు సింధురశతాంగాదిప్రదానంబుల నపరిమితసత్కారంబులఁ బ్రహర్షంబు సంఘటించియు మిత్రవర్గంబులకు ధాత్రీతలవిచిత్రంబు లగుభవ్యవస్తుసందోహంబుల నిప్పించియును గాయకభరతవందిమాగధప్రముఖసేవకజనులకు ధనకనకవస్తువాహనాదిప్రదానంబున నింపు సంపాదించియును విద్యావిశేషంబుల మెఱయు విబుధజనంబులం దనియించియును మఱియునుం దక్షిణయాచకజనంబుల మనోరథంబులు సఫలంబు గావించియు విశ్వజనవిస్మయావహవితరణకళాధురంధరుండై వెలయుచుండె. ౮౮.

సీ. బహుసస్యసంపూర్తిఁ ♦ బరిఢవిల్లెధరిత్రి, నెలమూఁడువానలు ♦ నిండికురిసె
ఘృతదధిక్షీరాభి ♦ వృద్ధిమందనుగల్గె, నన్యోన్యవైరంబు ♦ లడఁగెధరణి
నిచ్చఁగల్యాణంబు ♦ పచ్చతోరణమయ్యె, ప్రజలెల్లనుత్సవ ♦ పరతమనిరి
యారోగ్యభాగ్యంబు ♦ లభివృద్ధివహియించె, గ్రహగణంబనుకూల ♦ గతులఁదిరిగె
జారచోరాదిబాధాప్ర ♦ సంగముడిగె, భూరుహంబులుసతతంబు ♦ పూచికాచి
చెలఁగిఫలియించిశుకవృత్తి ♦ నలరుచుండెఁ, గృష్ణదేవుఁడుసామ్రాజ్య ♦ మేలుచుండ.

వ. అని యివ్విధంబున రుక్మిణీకల్యాణంబు శుభవచనరచనాచమత్కారపూర్వకంబుగాఁ జెప్పిన యప్పరమయోగీంద్రునకుం బ్రణమిల్లి పరీక్షిత్క్షితీశ్వరుండు కృతార్థుండనైతి నని యమ్మహామహుని సముచితప్రకారంబునం బూజించె నంత. ౯౦.

మ. బలిగేహప్రతిహారహారమయశుం ♦ భచ్చిత్రడోలాలస
జ్జలజాగారవిహారహారనుతిహా ♦ క్చాతుర్యమాదుర్యపు
ష్కలితప్రీత్యవతారతారణకళా ♦ సంరంభదీక్షాసము
జ్జ్వలచిత్తప్రవిచారచారణమహా ♦ శ్చర్యావహప్రాభవా. ౯౧.

క. శ్రీరంగహర్మ్యనిలయా, సారంగవరావనప్ర ♦ సక్తఘనదయా
పారంగతభక్తచర్యా, స్వారంగానీతదివ్య ♦ సాలాభ్యుదయా. ౯౨.

పంచచామరము. కనన్మణీఘృణిప్రకాండ ♦ కాళియాహిమస్తక
ప్రణృత్యక్షప్తతాళభేద ♦ పాటవప్రపంచకా
ఘనాఘనద్యుతిప్రకాశ ♦ గంధవారణక్రియా
వినోదభృత్తనూవిభాభ ♦ విష్ణుదివ్యసౌరభా. ౯౩

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణావాప్త చతురతరసాహితీవైభవ చక్రసామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణిత మహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వర నామధేయప్రణీతంబైన భోజసుతాపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వమ్మును బంచమాశ్వాసము.

సమాప్తము.